శ్రీః
మహాకవిశ్రీకాళిదాసవిరచితమ్

# కుమారసమ్భవమహాకావ్యమ్

## రామోరావిరచితమృణాళినీవ్యాఖ్యాసహితమ్

వల్లభదేవవిరచితయా పఞ్జికయా సంస్కృతవ్యాఖ్యయా చ సముల్లసితమ్
ఉమాప్రదానో నామ షష్ఠః సర్గః



**రావి మోహనరావు,** M.Sc., M.A. (Sanskrit)
లెక్చరర్
4-103, I.L.T.D. Colony Extn., Kothapet, CHIRALA-523157



శ్రీః
మహాకవిశ్రీకాళిదాసవిరచితమ్
**కుమారసమ్భవమహాకావ్యమ్**
రామోరావిరచిత మృణాళినీవ్యాఖ్యా సహితమ్
వల్లభదేవవిరచితయా పఞ్జికయా సంస్కృతవ్యాఖ్యయా చ సముల్లసితమ్
ఉమాప్రదానో నామ షష్ఠః సర్గః

ప్రథమముద్రణ : ముక్కోటి – ఏకాదశి **05-01-2012**
ప్రతులు : **500**
పేజీలు : **226**
వెల రూ. : **160=00**


**RAVI MOHAN RAO,** M.Sc., M.A. (Sanskrit)
Lecturer, V.R.S. & Y.R.N. College, Chirala-523157

**Residence:**
4-103, I.L.T.D. Colony Extn.,
Kothapet, CHIRALA - 523157
Cell :**94401 15411, 9052256311, 08594 - 234038**

D.T.P.:
**MR LASER PRINTS**
Chirala
Cell: **9849976054**



Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

# సంస్తవము

"కవికులగురుః కాళిదాసః" అన్నది సంస్కృతలోకోక్తి. రామాయణం పురాణశైలిలోని కావ్యము. కావ్యశైలిలోని ఆదికావ్యం కాళిదాసునుంచి మనకు లభిస్తున్నది. అన్యూనానతి ప్రసక్తమయిన పదగుంఫనం కాళిదాసీయం. ఇతర కావ్యాలలోనూ అదే ఆదర్శము. ఉపమాప్రయోగంలో నిరుపమహస్తం కాళిదాసీయం. భాసాదికవులున్నా, సమగ్రప్రబంధ లక్షణాలతో దొరకిన కవితాగుంఫములు కాళిదాసీయాలే. చారిత్రకంగా విక్రమార్కుని నవరత్నాలలో ఒకడు, "కిం వదంతీ" కథల ప్రకారం భోజసభాచూడామణి యీ కవికుల గురువు. కవులను లెక్కపెట్టాలని "కాళిదాసు" పేరుతో చిటికెన వేలును ముడిస్తే మతాక కవి పేరు దొరకక, తరువాత వ్రేలును ముడవడం జరగలేదు. అది పేరులేని వేలుగా – **అనామిక** – అయింది.

పురా కవీనాం గణనాప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా।
అద్యాపి తత్తుల్యకవేరభావాత్ **అనామికా** సార్థవతీ బభూవ॥

అన్నారు. అంటే కాళిదాసంతటికవి ఎవరూ లేరని జన విశ్వాసం. అందుకే సంస్కృత విద్యార్థులకు పాఠ్యంగా నిర్దిష్టమయిన పంచకావ్యాలలో మొదటి మూడు 'కాళిదాసీయాలే'. ఆ మాధుర్యం ఆ గాంభీర్యం అటువంటివి. 'త్వమేవాహం – త్వమేవాహం" అని కాళికయే ప్రత్యక్షమై తనతో, 'కాళిదాసాద్వైతం' అంగీకరించినట్లు ఒక ఆభాణకం. భవభూతి కాళిదాసుల కవితల మధ్య తేడా ఏమంటే 'రసమే' నని, నీరసం భవభూతీయమని, సరసం కాళిదాసీయమని వాగ్దేవి సాక్ష్యమిచ్చినట్లు ఒక చాటువు.

"అహో! మే సౌభాగ్యం మమ చ భవభూతేశ్చ రచితం
ధటాయామారోప్య ప్రతిఫలతి తస్యాం లఘిమని।
గిరాందేవీ సద్యః శ్రుతికలితకహ్లారకలికా
మధూళీమాధుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ"॥

కాళిదాసీయ కవితా మాధుర్యం రావాలంటే సరస్వతీ కర్ణావతంసమయిన మకరందం ఒక చుక్క పడాలన్న మాట! అటువంటి కాళిదాసు, రామాయణ ప్రభావంతో రచించినవి మూడు కావ్యాలు. రఘువంశము ప్రసిద్ధమే. "కుమారసంభవం" రామాయణం బాలకాండలోని





కథాబీజంతో మొలచిన వృక్షమే. మేఘసందేశంలో "హనుమత్సందేశం" పోలిక స్పష్టమే గదా! అందులో

'కుమారసంభవం' మన రావి మోహనరావుగారి వ్యాఖ్యానంతో ఇతర విశేషాలతో వెలువడుతున్నది. ప్రస్తుత సర్గ "షష్ఠ" సర్గ. ఇది ఉమా ప్రదానం. తపము సఫలమై హైమవతి కైలాసపతిని పెండ్లాడే ఘట్టమిది. అందు 'సప్తర్షి సందేశము" – అద్భుతం. తరువాత సంప్రదాయ రహస్యాలతో పెళ్ళికుమార్తెను సిద్ధం చేయడంతో మొదలై వివాహంతో సర్గ ముగుస్తుంది. ఎందుకో తెలియదుగాని శ్రీ రావి మోహనరావు (రామోరా – అని నేనే మొదట అన్నట్లు గుర్తు.) ఈ కుమారసంభవ కావ్యాన్ని సంస్కృత భారతీ కుమారులకు సులభంగా చేయదలచారు. ఇంతవరకు ఎవరూ చేయని శ్రమ, ప్రణాలిక స్వీకరించి స్వీయవ్యాఖ్యతో ప్రచురిస్తున్నారు. ఈయనకు "ప్రచురణ" అలవాటయిన పనే. సంస్కృత గ్రంథాలను సుబోధం చేయటానికి శ్రీ దోర్బల విశ్వనాథశర్మగారి వంటి పండితులతో వ్యాఖ్యలు వ్రాయించి ప్రచురించి ఉచితముగనే పంచినవారు. ఇంతవరకు కారయిత, ప్రేరకుడు, అనుమోదకుడు అయిన ఈయన ఇపుడు – వారు వీరేల? అని (మా వంటి ఆస్థానపండితులను పాఠకులను చేసి) రాయలవలె భోజునివలె – స్వతంత్రంగానే – కలం– దూసి, 'కథనం' సాగిస్తున్నారు. అందులో విచిత్రరీతులతో పోరాడుతున్నారు. ప్రతిపద్యానికి 'అవతారిక', పద్యము, పదవిభాగము, అన్వయక్రమము (దీనినే సంప్రదాయంలో ఖండాన్వయం అంటారు) ప్రతిపదార్థము, తాత్పర్యము (దీనినే దండాన్వయం అంటారు) కూర్చారు. తర్వాత వ్యాకరణవిశేషాలలో 1.విభక్తులు, క్రియలు 2. సమాసాలు 3. సంధులు 4. పాఠాన్తరాలు 5. పదవ్యుత్పత్తి 6. క్రియాదర్శము ఉన్నాయి. ఇందులో పదవ్యుత్పత్తి చాలా ప్రమాణాలతో విజ్ఞానదాయకంగా ఉన్నది. ఒకచోట ప్రోగుపడిన ఇటువంటి విషయాలు, జిజ్ఞాసువులకు విమర్శకులకు చాలా మనోరంజకంగా, ఆధారంగా ఉంటాయి. ప్రతిసర్గకు అనేక (80) గ్రంథావలోకనములతో బాటు, ఆ సర్గకు సంబంధించిన, వల్లభదేవుని "పంజికా, వ్యాఖ్యను" "బోనస్"గా ఇవ్వడం పాఠకులకు లాభదాయకం. అదిగాక, ప్రతిసర్గకు శివమహాపురాణం నుంచి మూలశ్లోకాలను సాదృశ్యంగా ఇవ్వటం విమర్శకులకు 'కొంగుబంగారం' అవుతుంది. సందేహం లేదు. దీనిని మనం 'వ్యాఖ్య' అనిగాక విద్యార్థులకు ఉత్తేజం కలిగించే "పరిశోధనవ్యాఖ్య" అనవచ్చును. ఇంతకూ ఇంతటి వ్యాఖ్య వ్రాసిన ఈయన ఏమిటి? సంప్రదాయబద్ధంగా చదివిన గురుకుల మురారిగాడు. అవసరపడిన గ్రంథాలన్నింటినీ తెప్పించి, రిఫరెన్సులు అన్వేషించి, శోధించి, శ్రమించి అందరినీ అలరించి మమ్ములనందరినీ మించిన, మిమ్ముల నందరినీ ఋణసముద్రంలో ముంచిన ఘనుడు.

ఉండేది చీరాలలో, బ్రతికేది భూపరిశోధనాశాఖలో, పని చేసేది కందుకూరులో. తిరిగేది, 'పినాకిని'లో, రాసేది ఆదివారాలలో – అయినా ఇంతటి గ్రంథం వరసగా వేగంగా తయారయి పించాలుగా విడివడి వస్తున్నది. అంటే

"క్రియాసిద్ధిస్సత్త్వే భవతి"

ఆప్తమిత్రుడయిన శ్రీ "రామోరా"ను మెచ్చుకొంటూ నేను రాసిన కాసిని పద్యాలు–

1. కలయో! వైష్ణవమాయయో! మఱి! మహాకావ్యంబు టీకింపగా
   గలవారూరకయుండ తామిటు మహాకావ్యంబు చేపట్టి, ని–
   చ్చలు రైలెక్కి చలించుచుండియు భళీ! సాధించినారీ కృతుల్
   ఫలమా, 'హ్రీం' దయయో, కుమారు కృపయో, ఫాలాక్షువాత్సల్యమో॥

2. చదివినదేమొ భూ– వనరుశాస్త్రము, వృత్తియునందులోననే,
   మది సురభాషపై పడె, నమాంతము 'యమ్.ఎ'ను చేసె దీక్షగా,
   బెదరక కాళిదాసుని కవిత్వము వ్యాఖ్యకు పెట్టె, మాయురే!
   యిది కథగాదు, వాస్తవము! ఎంతయు గొప్పగనుండె వ్యాఖ్యయున్॥

3. కనుడిది వ్యాఖ్యయె! పరిశోధనయో, వివరింపలేము తత్త్వముచూడన్,
   తనకుందానుగ చదివెడు మనస్విహంసకు మృణాలమధురంబందున్.

4. ఆమోదంబున మమ్ముగైకొని కృతివ్యాఖ్యానమర్పించుచున్
   'రామోయ'మ్మను 'కృత్యహల్య' cబద ముద్రన్ వేసి మన్నించుచున్
   మా, మా, **మోహనరావుగారనుచు** మా, మా, గుండెలన్నిండుచున్
   "రా।మో।రా" ఇకముందు గూడ ఇటులే రాణించరా! మించరా!!

5. జీతపుడబ్బు ఖర్చుపడి సేవలు చేసెడు మీకునింటిలో
   దాతృతకడ్డురాక ప్రతితావున మూల్గెడు పుస్తకాలతో
   యాతన పొందుచున్ తన సహాయము చేయుచు మమ్ము సోదరీ
   రీతిగ చూచు మీ సతికి **కృష్ణకుమారికి** గూడ దీవెనల్.

**యమ్.వి. సుబ్రహ్మణ్యశాస్త్రి**
రిటైర్డ్ సంస్కృతం లెక్చరర్



**శ్రీః**

**ఓం కుమార శ్రీగురవే నమః**



## మృణాళినీ వ్యాఖ్యానమున

**ఉదాహరింపబడిన విషయములకు సంబంధించిన**
**ఆయా గ్రంథ రచయితలకు, వ్యాఖ్యానకారులకు నమస్సుమాంజలులు.**

❃

**ఇట సహకరించిన డా॥ వుయ్యూరు లక్ష్మీనరసింహారావుగారు,**
**డా॥ ఈ.ఏ. శింగరాచార్యులుగారు, డి. పాపిరెడ్డిగారు, సి. సుబ్బారావుగారు,**
**డా॥ గోగినేని యోగప్రభావతీదేవిగారు, శ్రీ ఇప్పగుంట సాయిబాబాగారు,**
**డా॥ ముళ్లపూడి విశ్వనాథశాస్త్రిగారు, మహామహోపాధ్యాయ శ్రీ పుల్లెల**
**శ్రీరామచంద్రుడుగార్లకు మఱియు అడిగిన వెంటనే**
**'సంస్తవము'ను అందించిన**
**మేళ్లచెర్వు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు**
**డా॥ కందాళ లక్ష్మీనారాయణగారు, గరిమెళ్ల సోమయాజులుశర్మగారు,**
**శ్రీ దోర్బల విశ్వనాథశర్మగారు, ప్రియమిత్రులు శ్రీ కె. అరవిందరావు గార్లకు**

❃

**నా ఆరాధ్యదైవమైన**
**మహాయోగి శ్రీఅరవిందభగవానుడు,**
**వారి అర్ధభాగమైన మృణాళినీదేవికి నమస్కరిస్తూ.....**

❃

**శ్లో॥ నాహం మన్యే సువేదేతి – నో న వేదేతి వేద చ।**
**యో నస్ తద్వేద తద్వేద – నో న వేదేతి వేద చ॥**

– కేనోపనిషత్ 10

**ఓం శాన్తిశ్ శాన్తిశ్ శాన్తిః**

**– రా మో రా**

# శ్రీః

# కుమారసమ్భవమహాకావ్యమ్

## ‘ఉమాప్రదానో’ నామ షష్ఠః సర్గః



**శ్లో॥ అథ విశ్వాత్మనే గౌరీ - సందిదేశ మిథః సఖీమ్।**
**దాతా మే భూభృతాం నాథః - ప్రమాణీక్రియతామితి॥ 1**

**పదవిభాగము:–** అథ, విశ్వాత్మనే, గౌరీ, సందిదేశ, మిథః, సఖీమ్, దాతా, మే, భూభృతామ్, నాథః, ప్రమాణీక్రియతామ్, ఇతి।

**అన్వయక్రమము:–** అథ గౌరీ విశ్వాత్మనే మిథః సఖీం ‘భూభృతాం నాథః మే దాతా ప్రమాణీక్రియతామ్’ ఇతి సందిదేశ।

**ప్రతిపదార్థము:–** అథ – శివానుగ్రహమునకు పిమ్మట, గౌరీ – పార్వతీదేవి, విశ్వాత్మనే – లోకమే స్వరూపముగా గలవాడైన శివభగవానునికొఱకు, మిథః – రహస్యముగా, సఖీమ్ – చెలిని, భూభృతాం నాథః – పర్వతములకు ప్రభువైన హిమవంతుడు, మే దాతా – నాయొక్క దాతగా, ప్రమాణీక్రియతామ్ – నిశ్చయింపబడుగాక, ఇతి – అని, సందిదేశ – సందేశమంపెను.

**తాత్పర్యము:–** శివానుగ్రహమునకు పిమ్మట పార్వతీదేవి లోకమే స్వరూపముగా గలవాడైన శివభగవానునికొఱకు రహస్యముగా చెలిని ‘పర్వతములకు ప్రభువైన హిమవంతుడు నాయొక్క దాతగా నిశ్చయింపబడుగాక’ అని సందేశమంపెను.

**విభక్తులు / క్రియలు :–** 1. అథ – అవ్యయము, 2. గౌరీ – **గౌరీ**, గౌర్యౌ, గౌర్యః, ఈకారాన్త స్త్రీలింగ గౌరీశబ్దము ప్ర.ఏ., 3. విశ్వాత్మనే – **విశ్వాత్మనే,** విశ్వాత్మభ్యామ్, విశ్వాత్మభ్యః, నకారాన్త పుంలింగ విశ్వాత్మన్ శబ్దము చ.ఏ., 4. మిథః – అవ్యయము, 5. సఖీమ్ – **సఖీమ్,** సఖ్యౌ, సఖీః; ఈకారాన్త స్త్రీలింగ సఖీశబ్దము ద్వి.ఏ., 6. భూభృతామ్ – భూభృతః, భూభృతోః, **భూభృతామ్,** తకారాన్త పుంలింగ భూభృత్ శబ్దము ష.ఏ., 7. నాథః – **నాథః**, నాథౌ, నాథాః, అకారాన్త పుంలింగ





నాథశబ్దము ప్ర.ఏ., 8. మే – **మే**, ఆవయోః, అస్మాకమ్, దకారాన్త అస్మచ్ఛబ్దము ష.ఏ., 9. దాతా – **దాతా,** దాతారౌ, దాతారః, ఋకారాన్త పుంలింగ దాతృశబ్దము ప్ర.ఏ., 10. ప్రమాణీక్రియతామ్ – (చ్వి ప్రత్యయాన్తము) – క్రియ – లోట్ – ప్ర.ఏ., 11. ఇతి – అవ్యయము, 12. సందిదేశ – క్రియ.

**సమాసాలు:–**

1. విశ్వాత్మనే – ఎ) విశ్వమ్ ఆత్మా యస్య (బహువ్రీహి) సః, విశ్వాత్మా, తస్మై।
   బి) విశ్వస్య ఆత్మా (ష.త) విశ్వాత్మా, తస్మై।
2. ప్రమాణీక్రియతామ్ – అప్రమాణం ప్రమాణం యథా సంపద్యతే తథా క్రియతామ్, ప్రమాణీక్రమతామ్, అత్రాభూతతద్భావే చ్వి, ప్రార్థనాయాం లోట్ చ **ఇతి శబ్దః ప్రకారవాచీ।**

**పదవ్యుత్పత్తి– నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. గౌరీ:** (స్త్రీ) ఎ) గౌర + ‘షిద్ గౌరాదిభ్యశ్చ’ ఇతి జీష్। (4–1–41)

బి) శ్లో॥ రుద్రాణీ శర్వాణీ కాలీ కాత్యాయనీ భవానీ చ।
ఆర్యామ్బికా మృడానీ హైమవతీ పార్వతీ **గౌరీ**॥ 15

శ్లో॥ ఉమా భగవతీ దుర్గా చణ్డీ దాక్షాయణీ శివా।
అపర్ణా స్యాన్మహాదేవీ గిరిజా **మేనకాత్మజా**॥ 16

అని హలాయుధకోశము ‘21’ నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ అన్యేద్యురాత్మానుచరస్య భావం
జిజ్ఞాసమానా మునిహోమధేనుః ।
గఙ్గాప్రపాతాన్తవిరూఢఘూసం
గౌరీగురోర్గహ్వరమావివేశ॥ – ర.వం. 2–26

“మరునాడు ఆ హోమధేనువు...పార్వతీదేవికి తండ్రియగు హిమవత్పర్వతపు గుహలోనికి ప్రవేశించెను.”

డి) శ్లో॥ “**గౌరీ** ప్రోక్తా కన్యాకుబ్జే రంభా తు మలయాచలే”
– ఇతి దేవీభాగవతే 7–30–5

ఇ) శ్లో॥ “అష్టవర్షా భవేద్ **గౌరీ** నవవర్షా తు రోహిణీ” – ఇతి స్మృతౌ.

2. అథ :– ఎ) మహాకవిశ్రీకాలిదాసు కుమారసంభవమహాకావ్యమునందు షష్ఠసర్గను ‘శుభసూచక’మని ‘అథ’శబ్దముతో మొదలిడెను. దీనితో పార్వతీదేవి మనోరథము దేవతల అభిలాష నెరవేరుటను సూచించినట్లయినది.

బి) అవ్యయకోషః (17)

**'అథ మంగళానన్తరారమ్భప్రశ్నకార్త్స్న్యేష్వధికారప్రతిజ్ఞాసముచ్చయ - వితర్కవికల్పేషు।'**

1. మంగళే - 'అథ శబ్దానుశాసనమ్'। (మహాభాష్యే ప్రారమ్భే)
2. ఆనన్తర్యే - 'అథ ప్రజానామధిపః ప్రభాతే -' - ర.వం. 2-1
3. ఆరమ్భే - 'అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః।' (ఆప. ధర్మసూత్రే 1-1-1)
4. ప్రశ్నే - 'అథ శక్నోషి భోక్తుమ్'।
5. కార్త్స్న్యే - 'అథ పరస్మైపదమ్'। పరస్మైపదాని కార్త్స్న్యేన ప్రతిపాద్యన్తే ఇత్యర్థః।
6. అధికారే - 'అథ యోగానుశాసనమ్' । (యో.సూ. 1-1)
7. ప్రతిజ్ఞాయామ్ - గౌడో భవాన్ **అథేతి** బ్రూమః ।
8. సముచ్చయే - 'దుర్యోధనే - థ రాధేయః'
9. వితర్కే - శబ్దో నిత్యః అథానిత్యః।
10. వికల్పే - 'ఋతావుపేయాత్; అథానృతౌ పర్వవర్జమ్' పక్షాన్తరే - పి దృశ్యతే। యథా -

'అథ చేత్ త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి' (భగవద్గీత - 2-33) ఇత్యాదిషు.

**ఛందస్సు :-** ఈ సర్గము 'అనుష్టుప్' ఛందమున నిబంధింపబడినది. దీనిని శ్లోకమనియు, పద్యమనియు అందురు. సమవృత్తము ప్రతిపాదనమునను 8 అక్షరములుండును. దీని సామాన్య లక్షణము -

"శ్లోకే షష్ఠం గురు జ్ఞేయం సర్వత్ర లఘు పంచమమ్।
ద్విచతుష్పాదయోర్హ్రస్వం సప్తమం దీర్ఘమన్యయోః॥"

**క్రియాదర్శము :- 1. ప్రమాణీక్రియతామ్** - ప్రమాణీ (చ్వి: ప్రత్యయాన్తము) డుకృఞ్ 'కరణే' - కర్మణి - లోట్ - ప్ర.ఏ.

**క్రియతామ్** - క్రియేతామ్ - క్రియన్తామ్.

**2. సందిదేశ** - సం - ఉపసర్గ; 'దిశ - అతిసర్జనే', తుదాదయః(6), సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ, లిట్ - ప్రథమపురుషైకవచనాంతః।

**సందిదేశ** - సందిదిశతుః - సందిదిశుః।

---

5



**శ్లో॥ తయా వ్యాహృతసందేశా - సా బభౌ నిభృతా ప్రియే।
చూతయష్టిరివాభ్యాసే - మధౌ పరభృతోన్ముఖీ॥ 2**

**పదవిభాగము :-** తయా, వ్యాహృతసందేశా, సా, బభౌ, నిభృతా, ప్రియే, చూతయష్టిః, ఇవ, అభ్యాసే, మధౌ, పరభృతోన్ముఖీ।

**అన్వయక్రమము :-** తయా వ్యాహృతసందేశా ప్రియే నిభృతా సా, మధౌ నిభృతా పరభృతోన్ముఖీ చూతయష్టిః ఇవ, అభ్యాసే బభౌ।

**ప్రతిపదార్థము :-** తయా - ఆ చెలిచేత, వ్యాహృతసందేశా - చెప్పబడిన సందేశము కలదియు, ప్రియే - ఇష్టుడైన శివునియెడల, నిభృతా - నిశ్చలయు అగు, సా - ఆ పార్వతీదేవి, మధౌ - వసంతమునందు, నిభృతా -అత్యన్త ఆసక్తి కలదై, పరభృతోన్ముఖీ - ఆడుకోయిలచేత పలుకుచున్నదైన, చూతయష్టిః + ఇవ - మామిడి కొమ్మవలె, అభ్యాసే - సమీపమున, బభౌ - ప్రకాశించెను.

**తాత్పర్యము :-** ఆ చెలిచేత చెప్పబడిన సందేశముకలదియు, ఇష్టుడైన శివునియెడల నిశ్చలయు అగు ఆ పార్వతీదేవి, వసంతమునందు అత్యన్త ఆసక్తికలదై ఆడుకోయిల చేత పలుకుచున్నదైన మామిడికొమ్మవలె, ప్రకాశించెను.

**పాఠాన్తరాలు :-** 1. అభ్యాసే - అభాష్యే.

**విభక్తులు/క్రియలు :-** 1. తయా - **తయా**, తాభ్యామ్, తాభిః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, తృ.ఏ. 2. వ్యాహృతసందేశా - **...సందేశా**, ...సందేశే, ...సందేశాః ఆకారాన్త స్త్రీలింగ...సందేశాశబ్దము. ప్ర.ఏ 3. ప్రియే - **ప్రియే**, ప్రియయోః, ప్రియాణామ్; అకారాన్త పుంలింగ ప్రియశబ్దము. స.ఏ. 4. నిభృతా - **నిభృతా,** నిభృతే, నిభృతాః; ఆకారాన్త స్త్రీలింగ నిభృతాశబ్దము. ప్ర.ఏ 5. సా - **సా**, తే, తాః దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 6. మధౌ - **మధౌ**, మధ్వోః, మధుషు; ఉకారాన్త పుంలింగ మధుశబ్దము. స.ఏ. 7. పరభృతోన్ముఖీ - **...ఉన్ముఖీ**, ...ఉన్ముఖ్యౌ, ...ఉన్ముఖ్యః; ఈకారాన్త స్త్రీలింగ ...ఉన్ముఖీశబ్దము. ప్ర.ఏ. 8. చూతయష్టిః - **చూతయష్టిః**, చూతయష్టీ, చూతయష్టయః; ఇకారాన్త స్త్రీలింగ చూతయష్టిశబ్దము. ప్ర.ఏ 9. అభ్యాసే - **అభ్యాసే**, అభ్యాసయోః, అభ్యాసేషు ; అకారాన్త పుంలింగ అభ్యాసశబ్దము. స.ఏ 10. బభౌ - క్రియ 11. ఇవ - అవ్యయము.

**సమాసాలు -**

1. వ్యాహృతసన్దేశా - వ్యాహృతః సందేశః యయా (బహువ్రీహి) సా।
2. పరభృతోన్ముఖీ - పరైః భృతా పరభృతా, పరభృతయా ఉన్ముఖీ, పరభృతోన్ముఖీ (తృ.త)।
3. చూతయష్టిః - చూతస్య యష్టిః (ష.త.) చూతయష్టిః।

**సంధులు –**

1. చూతయష్టిః + ఇవ – చూతయష్టిరివ – విసర్గసంధిః (రుత్వమ్)।
2. ఇవ + అభ్యాసే – ఇవాభ్యాసే – సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. చూతః (పుం.)** – ఎ) చూష్యతే పీయతే ఇతి। చూష్ కర్మణి క్త,
పృషోదరాదిత్వాత్ షలోపః, రసాలత్వాదేవాస్య తథా త్వమ్।

బి) శ్లో।। ...స్యాదామ్ర**శ్చూత**శ్చ సహకారః । 192
అని హలాయుధకోశము '3' నామములను పేర్కొన్నది.

సి) శ్లో।। పరిచుమ్బతి సంవిశ్య భ్రమర**శ్చూత**మంజరీమ్।
నవసంగమసంహృష్టః కామీ ప్రణయినీమివ।।
– ఇతి రామాయణే (3–79–17)

డి) చూతయష్టిః – పుం, స్త్రీ లింగరూపములందుండును.

ఇ) శ్లో।। "**చూతయ**ష్టయా సమాశ్లిష్టో దృశ్యతాం తిలకద్రుమః"।
– ఇతి బుద్ధచరితే – 4–46

**2. పరభృతోన్ముఖీ**

అత్ర మల్లినాథః – 'పరభృతేతి క్రియాశబ్దవివక్షాయాం' జాతేరస్త్రీవిషయాద యోపధాత్' ఇతి జీప్రత్యయో న భవతి। తయేత్యుపమేయస్య వ్యస్తత్వాత్ ఉపమానవాచిపరభృతా శబ్దస్య సమాసః సోఢవ్యః। అథ వా భృత్ భరణమ్। సమ్పదాదిత్వాత్ క్విప్। పరైః భృద్ యస్యాః సా పరభృత్, తయా పరభృతా, ఇతి వ్యాసేన (సమాసాభావేన) వ్యాఖ్యేయమ్।

పదమంజరీకారస్తు పరైర్భ్రియతే ఇతి కర్మణి క్విపమాహ।'

**క్రియాదర్శము :– 1. బభౌ** – 'భా – దీప్తౌ' (ప్రకాశించుట), అదాదిప్రకరణమ్ (2), అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**బభౌ** – బభతుః – బభుః

---

**అవతారికా :–** హిమాద్రిం కన్యాయాచనార్థం **శివేన** మునిస్మరణమ్। కన్యనిమ్మని హిమవంతునడుగుటకై శివుడు సప్తర్షులను స్మరించుట.

6



**శ్లో।। స తథేతి ప్రతిజ్ఞాయ – విసృజ్య కథమప్యుమామ్।**
**ఋషీన్ జ్యోతిర్మయాన్ సప్త – సస్మార స్మరశాసనః।। 3**

**పదవిభాగము :–** సః, తథా, ఇతి, ప్రతిజ్ఞాయ, విసృజ్య, కథమ్, అపి, ఉమామ్, ఋషీన్, జ్యోతిర్మయాన్, సప్త, సస్మార, స్మరశాసనః।

**అన్వయక్రమము :–** సః స్మరశాసనః తథా ఇతి ప్రతిజ్ఞాయ, ఉమాం కథమ్ అపి విసృజ్య, జ్యోతిర్మయాన్ సప్త ఋషీన్ సస్మార।

**ప్రతిపదార్థము :–** సః – ఆ, స్మరశాసనః – మన్మథుని నిగ్రహించినవాడగు శివభగవానుడు, తథా – అట్లే, ఇతి – అని, ప్రతిజ్ఞాయ – వాగ్దానముచేసి, ఉమామ్ – పార్వతీదేవిని, కథమ్ + అపి – ఎట్లో, విసృజ్య – వదలి, జ్యోతిర్మయాన్ – తేజోరూపులయిన, సప్త – ఏడుగురు, ఋషీన్ – ఋషులను, సస్మార – తలంచెను.

**తాత్పర్యము :–** ఆ శివభగవానుడు అట్లే అని వాగ్దానము చేసి పార్వతీదేవి నెట్లో వదలి తేజోరూపులైన సప్తర్షులను తలంచెను.

**విభక్తులు/క్రియలు :–** 1. తథా, ఇతి, అపి, కథమ్ – అవ్యయాలు, 2. స్మరశాసనః – **స్మర శాసనః**, స్మరశాసనౌ, స్మరశాసనాః; అకారాన్త పుంలింగ స్మరశాసనశబ్దము. ప్ర.ఏ. 3. సః – **సః**, తౌ, తే; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 4. ప్రతిజ్ఞాయ – అవ్యయము 5. ఉమామ్ – **ఉమామ్**, ఉమే, ఉమాః; ఆకారాన్త స్త్రీలింగ ఉమాశబ్దము, ద్వి.ఏ 6. విసృజ్య – అవ్యయము 7. జ్యోతిర్మయాన్ – జ్యోతిర్మయమ్, జ్యోతిర్మయౌ, **జ్యోతిర్మయాన్**; అకారాన్త పుంలింగ జ్యోతిర్మయశబ్దము. ద్వి.బ 8. సప్త – త్రిషు లింగేషు సమానో నకారాన్త 'సప్తన్'శబ్దో నిత్యం బహువచనాంతః। ద్వి.బ 9. ఋషీన్ – ఋషిమ్, ఋషీ, **ఋషీన్**; ఇకారాన్త పుంలింగ ఋషిశబ్దము ద్వి.బ 10. సస్మార – క్రియ.

**సమాసాలు / విగ్రహవాక్యాలు:–**

1. స్మరశాసనః – శాస్తి ఇతి శాసనః, స్మరస్య శాసనః (ష.త.) స్మరశాసనః।
2. జ్యోతిర్మయాన్ – జ్యోతిషః వికారాః జ్యోతిర్మయాః (తద్ధితవృత్తి), తాన్।

**సంధులు :–**

1. తథా + ఇతి – తథేతి – గుణసన్ధిః – **ఆద్గుణః** (సూ. 6–1–84)
2. అపి + ఉమామ్ – అప్యుమామ్ – యణాదేశసన్ధిః – **ఇకో యణచి** (సూ. 6–1–74)

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. సప్త :–** ఎ) త్రిషు లింగేషు సమానో నకారాన్తః 'సప్తన్' శబ్దో నిత్యం బహువచనాంతః।

1. సప్త 2. **సప్త** 3. సప్తభిః 4. సప్తభ్యః 5. సప్తభ్యః 6. సప్తానామ్ 7. సప్తసు. సంబోధన ప్రథమా – హే సప్త. **'పఞ్చన్' శబ్దవత్ కార్యం బోధ్యమ్।**

బి) సారున్ధతీకాః సప్తర్షయో యథా –

శ్లో॥ కశ్యపో – త్రిర్భరద్వాజో – విశ్వామిత్రో – థ గౌతమః।
జమదగ్నిర్వసిష్ఠశ్చ – సాధ్వీ చైవాప్యరున్ధతీ। ఇతి

సి) శ్లో॥ ఇత్థం వ్రతం ధారయతః ప్రజార్థం
సమం మహిష్యా మహనీయకీర్తేః।
**సప్త** వ్యతీయు స్త్రిగుణాని తస్య
దినాని దీనోద్ధరణోచితస్య॥ – ర.వం. 2–25

"ఈ విధముగా సంతానమును పొందుటకై తనపట్టపురాణితో కలిసి, వ్రతనియమములను పాటించుచున్నవాడును, మహాయశోవంతుడును, దీనులను ఉద్ధరించుటకు యోగ్యుడును అగు ఆ దిలీపమహారాజునకు మూడు రెట్లైన **ఏడు** దినములు గడచిపోయెను."

డి) **సప్త**

1. సప్యశూభ్యాం తుట్ చ – ఉణాది సూత్రమ్ – 1 –155 ఇతి కనిన్, తుట్।
2. 'షప – సమవాయే' భ్వాది। పరస్మైపదీ। సేట్ కనిన్, తుట్।
3. సపది సమవైతి ఇతి సప్తన్। సంఖ్యాభేదో వా।
4. బాహులకాత్ – పంచతి వ్యతికరోతీతి పఞ్చన్, సంఖ్యావాచకో వా।

దశతీతి దశన్, సంఖ్యావిశేషో వా। నౌతీతి నవన్ సంఖ్యా వా। బాహులకాద్ గుణః
– ఇతి ఉణాదికోశవ్యాఖ్యాయామ్।

**క్రియాదర్శము :– 1.సస్మార :–** 'స్మృ – చిన్తాయామ్' (స్మరించుట), సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్ (1), లిట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**సస్మార** – సస్మరతుః – సస్మరుః

---

**శ్లో॥ తే ప్రభామణ్డలైర్వ్యోమ – ద్యోతయన్తస్తపోధనాః।**
**సారున్ధతీకాస్సపది – ప్రాదురాసన్ పురః ప్రభోః ॥ 4**

**పదవిభాగము :–** తే, ప్రభామణ్డలైః, వ్యోమ, ద్యోతయన్తః, తపోధనాః, సారున్ధతీకాః , సపది, ప్రాదుః, ఆసన్, పురః, ప్రభోః।





**అన్వయక్రమము :–** తే, తపోధనాః ప్రభామణ్డలైః వ్యోమ ద్యోతయన్తః సారున్ధతీకాః సన్తః సపది ప్రభోః పురః ప్రాదురాసన్।

**ప్రతిపదార్థము :–** తే తపోధనాః – తపమే ధనముగా గల ఆ సప్తర్షులు, ప్రభామణ్డలైః – కాంతులయొక్క సమూహములచేత, వ్యోమ – ఆకాశమును, ద్యోతయన్తః – వెలిగించుచు, సారున్ధతీకాః (సన్తః) – అరున్ధతీదేవితో కూడుకొన్నవారై, సపది – వెంటనే, ప్రభోః – జగత్ప్రభువగు శివునియొక్క, పురః – ముందట, ప్రాదురాసన్ – ప్రత్యక్షమయిరి.

**తాత్పర్యము :–** తపమే ధనముగాగల ఆ సప్తర్షులు కాంతులయొక్క సమూహముల చేత ఆకాశమును వెలిగించుచు అరున్ధతీదేవితో కూడుకొన్నవారై వెంటనే జగత్ప్రభువగు శివునియొక్క ముందట ప్రత్యక్షమయిరి.

**విభక్తులు / క్రియలు :–** 1. తే – సః, తౌ, **తే**; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.బ. 2. తపోధనాః – తపోధనః, తపోధనౌ, **తపోధనాః**; అకారాన్త పుంలింగ తపోధనశబ్దము. ప్ర.బ. 3. ప్రభామణ్డలైః – ప్రభామణ్డలేన, ప్రభామణ్డలాభ్యామ్, **ప్రభామణ్డలైః**; అకారాన్త నపుంసకలింగ ప్రభామణ్డలశబ్దము. తృ.బ. 4. వ్యోమ – **వ్యోమ**, వ్యోమనీ, వ్యోమాని; నకారాన్త నపుంసకలింగ వ్యోమన్‌శబ్దము. ద్వి.ఏ. 5. ద్యోతయన్తః – ద్యోతయన్, ద్యోతయన్తౌ, **ద్యోతయన్తః**; తకారాన్త పుంలింగ ద్యోతయత్ శబ్దము. ప్ర.బ. 6. సారున్ధతీకాః – సారున్ధతీకః, సారున్ధతీకౌ, **సారున్ధతీకాః**; అకారాన్త పుంలింగ సారున్ధతీకశబ్దము. ప్ర.బ 7. సపది, పురః – అవ్యయాలు 8. ప్రభోః – **ప్రభోః**, ప్రభ్వోః, ప్రభూణామ్; ఉకారాన్త పుంలింగ ప్రభుశబ్దము. ష.ఏ 9. ప్రాదుః – అవ్యయము 10. ఆసన్ – క్రియ.

**సమాసాలు :–**

1. తపోధనాః – తప ఏవ ధనం యేషాం (బహువ్రీహి) తే। తపోధనాః।
2. ప్రభామణ్డలైః – ప్రభాయా మణ్డలాని (తృ.త.) ప్రభామణ్డలాని। తైః।
3. సారున్ధతీకాః – అరున్ధత్యా సహ వర్తన్తే ఇతి (బహువ్రీహి)।

**సంధులు :–**

1. ప్రభామణ్డలైః + వ్యోమ – ప్రభామణ్డలైర్వ్యోమ – విసర్గసన్ధిః (రుత్వమ్)।
2. ద్యోతయన్తః + తపోధనాః – ద్యోతయన్తస్తపోధనాః – విసర్గసన్ధిః (సకారాదేశః)।
3. సారున్ధతీకాః + సపది – సారున్ధతీకాస్సపది – విసర్గసన్ధిః (సకారాదేశః)।
4. ప్రాదుః + ఆసన్ – ప్రాదురాసన్ – విసర్గసన్ధిః (రుత్వమ్)।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. సారున్ధతీకాః –**

ఎ) అరున్ధత్యా సహితాః సారున్ధతీకాః 'తేన సహేతి తుల్యయోగే' ఇతి బహువ్రీహిః 'న ద్యూతశ్చ' ఇతి సమాసాన్తః కప్।

బి) అత్ర వసిష్ఠపత్నీమాత్రస్యాగమనవర్ణనం తత్పాతివ్రత్యస్యాన్యపత్నీపాతివ్రత్యేభ్యో వ్యతిరేకం ద్యోతయితుమ్। ఏవం హి పురాణప్రసిద్ధిః –

శ్లో॥ సప్తర్షీణాం పురా పత్నీరకామయత పావకః।
విజ్ఞాతవృత్తా స్వాహా – థ తాసాం రూపేణ పావకమ్।

శ్లో॥ రమయామాస రుచిరం న శశాక మనాగపి।
యత్నైరరున్ధతీరూపం గ్రహీతుం మునయస్తతః।
అన్యే తు తత్యజుః పత్నీః – ఇతి।



**క్రియాదర్శము :– 1. ఆసన్ :–** 'అస (అస్) భువి' (ఉండుట) అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, అదాదిప్రకరణమ్ (2). లఙ్ – ప్రథమపురుషైకబహువచనాంతః।
ఆసీత్ – ఆస్తామ్ – **ఆసన్**



---

**అవతారికా** – ఇతః పరం షడ్భిః శ్లోకైస్తానేవ మునీన్ వర్ణయతి।
ఇచటినుండి ఆఱు శ్లోకములలో నా ఋషులనే వర్ణించుచున్నాడు।

**శ్లో॥ ఆప్లుతాస్తీరమన్దార – కుసుమోత్కిరవీచిషు।**
**వ్యోమగఙ్గాప్రవాహేషు – దిఙ్నాగమదగన్ధిషు॥ 5**

**పదవిభాగము :–** ఆప్లుతాః, తీరమన్దారకుసుమోత్కిరవీచిషు, వ్యోమగఙ్గాప్రవాహేషు, దిఙ్నాగమదగన్ధిషు।

**అన్వయక్రమము :–** తీరమన్దారకుసుమోత్కిరవీచిషు దిఙ్నాగమదగన్ధిషు వ్యోమగఙ్గాప్రవాహేషు ఆప్లుతాః తే ప్రాదురాసన్ ఇతి పూర్వేణాన్వయః।



**ప్రతిపదార్థము :–** తీరమన్దారకుసుమోత్కిరవీచిషు – తీరమందలి మందారపుష్పాలను ఎగజిమ్మునట్టి అలలు కలవియు, దిఙ్నాగమదగన్ధిషు – దిక్కులయందలి ఏనుగుల మదజలవాసన కలవియు అగు, వ్యోమగఙ్గాప్రవాహేషు – ఆకాశగంగా ప్రవాహములయందు, ఆప్లుతాః – స్నానముచేసిన వారై, తే సపది పురః ప్రాదురాసన్నితి పూర్వేణాన్వయః।

**తాత్పర్యము :–** తీరమందలి మందారపుష్పాలను విరజిమ్మునట్టి అలలుకలవియు, దిక్కులయందు ఏనుగుల మదజలవాసన కలవియు అగు ఆకాశగంగా ప్రవాహములయందు స్నానము చేసినవారై (ఆ సప్తర్షులు శివుని ముందఱ ప్రత్యక్షమైనారని పూర్వశ్లోకము(4)తో అన్వయము)

**పాఠాన్తరాలు :–** 1. కుసుమోత్కిర – కుసుమోత్కర, 2. వ్యోమగఙ్గాప్రవాహేషు – ఆకాశగంగాస్రోతఃసు

**విభక్తులు / క్రియలు :–** 1. తీర...వీచిషు – ...వీచౌ, ...వీచ్యోః, **...వీచిషు**; ఇకారాన్త పుంలింగ.. వీచిశబ్దము. స.బ. 2. దిఙ్నాగమదగన్ధిషు – ...గన్ధౌ, ...గన్ధ్యోః, **...గన్ధిషు**; ఇకారాన్త పుంలింగ ...గన్ధిశబ్దము. స.బ. 3. వ్యోమగఙ్గాప్రవాహేషు – ...ప్రవాహే, ...ప్రవాహయోః, ...ప్రవాహేషు; అకారాన్త పుంలింగ ...ప్రవాహశబ్దము. స.బ. 4. ఆప్లుతాః – ఆప్లుతః, ఆప్లుతౌ, ఆప్లుతాః; అకారాన్త పుంలింగ ఆప్లుతశబ్దము. ప్ర.బ.

**సమాసాలు :–**

1. తీరమన్దారకుసుమోత్కిరవీచిషు – తీరే మన్దారాః తీరమందారః, తేషాం కుసుమాని తీరమన్దారకుసుమాని, తేషామ్ ఉత్కిరాః తీరమన్దారకుసుమోత్కిరాః, తా వీచయః యేషాం (బహువ్రీహి) తే, తీరమన్దారకుసుమోత్కిరవీచయః, తేషు।
2. దిఙ్నాగమదగన్ధిషు – దిశాం నాగాః దిఙ్నాగాః, మదస్య గన్ధః మదగన్ధః (ష.త.), దిఙ్నాగానాం మదగంధః – దిఙ్నాగమదగన్ధః (ష.త.), దిఙ్నాగమదగన్ధః యేషు తే దిఙ్నాగమదగన్ధయః, తేషు।
3. వ్యోమగఙ్గాప్రవాహేషు – వ్యోమ్నః గంగా, వ్యోమగంగా తస్యాః ప్రవాహాః (ష.త.) వ్యోమగంగాప్రవాహాః, తేషు।

**సంధులు :–**

1. ఆప్లుతాః + తీర... – ఆప్లుతాస్తీర... – విసర్గసన్ధిః (సకారాదేశః)।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. కులకమ్ :–** ఈ శ్లోకమునుండి ఆఱు శ్లోకములవరకు, పూర్వశ్లోకమునందలి 'తపోధనాః ప్రభోః పురః ప్రాదురాసన్' అనుదానితో అనుసంధానము. ఏకక్రియాన్వయముగల ఈ శ్లోకములకు **'కులక'**మని పేరు. సప్తశ్లోకములతో సప్తర్షివర్ణనము, ఆ పై శ్లోకమున అరున్ధతీవర్ణనము చేయబడినది.

**"పంచప్రభృతిభిః కులకమ్"** అని ధ్వన్యాలోకలోచనము.

ఎ) మాఘమహాకావ్యమున ప్రథమసర్గమునందు 4వ శ్లోకమునుండి 10వ శ్లోకముల వఱకున్న శ్లోకములందు 'నారద మహాముని' వర్ణనము చేయబడినది.

శ్లో॥ నవానధో – ధో బృహతః... శంభునా ॥ 1–4....

శ్లో॥ రణద్భిరాఘట్టనయా... ముహుర్ముహుః ॥ 1–10.

బి) 'మహాకవి శ్రీకాళిదాస విరచిత రఘువంశము' ప్రథమసర్గమునందు 5వ శ్లోకము నుండి 9వ శ్లోకము వఱకున్న శ్లోకములందు రఘువంశరాజుల గుణగణములు – వర్ణింపబడినవి.

శ్లో॥ సో – హమాజన్మశుద్ధానాం.... వర్త్మనామ్॥ 1–5

శ్లో॥ రఘూణాం .... ప్రచోదితః ॥ 1–9

అట్లే

సి) కుమారసమ్భవమహాకావ్యమున – ప్రథమసర్గమునందు మొదటిశ్లోకమునుండి 16 శ్లోకముల వఱకున్న పద్యభాగమున హిమవత్పర్వత వర్ణనము చేయబడినది.

**డి) మూ** – ముక్తకం **కులకం** కోషః సంఘాత ఇతి తాదృశః
సర్గబన్ధాంశరూపత్వాదునుక్తః పద్యవిస్తరః॥

– కావ్యాదర్శః –1–13

శ్లో॥ ద్వాభ్యాం యుగ్మమితి ప్రోక్తం త్రిభిః శ్లోకైర్విశేషకమ్।
కలాపకం చతుర్భిః స్యాత్ తదూర్ధ్వం **కులకం** స్మృతమ్॥

**2. మందారః – (పుం)**

ఎ) మన్యతే స్తూయతే ప్రశస్యతే వేతి। యది స్తుతి మోదమస్వప్నకాన్తి గతిషు + 'అజ్గిమదిమన్దిభ్య ఆరన్ – ఇతి ఆరన్।

స్వర్గీయపఞ్చవృక్షాన్తర్గతదేవతరువిశేషః।



బి) "పఞ్చైతే దేవతరవో **మందారః** పారిజాతకః।
సన్తానః కల్పవృక్షశ్చ పుంసి వా హరిచందనమ్"॥ – ఇత్యమరః।

సి) శ్లో॥ అన్తర్గతప్రార్థనమన్తికస్థం జయన్తముద్వీక్ష్య కృతస్మితేన।
ఆమృష్టవక్షోహరిచన్దనాఙ్కా **మన్దార**మాలా హరిణా పినద్ధా॥
– ఇతి అభిజ్ఞానశాకున్తలే – సప్తమాఙ్కే

డి) శ్లో॥ క్రియాప్రబంధాదయమధ్వరాణాం
అజస్రమాహూతసహస్రనేత్రః।
శచ్యాశ్చిరం పాణ్డుకపోలలమ్బాన్
**మన్దార**శూన్యానలకాంశ్చకార॥ – ర.వం. 6–23

**3. దిఙ్నాగమదగన్ధిషు–**

దిక్కులు ఎనిమిది. వాని అధిపతులు ఎనమండ్రు. ఆ దిక్కులందలి ఎనిమిది ఏనుగులకు అష్టదిగ్గజములని పేరు. వారి భార్యలును ఎనమండ్రు.

శ్లో॥ ఇంద్రో వహ్నిః పితృపతిర్నైరృతో వరుణో మరుత్।
కుబేర ఈశః పతయః పూర్వాదీనం దిశాం క్రమాత్॥
– అమరకోశమ్ – 1–2–4

శ్లో॥ ఐరావతః పుణ్డరీకో వామనః కుముదో – ంజనః।
పుష్పదన్తః సార్వభౌమః సుప్రతీకశ్చ **దిగ్గజాః**॥

శ్లో॥ కరిణ్యో – భ్రముకపిలా పింగళానుపమాః క్రమాత్।
తామ్రకర్ణీ శుభ్రదన్తీ చాంగనా చాంజనావతీ॥
– అమరకోశమ్ – 1–2–5

---

**శ్లో॥ ముక్తాయజ్ఞోపవీతాని – బిభ్రతో హైమవల్కలాః।**
**రత్నాక్షసూత్రాః ప్రవ్రజ్యాం – కల్పవృక్షా ఇవాశ్రితాః॥ 6**

**పదవిభాగము :–** ముక్తాయజ్ఞోపవీతాని, బిభ్రతః, హైమవల్కలాః, రత్నాక్ష సూత్రాః, ప్రవ్రజ్యామ్, కల్పవృక్షాః, ఇవ, ఆశ్రితాః।

**అన్వయక్రమము :–** ముక్తాయజ్ఞోపవీతాని బిభ్రతః హైమవల్కలాః రత్నాక్షసూత్రాః ప్రవ్రజ్యామ్ ఆశ్రితాః కల్పవృక్షాః ఇవ స్థితాః తే ప్రాదురాసన్ ఇతి పూర్వేణాన్వయః।

**ప్రతిపదార్థము :–** ముక్తాయజ్ఞోపవీతాని – ముత్యముల జందెములను, బిభ్రతః – ధరించినవారు, హైమవల్కలాః – స్వర్ణమయములగు నారవస్త్రములు గలవారు, రత్నాక్షసూత్రాః – రత్నమయములగు రుద్రాక్షమాలలు గలవారు, ప్రవ్రజ్యామ్ – కార్యార్థపర్యటనమును, ఆశ్రితాః – ఆశ్రియించినవారును, కల్పవృక్షాః + ఇవ – కల్పవృక్షములవలె నున్నవారగు, తే ప్రాదురాసన్ ఇతి పూర్వేణాన్వయః।

**తాత్పర్యము :–** ముత్యముల జందెములను ధరించినవారు, స్వర్ణమయములగు నారవస్త్రములు గలవారు, రత్నమయములగు రుద్రాక్షమాలలు గలవారు, కార్యార్థపర్యటనమును ఆశ్రయించినవారును, కల్పవృక్షములవలె నున్నవారగు, (ఆ సప్తర్షులు శివునిముంగిట ప్రత్యక్షమైనారని అన్వయము)

**పాఠాన్తరాలు :–** 1. హైమ – హేమ, 2. ప్రవ్రజ్యాం...ఆశ్రితాః – ప్రవ్రజ్యాః... ఆస్థితాః 3. ఇవాశ్రితాః – ఇవ శ్రితాః

**విభక్తులు / క్రియలు :–** 1. ముక్తాయజ్ఞోపవీతాని – ...వీతమ్, ...వీతే, **...వీతాని** ;అకారాన్త నపుంసకలింగ ...వీతశబ్దము. ద్వి.బ 2. బిభ్రతః – బిభ్రత్, బిభ్రతౌ, **బిభ్రతః**; తకారాన్త పుంలింగ బిభ్రత్‌శబ్దము, ప్ర.బ. 3. హైమవల్కలాః – హైమవల్కలః, హైమవల్కలౌ, **హైమవల్కలాః**; అకారాన్త పుంలింగ హైమవల్కలశబ్దము. ప్ర.బ. 4. రత్నాక్షసూత్రాః – రత్నాక్షసూత్రః, రత్నాక్షసూత్రౌ, **రత్నాక్షసూత్రాః**; అకారాన్త పుంలింగ రత్నాక్షసూత్రశబ్దము. ప్ర.బ. 5. ఆశ్రితాః – ఆశ్రితః, ఆశ్రితౌ, **ఆశ్రితాః** ;అకారాన్త పుంలింగ ఆశ్రితశబ్దము. ప్ర.బ.6. కల్పవృక్షాః – కల్పవృక్షః, కల్పవృక్షౌ, **కల్పవృక్షాః**; అకారాన్త పుంలింగ కల్పవృక్షశబ్దము. ప్ర.బ. 7. ప్రవ్రజ్యామ్ – **ప్రవ్రజ్యామ్,** ప్రవజ్యే, ప్రవజ్యాః; ఆకారాన్త స్త్రీలింగ ప్రవ్రజ్యాశబ్దము. ద్వి.ఏ 8. ఇవ – అవ్యయము.

**సమాసాలు :–**

1. ముక్తాయజ్ఞోపవీతాని – యజ్ఞస్య ఉపవీతాని (ష.త.) యజ్ఞోపవీతాని, ముక్తానాం యజ్ఞోపవీతాని (ష.త.), ముక్తాయజ్ఞోపవీతాని, తాని।
2. హైమవల్కలాః – హేమ్నః వికారా హైమాని, తాని వల్కలాని యేషాం (బహువ్రీహి) తే హైమవల్కలాః।
3. రత్నాక్షసూత్రాః – అక్షాణాం సూత్రాణి అక్షసూత్రాణి, రత్నమయాని అక్షసూత్రాణి యేషాం (బహువ్రీహి) తే, రత్నాక్షసూత్రాః।

**సంధులు :–**

1. బిభ్రతః + హైమవల్కలాః – బిభ్రతో హైమవల్కలాః – ఉత్వాదేశః।
2. కల్పవృక్షాః + ఇవ – కల్పవృక్షా ఇవ – విసర్గలోపః।





3. ఇవ + ఆశ్రితాః – ఇవాశ్రితాః – సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. ప్రవ్రజ్యా –**

ఎ) ప్రవ్రజనం ప్రవ్రజ్యా, తాం ప్రవ్రజ్యామ్। 'వ్రజయజోర్భావే క్యప్' ఇతి క్యప్ । (3–3–98)। వ్రజ్యా। ఇజ్యా।

బి) శ్లో॥ **వ్రజ్యావతీ** నిరుద్ధాక్షాన్ విధ్యేవానుష్ఠితక్రియాన్।
నిరచిక్రమదిచ్ఛాతో వానరాంశ్చఙ్క్రమావతః॥ – ఇతి భట్టికావ్యే 7–72
వ్రజ్యావతీ ప్రశస్తగతిమతీ। భావే క్యప్। తతః ప్రశంసాయాం మతుప్। తతో జీప్।

సి) **ప్రవ్రజ్యా** – అనుదానికి 'సర్వశబ్ద' నిఘంటువు 'కార్యార్థపర్యటనమ్' అని చక్కని అర్థమును ఇచ్చినది.

డి) శ్లో॥ దయా వా స్నేహో వా భగవతి నిజే **–** స్మిం**శిశు**జనే
భవత్యాః సంసారాద్విరతమపి చిత్తం ద్రవయతి।
అతశ్చ **ప్రవ్రజ్యా**సులభసమయాచారవిముఖః
ప్రసక్తస్తే యత్నః ప్రభవతి పునర్దైవమపరమ్॥ – ఇతి మాలతీమాధవే 4–6

ఇ) 'అత్ర చతుర్థాశ్రమవాచినా ప్రవ్రజ్యాశబ్దేన వానప్రస్థాశ్రమో లక్ష్యతే'। 'జహుః పరిగ్రహవ్రీడాం ప్రాజాపత్యాస్తపస్వినః – 6–34' ఇతి సపత్నీకత్వాభిధానాత్।
శ్లో॥ సుతవిన్యస్తపత్నీకస్తయా వానుగతో వనమ్।
వానప్రస్థో బ్రహ్మచారీ సాగ్నిః సోపాసనో వ్రజేత్॥ యాజ్ఞవల్క్యస్మృతి ప్రా. 45శ్లో, ఇతి వానప్రస్థస్యోభయథాపి స్మరణాత్। – అని పుంసవనీ వ్యాఖ్య మల్లినాథుని వ్యాఖ్యను ఉటంకించినది.

---

**శ్లో॥ అధఃప్రస్థాపితాశ్వేన – సమావర్జితకేతునా।**
**సహస్రరశ్మినా సాక్షాత్ – సప్రణామముదీక్షితాః॥ 7**

**పదవిభాగము :–** అధఃప్రస్థాపితాశ్వేన, సమావర్జితకేతునా, సహస్రరశ్మినా, సాక్షాత్, సప్రణామమ్, ఉదీక్షితాః।

**అన్వయక్రమము :–** అధఃప్రస్థాపితాశ్వేన సమావర్జితకేతునా సహస్రరశ్మినా సాక్షాత్ సప్రణామమ్ ఉదీక్షితాః తే ప్రాదురాసన్ ఇతి పూర్వేణాన్వయః।

**ప్రతిపదార్థము :–** అధఃప్రస్థాపితాశ్వేన – క్రిందు నడుపబడిన గుఱ్ఱములు కలవాడును, సమావర్జితకేతునా – వంచబడిన ధ్వజము కలవాడును, సహస్రరశ్మినా – వేయి కిరణములు గలవాడును అగు సూర్యునిచేత, సాక్షాత్ – స్వయముగా, సప్రణామమ్ – నమస్కారపూర్వకముగా, ఉదీక్షితాః – పైకి చూడబడినవారు, తే ప్రాదురాసన్ పురః ప్రభోః ఇతి పూర్వేణాన్వయః।

**తాత్పర్యము :–** క్రిందు నడుపబడిన గుఱ్ఱములు కలవాడును, వంచబడిన ధ్వజము కలవాడును, వేయి కిరణములు గలవాడును అగు సూర్యునిచేత స్వయముగా నమస్కారపూర్వకముగా పైకి చూడబడినవారు (అగు ఆ సప్తర్షులు శివుని ముందఱ ప్రత్యక్షమైనారని అన్వయము)

**పాఠాన్తరాలు :–** 1. సాక్షాత్ – శశ్వత్, 2. ప్రస్థాపితా... – ప్రవర్తితా...

**విభక్తులు / క్రియలు :–** 1. అధఃప్రస్థాపితాశ్వేన – **...అశ్వేన**, ...అశ్వాభ్యామ్, ...అశ్వైః; అకారాన్త పుంలింగ ...అశ్వశబ్దము. తృ.ఏ. 2. సమావర్జితకేతునా – **...కేతునా**, ...కేతుభ్యామ్, ...కేతుభిః; ఉకారాన్త పుంలింగ ...కేతుశబ్దము. తృ.ఏ. 3. సహస్రరశ్మినా – **...రశ్మినా**, ...రశ్మిభ్యామ్, ...రశ్మిభిః ఇకారాన్త పుంలింగ ...రశ్మిశబ్దము. తృ.ఏ. 4. సాక్షాత్ – అవ్యయము 5. సప్రణామమ్ – అవ్యయము 6. ఉదీక్షితాః – ఉదీక్షితః, ఉదీక్షితౌ, **ఉదీక్షితాః**; అకారాన్త పుంలింగ ఉదీక్షితశబ్దము. ప్ర.బ.

**సమాసాలు :–**

1. అధఃప్రస్థాపితాశ్వేన – అధః ప్రస్థాపితాః అశ్వాః యేన (బహువ్రీహి) సః అధః ప్రస్థాపితాశ్వః, తేన।
2. సమావర్జితకేతునా – సమావర్జితః కేతుః యేన (బహువ్రీహి) సః, సమావర్జితకేతుః తేన।
3. సహస్రరశ్మినా – సహస్రం రశ్మయః యస్య (బహువ్రీహి)సః, సహస్రరశ్మిః తేన।
4. సప్రణామమ్ – ప్రణామేన సహితం సప్రణామం యథా స్యాత్తథా – ఉదీక్షణ క్రియావిశేషణం చైతత్।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. సహస్రరశ్మిః** – (పుం.) ఎ) సహస్రం రశ్మయః యస్య। సూర్యః

బి) శ్లో।। అశక్నువన్ సోఢుమధీరలోచన–
**స్సహస్రరశ్మే**రివ యస్య దర్శనమ్।



ప్రవిశ్య హేమాద్రిగుహాగృహాంతరం
నినాయ బిభ్యద్దివసాని కౌశికః।। –ఇతి మాఘమహాకావ్యే– 1–53

'అప్రతీపప్రతాపాతిభీషణుడైన (రావణుని) యీతనిజూడనోడి యింద్రుడు సూర్యుని జూడజాలని గూడ్లగూబవలె కనులు మూతపడగా పాటిపోయి మేరుపర్వతకందరములో దాగుకొని అక్కడను భయపడుచునే కాలము పుచ్చెను'. – వావిళ్లప్రతి.

సి) 'అశ్నోతే రశ్చ' (ఉణాది 4–46) ఇతి మిః। అశూ – వ్యాప్తౌ, స్వాది / ఆత్మనేపదీ / వేట్ + మిః। అశ్నుతే వ్యాప్నోతి ఇతి **రశ్మిః**। రశ్మిః కిరణో రజ్జుశ్చ।

---

**శ్లో।। ఆసక్తబాహులతయా – సార్ధముద్ధృతయా భువా।**
**మహావరాహదంష్ట్రాయాం – విశ్రాన్తాః ప్రలయాపది।। 8**

**పదవిభాగము:–** ఆసక్తబాహులతయా, సార్థమ్, ఉద్ధృతయా, భువా, మహావరాహ దంష్ట్రాయామ్, విశ్రాన్తాః, ప్రలయాపది।

**అన్వయక్రమము :–** ప్రలయాపది ఆసక్తబాహులతయా ఉద్ధృతయా భువా సార్థం మహావరాహదంష్ట్రాయాం విశ్రాన్తాః తే ప్రాదురాసన్ ఇతి పూర్వేణ అన్వయః।

**ప్రతిపదార్థము :–** ప్రలయాపది – ప్రలయకాలమందలి కష్టమున, ఆసక్తబాహులతయా – తగుల్కొనిన తీగవంటి బాహువుకలదై, ఉద్ధృతయా – పెళ్లగింపబడిన, భువా సార్థమ్ – భూమితో బాటు, మహావరాహదంష్ట్రాయామ్ – ఆదివరాహమూర్తి యొక్క కోరయందు, విశ్రాన్తాః – సేద తీరినవారు, అగు, ప్రాదురాసన్ ఇతి పూర్వేణాన్వయః।

**తాత్పర్యము :–** ప్రలయకాలమందలి కష్టమున తగుల్కొనిన తీగవంటి బాహువు కలదై పెళ్లగింపబడిన భూమితోబాటు ఆదివరాహమూర్తియొక్క కోరయందు సేదతీరినవారు అగు (ఆ సప్తర్షులు శివభగవానుని ముందఱ నిలిచిరి అని అన్వయము.)

**పాఠాన్తరాలు :–** 1. ఉద్ధృతయా – ఉద్ధతయా.

**విభక్తులు / క్రియలు :–** 1. ప్రలయాపది – **ప్రలయాపది**, ప్రలయాపదోః, ప్రలయాపత్సు; దకారాన్త స్త్రీలింగ ప్రలయాపద్‌శబ్దము. స.ఏ. 2. ఆసక్తబాహులతయా – **...లతయా,** ...లతాభ్యామ్,

...లతాభిః; ఆకారాన్త స్త్రీలింగ...లతాశబ్దము. తృ.ఏ. 3. ఉద్ధృతయా – **ఉద్ధృతయా,** ఉద్ధృతాభ్యామ్, ఉద్ధృతాభిః ఆకారాన్త స్త్రీలింగ ఉద్ధృతాశబ్దము. తృ.ఏ. 4. భువా – **భువా**, భూభ్యామ్, భూభిః; ఊకారాన్త స్త్రీలింగ భూశబ్దము. తృ.ఏ. 5. సార్ధమ్ – అవ్యయము 6. మహావరాహదంష్ట్రాయామ్ – **...దంష్ట్రాయామ్,** ...దంష్ట్రయోః, ...దంష్ట్రాసు; ఆకారాన్త స్త్రీలింగ...దంష్ట్రాశబ్దము. స.ఏ. 7. విశ్రాన్తాః – విశ్రాన్తః, విశ్రాన్తౌ, **విశ్రాన్తాః**; అకారాన్త పుంలింగ విశ్రాన్తశబ్దము. ప్ర.బ.

**సమాసాలు :–**

1. ప్రలయాపది – ప్రకృష్టః లయః యస్మిన్ (బహువ్రీహి) సః, ప్రలయః, ప్రలయ ఏవ ఆపత్, ప్రలయాపత్ (కర్మధా.), తస్యామ్।
2. ఆసక్తబాహులతయా – బాహుః ఏవ లతా (కర్మధా.) బాహులతా, ఆసక్తా బాహులతా యయా (బహువ్రీహి)సా, ఆసక్తబాహులతా, తయా।
3. మహావరాహదంష్ట్రాయామ్ – మహాన్ చ అసౌ వరాహః (కర్మధా.) మహావరాహః, మహావరాహస్య దంష్ట్రా (ష.త.) మహావరాహదంష్ట్రా, తస్యామ్।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

1. **భూః** :– (స్త్రీ.)

ఎ) భవత్యస్యామితి, భూ + అధికరణే క్విప్।

బి) శ్లో॥ **భూ ర్భూమి**ర్వసుధావనిర్వసుమతీ ధాత్రీ ధరిత్రీ ధరా
గౌర్గోత్రా జగతీ రసా క్షితిరిలా క్షోణీ క్షమా క్ష్మాచలా।
కుః పృథ్వీ పృథివీ స్థిరా చ ధరణీ విశ్వమ్భరా మేదినీ
జ్యానన్తా విపులా సముద్రవసనా సర్వంసహోర్వీ మహీ॥

శ్లో॥ కాశ్యపీ భూతధాత్రీ చ రత్నగర్భా వసుంధరా।
ధరాధారా చ విజ్ఞేయా తద్విశేషాన్నిబోధత॥ 157

అని హలాయుధకోశము '37' నామములను పేర్కొన్నది.

సి) "న చైనం భువి శక్నోతి కశ్చిదప్యభివీక్షితుమ్" ఇతి మనుః

డి) శ్లో॥ **భూర్భూమిః**...
.... స్యుర్మేమీమేఖలామ్బరాః।
– అని 'అభిధానచిన్తామణి '43' నామములను పేర్కొన్నది.

ఇ) శ్లో॥ **'భూర్భూమిః** పృథివీ పృథ్వీ మేదినీ వసుధావనిః।
క్షితిరుర్వీ మహీ క్షోణీ క్ష్మా ధరా కుర్వసుంధరా॥

అని హలాయుధకోశ వ్యాఖ్యాత 'వైద్యకరత్నమాలాయామ్' అని పేర్కొనినాడు.





ఎఫ్) "య్వన్తమేకాక్షరమ్' । శ్రీః। భూః। లింగానుశాసనప్రకరణమ్ (12)

జి) **'భూసూక్తమ్'** ను ఇట అనుసంధానము చేసికొందురుగాక!

**2. వరాహః – (పుం.)**

ఎ) వరాన్ ఆహన్తి। హన్ + డ।

శ్లో॥ ఏకార్ణవే హి మగ్నాం తాం వారాహం రూపమాస్థితః।
ఉద్దధార మహీం యో – సౌ తస్మై క్రోడాత్మనే నమః॥

ఏ దేవుడు జగమంతయు నొక్కటిగ జలార్ణవమై యుండగా నందు మునిగిపోయిన ఆ భూమినైతే వరాహసంబంధ (సూకర) మైన రూపమును గ్రహించియుండువాడై ఉద్ధరించెనో వరాహస్వరూపుడగు ఆ శ్రీమహావిష్ణువునకు నమస్కారము – భీష్మస్తవరాజము – 82

---

**శ్లో॥ సర్గశేష ప్రణయనా – ద్విశ్వయోనేరనన్తరమ్।
పురాతనాః పురావిద్భిః – ధాతార ఇతి కీర్తితాః ॥ 9**

**పదవిభాగము :–** సర్గశేషప్రణయనాత్, విశ్వయోనేః, అనన్తరమ్, పురాతనాః, పురావిద్భిః, ధాతారః, ఇతి, కీర్తితాః।

**అన్వయక్రమము :–** విశ్వయోనేః అనన్తరం సర్గశేషప్రణయనాత్ పురావిద్భిః పురాతనాః ధాతారః ఇతి కీర్తితాః తే ప్రాదురాసన్ ఇతి పూర్వేణాన్వయః।

**ప్రతిపదార్థము :–** విశ్వయోనేః – ప్రపంచమునకు కారణభూతుడైన బ్రహ్మకు, అనన్తరమ్ – పిమ్మటను, సర్గశేషప్రణయనాత్ – సృష్టియొక్క మిగుల రచనమువలన, పురావిద్భిః – పురాణవిదులగు వ్యాసాదులచేత, పురాతనాః – ప్రాచీనులగు, ధాతారః + ఇతి – సృష్టికర్తలు అని, కీర్తితాః – కొనియాడబడినవారు, అగు. తే ప్రాదురాసన్ ఇతి పూర్వేణాన్వయః।

**తాత్పర్యము :–** ప్రపంచమునకు కారణభూతుడైన బ్రహ్మకు పిమ్మట సృష్టియొక్క మిగుల రచనమువలన పురాణవిదులగు వ్యాసాదులచేత ప్రాచీనులగు సృష్టికర్తలు అని కొనియాడబడినవారు, అగు (ఆ సప్తర్షులు శివునిముందఱ నిలిచిరి, అని అన్వయము)

**విభక్తులు / క్రియలు :–** 1. విశ్వయోనేః – **విశ్వయోనేః**, విశ్వయోన్యోః, విశ్వయోనీనామ్; ఇకారాన్త పుం / స్త్రీలింగ విశ్వయోనిశబ్దము. ష.ఏ. 2. అనన్తరమ్ – **అనంతరమ్**, అనంతరౌ, అనంతరాన్; అకారాన్త పుంలింగ అనంతరశబ్దము. ద్వి.ఏ. 3. సర్గశేషప్రణయనాత్ – **...ప్రణయనాత్**, ... ప్రణయనాభ్యామ్, ...ప్రణయనేభ్యః; అకారాన్త నపుంసకలింగ ప్రణయనశబ్దము. పం.ఏ. 4. పురావిద్భిః – పురావిదా, పురావిద్భ్యామ్, **పురావిద్భిః;** దకారాన్త పుంలింగ పురావిద్‌శబ్దము. తృ.బ. 5. పురాతనాః – పురాతనః, పురాతనౌ, పురాతనాః; అకారాన్త పుంలింగ పురాతనశబ్దము. ప్ర.బ. 6. ధాతారః – ధాతా, ధాతారౌ, ధాతారః; ఋకారాన్త పుంలింగ ధాతృశబ్దము. ప్ర.బ. 7. కీర్తితాః – కీర్తితః, కీర్తితౌ, కీర్తితాః; అకారాన్త పుంలింగ కీర్తితశబ్దము. ప్ర.బ. 8. ఇతి – అవ్యయము.

**సమాసాలు :–**

1. విశ్వయోనేః – విశ్వస్య యోనిః (ష.త.) విశ్వయోనిః, తస్య విశ్వయోనేః।
2. సర్గశేషప్రణయనాత్ – సర్గస్య శేషః (ష.త.) సర్గశేషః, తస్య ప్రణయనం (ష.త.) సర్గశేషప్రణయనం, తస్మాత్।
3. పురావిద్భిః – పురాతత్త్వం విదన్తీతి పురావిదః తైః పురావిద్భిః।

**సంధులు :–**

1. విశ్వయోనేః + అనంతరమ్ – విశ్వయోనేరనన్తరమ్ – విసర్గసన్ధిః (రుత్వమ్)।
2. ధాతారః + ఇతి – ధాతార ఇతి – విసర్గలోపము।
3. సర్గశేషప్రణయనాత్ + విశ్వయోనేః – సర్గశేషప్రణయనాద్విశ్వయోనేః – జశ్త్వసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. అనంతరః – (పుం.)**

ఎ) న విద్యతే అంతరం యస్య సః, అనంతరః। తమ్ **అనంతరమ్** – అకారాన్త పుంలింగ అనంతరశబ్దము. ద్వి.ఏ

బి) శ్లో॥ ప్రదక్షిణీకృత్య హుతం హుతాశమ్
**అనంతరం** భర్తురరున్ధతీం చ।
ధేనుం సవత్సాం చ నృపః ప్రతస్థే
సన్మంగళోదగ్రతరప్రభావః ॥ – ర.వం. 2 – 71

2. శ్లో॥ తదిదం క్రియతా**మనన్తరం**
భవతా బన్ధుజనప్రయోజనమ్।
విధురాం జ్వలనాతిసర్జనా –
న్నను మాం ప్రాపయ పత్యురన్తికమ్॥ – కు.సం. 4–32





3. శ్లో॥ యే త్వన్తపాలాః ప్లవగాః శీఘ్రగా వ్యవసాయినః।
సమానయన్తు తే శీఘ్రం త్వరితాః శాసనాన్ మమ॥ 32
స్వయం **చానన్తరం** కార్యం భవానేవానుపశ్యతు।
– ఇతి శ్రీమద్రామాయణే – కిష్కింధకాణ్డే – 29 సర్గే

"…. **తరువాత చేయవలసిన పనిని** నీవే స్వయముగా చూచెదవుగాక!

---

**శ్లో॥ ప్రాక్తనానాం విశుద్ధానాం – పరిపాకముపేయుషామ్।**
**తపసాముపభుఞ్జానాః – ఫలాన్యపి తపస్వినః॥ 10**

**పదవిభాగము :–** ప్రాక్తనానామ్, విశుద్ధానామ్, పరిపాకమ్, ఉపేయుషామ్, తపసామ్, ఉపభుంజానాః, ఫలాని, అపి, తపస్వినః।

**అన్వయక్రమము :–** ప్రాక్తనానాం విశుద్ధానాం పరిపాకమ్ ఉపేయుషాం తపసాం ఫలాని ఉపభుంజానాః అపి తపస్వినః తే ప్రాదురాసన్ ఇతి పూర్వేణాన్వయః।

**ప్రతిపదార్థము :–** ప్రాక్తనానామ్ – పూర్వజన్మమునందలివియు, విశుద్ధానామ్ – నిర్మలములైనవియు, పరిపాకమ్ – ఫలించుదశను, ఉపేయుషామ్ – పొందినవియు అగు, తపసామ్ – తపములయొక్క, ఫలాని – ఫలములను, ఉపభుంజానాః అపి – అనుభవించుచున్నవారును, తపస్వినః – తపమందు ఉన్నవారు, అగు, తే ప్రాదురాసన్ ఇతి పూర్వేణాన్వయః।

**తాత్పర్యము :–** పూర్వజన్మము నందలివియు, నిర్మలములైనవియు, ఫలించుదశను పొందినవియు అగు తపఃఫలములను అనుభవించుచున్నవారును, తపముందున్నవారును, అగు (ఆ సప్తర్షులు శివునియెదుట ప్రత్యక్షమైనారని అన్వయము)

**విభక్తులు / క్రియలు :–** 1. ప్రాక్తనానామ్ – ప్రాక్తనస్య, ప్రాక్తనయోః, **ప్రాక్తనానామ్**; అకారాన్త నపుంసకలింగ ప్రాక్తనశబ్దము. ష.బ. 2. విశుద్ధానామ్ – విశుద్ధస్య, విశుద్ధయోః, **విశుద్ధానామ్**; అకారాన్త నపుంసకలింగ విశుద్ధశబ్దము. ష.బ. 3. ఉపేయుషామ్ – ఉపేయుషః, ఉపేయుషోః, **ఉపేయుషామ్;** షకారాన్త నపుంసకలింగ ఉపేయుష్‌శబ్దము. ష.బ. 4. తపసామ్ – తపసః, తపసోః, **తపసామ్;** సకారాన్త నపుంసకలింగ తపశ్శబ్దము. ష.బ. 5. పరిపాకమ్ – **పరిపాకమ్,** పరిపాకౌ, పరిపాకాన్; అకారాన్త పుంలింగ పరిపాకశబ్దము. ద్వి.ఏ. 6. ఫలాని – ఫలమ్, ఫలే, **ఫలాని;** అకారాన్త నపుంసకలింగ ఫలశబ్దము. ద్వి.బ. 7. ఉపభుంజానాః – ఉపభుంజానః,

ఉపభుంజానౌ, **ఉపభుంజానాః;** అకారాన్త పుంలింగ ఉపభుంజానశబ్దము. ప్ర.బ. 8. తపస్వినః – తపస్వీ, తపస్వినౌ, **తపస్వినః;** నకారాన్త పుంలింగ తపస్విన్‌శబ్దము. ప్ర.బ. 9. అపి – అవ్యయము.

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. ప్రాక్తనానామ్ – ప్రాగ్భవాని ప్రాక్తనాని (త.వృ.), తేషాం ప్రాక్తనానామ్।
2. విశుద్ధానామ్ – విశేషేణ శుద్ధాని విశుద్ధాని తేషాం విశుద్ధానామ్ (సుప్సుపాసమాసః)।
3. తపస్వినః – తపః అస్తిః యేషాం (బహువ్రీహి) తే, తపస్వినః।

**సంధులు :–**

1. ఫలాని + అపి – ఫలాన్యపి – యణాదేశసన్ధిః।
   **ఇకో యణచి** (సూ. 6-1-74) ఇ, ఉ, ఋ, ఌ వర్ణములకు అసవర్ణమైన అచ్చు పరముగా నున్నప్పుడు క్రమముగా య్, వ్, ర్, ల్ (యణ్) అనునవి ఆదేశమగును.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. ఉపభుంజానాః :–** ఉపభుంజతే ఇతి ఉపభుంజానాః । 'భుజ – పాలనాభ్యవ్యవహారయోః' ఇత్యాత్మనేపదిత్వాత్ **శానచ్** ప్రత్యయః, భుజ – పాలనాభ్యవ్యవహారయోః, రుధాదయః, సకర్మకమ్, అనిట్, పాలనే – పరస్మైపదీ, అన్యత్ర ఆత్మనేపదీ।

పాలనభిన్నే - ర్థే ఆత్మనేపదమ్ – భుఙ్త్కే, భుఞ్జాతే, **భుఞ్జతే**

'ఉప అను సర్గము కూడినప్పుడు 'అనుభవించుట' అనునర్థమును పొందును.

ఆప్టే మహాశయుడు ఈ ధాతువునుగూర్చి వివరించునపుడు ఈ శ్లోకమునే ఉదాహరణగా చూపినాడు. (ఉపభుజ్ – పేజి 454)

**అలంకారములు :–** అత్ర తపః ఫలానుభవతపశ్చరణలక్షణయోః క్రియయోః యుగపద్ విరోధాత్ విరోధాలంకారః। తల్లక్షణం యథా –

**'విరోధః సో - విరోధే - పి విరుద్ధత్వేన యద్ వచః'।** – ఇతి కావ్యప్రకాశే।

సప్తర్షీణాం లోకోత్తరమహాప్రభావవత్త్వేన విరోధపరిహారః, ఇతి బోధ్యమ్।

**'ఇతి సప్తభిః శ్లోకైః కులకమ్'**

---





**శ్లో॥ తేషాం మధ్యగతా సాధ్వీ – పత్యుః పాదార్పితేక్షణా**
**సాక్షాదివ తపఃసిద్ధి – ర్బభాసే బహురున్ధతీ॥ 11**

**పదవిభాగము :–** తేషామ్, మధ్యగతా, సాధ్వీ, పత్యుః, పాదార్పితేక్షణా, సాక్షాత్, ఇవ, తపఃసిద్ధిః, బభాసే, బహు, అరున్ధతీ।

**అన్వయక్రమము :–** తేషాం మధ్యగతా సాధ్వీ పత్యుః పాదార్పితేక్షణా అరున్ధతీ సాక్షాత్ తపస్సిద్ధిః ఇవ బహు బభాసే।

**ప్రతిపదార్థము :–** తేషామ్ – ఆ సప్తర్షులకు, మధ్యగతా – నడుమనున్నదియు, సాధ్వీ – పతివ్రతయు, పత్యుః – భర్త (యగువశిష్ఠుని) యొక్క, పాదార్పితేక్షణా – పాదములయందు ఉంచబడిన దృష్టికలదియు అగు, అరున్ధతీ – అరున్ధతీదేవి, సాక్షాత్ – ప్రత్యక్షమైన, తపః సిద్ధిః ఇవ – తపస్సుయొక్క సిద్ధియో అనునట్లుగా, బహు – మిక్కిలి, బభాసే – ప్రకాశించెను.

**తాత్పర్యము :–** ఆ సప్తర్షులకు నడుమనున్నదియు, పతివ్రతయు, భర్తయగు వశిష్ఠుని యొక్క పాదములయందు ఉంచబడిన దృష్టికలదియు, అగు అరున్ధతీదేవి ప్రత్యక్షమైన తపస్సుయొక్క సిద్ధియో యనునట్లుగా మిక్కిలి ప్రకాశించెను.

**విభక్తులు / క్రియలు :–**1. తేషామ్ – తస్య, తయోః, **తేషామ్**; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ష.బ. 2. మధ్యగతా – **మధ్యగతా**, మధ్యగతే, మధ్యగతాః; ఆకారాన్త స్త్రీలింగమధ్యగతాశబ్దము. ప్ర.ఏ. 3. సాధ్వీ – **సాధ్వీ,** సాధ్వ్యౌ, సాధ్వ్యః; ఈకారాన్త స్త్రీలింగ సాధ్వీశబ్దము. ప్ర.ఏ. 4. పత్యుః – **పత్యుః**, పత్యోః, పతీనామ్; ఇకారాన్త పుంలింగ పతిశబ్దము. ష.ఏ. 5. పాదార్పితేక్షణా – ...ఈక్షణా, ...ఈక్షణే, **...ఈక్షణాః**; ఆకారాన్త స్త్రీలింగ ... ఈక్షణాశబ్దము. ప్ర.ఏ. 6. అరున్ధతీ – **అరున్ధతీ**, అరున్ధత్యౌ, అరున్ధత్యః; ఈకారాన్త స్త్రీలింగ అరున్ధతీశబ్దము. ప్ర.ఏ. 7. సాక్షాత్ – అవ్యయము 8. తపఃసిద్ధిః – **తపఃసిద్ధిః**, తపఃసిద్ధీ, తపఃసిద్ధయః; ఇకారాన్త స్త్రీలింగ తపస్సిద్ధిశబ్దము. ప్ర.ఏ. 9. ఇవ, 10. బహు – **బహు**, బహునీ, బహూనీ; ఉకారాన్త నపుంసకలింగ బహుశబ్దము. ప్ర.ఏ. 11. బభాసే – క్రియ.

**సమాసాలు :–**

1. మధ్యగతా – మధ్యం గతా (ద్వి.త.) ద్వితీయా శ్రితాతీత పతిత **గతా**త్యస్తప్రాప్తాపన్నైః(సూ. 2-1-24)
2. పాదార్పితేక్షణా – అర్పితే ఈక్షణే యయా (బహువ్రీహి) సా అర్పితేక్షణా, పాదయోః అర్పితేక్షణా (స.త.) పాదార్పితేక్షణా।
3. తపఃసిద్ధిః – తపసః సిద్ధిః (ష.త.) తపఃసిద్ధిః।

**సంధులు :-**

1. సాక్షాత్ + ఇవ – సాక్షాదివ – జశ్త్వసన్ధిః
2. తపఃసిద్ధిః + బభాసే – తపస్సిద్ధి ర్బభాసే – విసర్గసన్ధిః (రుత్వమ్)।
3. బహు + అరున్ధతీ – బహ్వరున్ధతీ – యణాదేశసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :-**

**1. బహుః (త్రి.) :-**

ఎ) బంహతే ఇతి। బహి వృద్ధౌ + 'లంఘిబంహ్యోర్యలోపశ్చ'
ఉణాది (1–29) ఇతి కుః । లఘుః ।
వార్తికమ్ – బాలమూలలఘ్వలమఙ్గులీనాం వా లో రత్వమాపద్యతే।
రఘుః నృపభేదః । బహుః।

బి) శ్లో॥ అతిశయపరిణాహవాన్వితేన
బహుతరమర్పితరత్నకింకిణీకః।
అలఘుని జఘనస్థలే పరస్యాః
ధ్వనిమధికం కలమేఖలాకలాపః॥ – మాఘే – 7–5.

ఎ) + బి) పాణినీయసూత్రవ్యాఖ్యనుండి

సి) శ్లో॥ ఏకాతపత్రం జగతః ప్రభుత్వం
నవం వయః కాంతమిదం వపుశ్చ।
అల్పస్య హేతో**ర్బహు** హాతుమిచ్ఛన్
విచారమూఢః ప్రతిభాసి మే త్వమ్॥ – ర.వం. 2–47

డి) శ్లో॥ 'అల్పం వా బహు వా ప్రేత్య దానస్యావాప్యతే ఫలమ్'
– ఇతి మనుః 7–86

**అలంకారములు :-** ఇందు 'ఉత్ప్రేక్షాలంకార' మున్నదని చెప్పదగును. అరున్ధతీదేవిని తపఃసిద్ధియో అనునట్లు వర్ణించుటచే నిది 'ఉత్ప్రేక్షాలంకార'మని చెప్పదగును. ఉపమానమునకున్న ధర్మములే యుపమేయమునందుండుటచేత నుపమేయమున కుపమానతాదాత్మ్యము నూహించినయెడల ఉత్ప్రేక్షయగును.

**క్రియాదర్శము :- బభాసే :-** 'భాసృ – దీప్తౌ' అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ। భ్వాదయః (1), లిట్ – ప్రథమపురుషైకవచనాంతః। (గాదృ – వత్)

**బభాసే** – బభాసాతే – బభాసిరే





శ్లో॥ 'తావత్ కామనృపాతపాత్రసుషమం బిమ్బం **బభాసే** విధోః'
– భామినీవిలాసే – 2–74

---

**శ్లో॥ తామగౌరవభేదేన – మునీంశ్చాపశ్యదీశ్వరః।**
**స్త్రీ పుమానిత్యనాస్థైషా – వృత్తం హి మహితం సతామ్॥ 12**

**పదవిభాగము :-** తామ్, అగౌరవభేదేన, మునీన్, చ, అపశ్యత్, ఈశ్వరః, స్త్రీ, పుమాన్, ఇతి, అనాస్థా, ఏషా, వృత్తమ్, హి, మహితమ్, సతామ్।

**అన్వయక్రమము :-** ఈశ్వరః తాం మునీన్ చ అగౌరవభేదేన అపశ్యత్। హి స్త్రీ పుమాన్ ఇతి ఏషా అనాస్థా । (కిన్తు) సతాం వృత్తం మహితమ్ (భవతి)।

**ప్రతిపదార్థము :-** ఈశ్వరః – శివుడు, తామ్ – ఆ అరున్ధతీదేవిని, మునీన్ చ – సప్తర్షులనుకూడ, అగౌరవభేదేన – గౌరవమందు తారతమ్యము లేకుండ, అపశ్యత్ – చూచెను, హి – ఏలయన, స్త్రీ పుమాన్ – ఆడుది, మగవాడు, ఇతి ఏషా – అని ఇది, అనాస్థా – వివక్షితము గాదు, (కిన్తు) – మఱి, సతామ్ – సత్పురుషులకు, వృత్తమ్ – చరిత్రము, మహితమ్ – పూజ్యమయినది, (భవతి) – అగుచున్నది.

**తాత్పర్యము :-** శివుడు ఆ అరున్ధతీదేవిని సప్తర్షులను కూడా గౌరవమందు తారతమ్యము లేకుండ చూచెను. ఏలయన ఆడుది, మగవాడు అని ఇది వివక్షితము గాదు. సత్పురుషులకు చరిత్రము పూజ్యమైనది (అగుచున్నది.)

**విభక్తులు / క్రియలు :-** 1. ఈశ్వరః – **ఈశ్వరః,** ఈశ్వరౌ, ఈశ్వరాః; అకారాన్త పుంలింగ 'ఈశ్వర' శబ్దము. ప్ర.ఏ. 2. తామ్ – **తామ్,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము ద్వి.ఏ. 3. మునీన్ – మునిమ్, మునీ, **మునీన్**; ఇకారాన్త పుంలింగ మునిశబ్దము. ద్వి.బ. 4. అగౌరవభేదేన – **అగౌరవభేదేన**, అగౌరవభేదాభ్యామ్, అగౌరవభేదైః; అకారాన్త పుంలింగ అగౌరవభేదశబ్దము. తృ.ఏ. 5. చ, హి, ఇతి – అవ్యయాలు 6. అపశ్యత్ – క్రియ 7. స్త్రీ – **స్త్రీ,** స్త్రియౌ, స్త్రియః; ఈకారాన్త స్త్రీలింగ స్త్రీశబ్దము. ప్ర.ఏ 8. పుమాన్ – **పుమాన్,** పుమాంసౌ, పుమాంసః; సకారాన్త పుంలింగ పుంస్శబ్దము. ప్ర.ఏ. 9. అనాస్థా – **అనాస్థా,** అనాస్థే, అనాస్థాః; ఆకారాన్త స్త్రీలింగ అనాస్థాశబ్దము. ప్ర.ఏ. 10. ఏషా – **ఏషా,** ఏతే, ఏతాః; దకారాన్త స్త్రీలింగ ఏతద్శబ్దము. ప్ర.ఏ. 11. సతామ్ – సతః, సతోః, **సతామ్**; తకారాన్త పుంలింగ సచ్ఛబ్దము. ష.బ. 12. వృత్తమ్ – **వృత్తమ్**, వృత్తే, వృత్తాని; అకారాన్త నపుంసకలింగ వృత్తశబ్దము. ప్ర.ఏ. 13. మహితమ్ – **మహితమ్,** మహితే, మహితాని; అకారాన్త నపుంసకలింగ మహితశబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు :-**

1. అగౌరవభేదేన – గురోర్భావః గౌరవమ్, గౌరవస్య భేదః (ష.త.) గౌరవ భేదః, న గౌరవభేదః, అగౌరవభేదః, తేన, అగౌరవభేదేన।
2. అనాస్థా – న ఆస్థా – (నఞ్తత్పురుష)।

**సంధులు :-**

1. మునీన్ + చ – మునీంశ్చ – అనునాసికానుస్వారౌ రుత్వఇచ్చ।
2. చ + అపశ్యత్ – చాపశ్యత్ – సవర్ణదీర్ఘసన్ధిః।
3. అపశ్యత్ + ఈశ్వరః – అపశ్యదీశ్వరః – జశ్త్వసన్ధిః।
4. ఇతి + అనాస్థా – ఇత్యనాస్థా – యణాదేశసన్ధిః।
5. అనాస్థా + ఏషా – అనాస్థైషా – వృద్ధిసన్ధిః – (వృద్ధిరేచి – సూ. 6-1-85)

అవర్ణము (అ, ఆలకు) ఏఓఐఔలు పరమగునపుడు పూర్వపరపదముల స్థానములో వృద్ధి ఏకాదేశమగును.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :-**

**1. అనాస్థా :-** 1.) న ఆస్థా – అనాస్థా – నఞ్తత్పురుషసమాసః

నఞ్ అను అవ్యయము సుబన్తముతో సమసించును. నఞ్ సూ 2-2-6. న **లోపో నఞః** (సూ 6-3-73) తస్మాన్నుడచి (సూ 6-3-74)

నాస్థా, అనాస్థా। నఞర్థస్య న శబ్దస్య సుప్సుపేతి సమాసః। నఞ్ సమాసే **నలోప ప్రసఙ్గః। అనాస్థా** ఇత్యత్ర నలోపో నుడాగమశ్చ।

**ఏ) అనాస్థా :-**

శ్లో॥ ఏతే వయమమీ దారాః – కన్యేయం కులజీవితమ్।
బ్రూత యేనాత్ర వః కార్య – **మనాస్థా** బాహ్యవస్తుషు॥
– కు.సం. 6-63

**బి) నాస్థా :-**

శ్లో॥ **నాస్థా** ధర్మే న వసునిచయే నైవ కామోపభోగే
యద్యద్భవం భవతు భగవన్! పూర్వకర్మానురూపమ్।
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాన్తరే – పి
త్వత్పాదామ్భోరుహయుగగతా నిశ్చలా భక్తిరస్తు॥
– ఇతి ముకున్దమాలాయామ్ – 5



**సి) అనేకధా, నైకధా :-**

శ్లో॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త**మనేకధా**।
అపశ్యద్దేవదేవస్య – శరీరే పాండవస్తదా॥ – భగవద్గీత 11-13

శ్లో॥ అధునీత ఖగః స **నైకధా**
తనుముత్ఫుల్లతనూరుహీకృతామ్।
కరయన్త్రణదన్తురాన్తరే
వ్యలిఖచ్చంచుపుటేన పక్షతీ॥ – నైషధే -2-2

నైకధా అనేకధా । నఞర్థస్య నశబ్దస్య సుప్సుపేతి సమాసః। నఞ్ సమాసే నలోపప్రసంగః। అనేకధా ఇత్యత్ర న లోపో నుడాగమశ్చ।

**అలంకారాలు :-** ఈ శ్లోకమున సామాన్యముచే విశేషమును సమర్థించిన అర్థాన్తరన్యాసాలంకారము గలదు.

సత్పురుషుల చరిత్రము పూజ్యమైనది, అను సామాన్యముచే గౌరవమందు తారతమ్యము లేకుండ శివుడు అరున్ధతీదేవిని సప్తర్షులను చూచెనను విశేషము సమర్థింపబడినది.

**క్రియాదర్శము :-** 1. అపశ్యత్ – 'దృశిర్ – ప్రేక్షణే' (చూచుట), భ్వాదయః (1), సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లఙ్ – ప్రథమపురుషైకవచనాంతః।

**అపశ్యత్** – అపశ్యతామ్ – అపశ్యన్।

---

**శ్లో॥ తద్దర్శనాదభూచ్ఛమ్భో – ర్భూయాన్ దారక్రియాదరః।**
**క్రియాణాం ఖలు ధర్మ్యాణాం – సత్పత్న్యో మూలకారణమ్॥ 13**

**పదవిభాగము :-** తద్దర్శనాత్, అభూత్, శమ్భోః, భూయాన్, దారక్రియాదరః, ఆదరః, క్రియాణామ్, ఖలు, ధర్మ్యాణామ్, సత్పత్న్యః, మూలకారణమ్।

**అన్వయక్రమము :-** తద్దర్శనాత్ శమ్భోః దారక్రియాదరః భూయాన్ అభూత్। ధర్మ్యాణాం క్రియాణాం సత్పత్న్యః మూలకారణం ఖలు।

**ప్రతిపదార్థము :-** తద్దర్శనాత్ – ఆ అరున్ధతీదేవియొక్క దర్శనమువలన, శమ్భోః – శివభగవానునకు, దారక్రియాదరః – వివాహమునందు అక్కఱ, భూయాన్ అభూత్ – మిక్కుటమాయెను, ధర్మ్యాణామ్ – ధర్మయుక్తములయిన, క్రియాణామ్

– యజ్ఞయాగాది క్రియలకు, సత్పత్న్యః – పతివ్రతలైన భార్యలు, మూలకారణమ్ – ప్రథమ కారణము, ఖలు – గదా!

**తాత్పర్యము :–** ఆ అరున్ధతీదేవియొక్క దర్శనమువలన శివభగవానునకు వివాహమునందు అక్కఱ మిక్కుటమాయెను. ధర్మయుక్తములైన యజ్ఞయాగాది క్రియలకు పతివ్రతలైన భార్యలు ప్రథమకారణము గదా!

**పాఠాన్తరాలు :–** 1. భూయాన్ – భూయః, 2. దారక్రియాదరః – దారార్థమాదరః 3. కారణమ్ – సాధనమ్ 4. సత్పత్న్యో మూలకారణమ్ – దామ్పత్యం మూలసాధనమ్।

**విభక్తులు / క్రియలు :–** 1. తద్దర్శనాత్ – **తద్దర్శనాత్,** తద్దర్శనాభ్యామ్, తద్దర్శనేభ్యః; అకారాన్త నపుంసకలింగ తద్దర్శనశబ్దము. పం.ఏ. 2. శమ్భోః – **శమ్భోః**, శమ్భ్వోః, శమ్భూనామ్; ఉకారాన్త పుంలింగ శమ్భుశబ్దము. ష.ఏ. 3. దారక్రియాదరః –**...ఆదరః**, ...ఆదరౌ, ...ఆదరాః; అకారాన్త పుంలింగ ...ఆదరశబ్దము. ప్ర.ఏ. 4. భూయాన్ – **భూయాన్**, భూయాంసౌ, భూయాంసః; సకారాన్త పుంలింగ భూయస్శబ్దము. ప్ర.ఏ. 5. అభూత్ – క్రియ 6. ధర్మ్యాణామ్ – ధర్మ్యాయాః, ధర్మ్యయోః, **ధర్మ్యాణామ్;** ఆకారాన్త స్త్రీలింగ ధర్మ్యాశబ్దము. ష.బ. 7. క్రియాణామ్ – క్రియాయాః క్రియయోః, **క్రియాణామ్;** ఆకారాన్త స్త్రీలింగ క్రియాశబ్దము. ష.బ. 8. సత్పత్న్యః – సత్పత్నీ, సత్పత్న్యౌ, **సత్పత్న్యః;** ఈకారాన్త స్త్రీలింగ సత్పత్నీశబ్దము. ప్ర.బ. 9. మూలకారణమ్ – మూలకారణమ్, మూలకారణే, మూలకారణాని; అకారాన్త పుంలింగ మూలకారణశబ్దము. ప్ర.ఏ. 10. ఖలు – అవ్యయము.

**సమాసాలు :–**

1. తద్దర్శనాత్ – తస్యాః దర్శనమ్ తద్దర్శనం (ష.త.), తస్మాత్। తద్దర్శనాత్।
2. దారక్రియాదరః – దారక్రియా యామ్ ఆదరః దారక్రియాదరః।
3. ధర్మ్యాణామ్ – ధర్మాద్ అనపేతాః ధర్మ్యాః, తాసామ్। ధర్మ్యాణామ్
4. సత్పత్న్యః – సత్యశ్చ తాః పత్న్యః (కర్మధా.) సత్పత్న్యః।
5. మూలకారణమ్ – మూలఞ్చ తత్ కారణమ్ (కర్మధా.) మూలకారణమ్।

**సంధులు :–**

1. తద్దర్శనాత్ + అభూత్ – తద్దర్శనాదభూత్ – జశ్త్వసన్ధిః।
2. అభూత్ + శమ్భోః – అభూచ్ఛమ్భోః – ఛకారాదేశః।
3. శమ్భోః + భూయాన్ – శమ్భోర్భూయాన్ – విసర్గసన్ధిః (రుత్వమ్)।
4. సపత్న్యః + మూలకారణమ్ – సపత్న్యో మూలకారణమ్ – ఉత్వాదేశః।





**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. ఖలు – అవ్యయకోషః (326)**

**నిషేధ – వాక్యాలంకార – జిజ్ఞాసా – అనునయ – నియమ – నిశ్చయ – హేతు – విషాదాదయో – స్యార్థః।**

1. నిషేధే – ఖలు కృత్వా। 'నిర్ధారితే – ర్థే లేఖేన ఖలూక్త్వా ఖలు వాచికమ్' (మాఘః 2–70)
2. వాక్యాలంకారే – 'అథో ఖల్వాహుః – '
3. జిజ్ఞాసాయామ్ – 'ప్రత్యూహేన క్రతూనాం న ఖలు మఖభుజో భుఞ్జతే వా హవీంషి' – అ.రాఘవే 1–25
4. అనునయే–'న ఖలు న ఖలు ముగ్ధే! సాహసం కార్యమేతత్' నాగానందే 2–11
5. నియమే – 'ప్రవృత్తిసారేణ ఖలు మాదృశాం ధియః' కిరాతార్జునీయే 1–25

ప్రవృత్తిసారాః ఖలు మాదృశాం గిరః – అని చౌఖమ్బా పాఠము.

6. నిశ్చయే – 'ఖలు దీయతే తుభ్యమ్'
7. హేతౌ – 'త్వదధీనం ఖలు దేహినాం సుఖమ్।' (కు.సం. 4–10)
8. విషాదే – 'న విదీర్యే, కఠినాః ఖలు స్త్రియః' (కు.సం. 4–5)

పాదపూర్ణే – పి। యథా – 'వధ్యాః ఖలు న వధ్యన్తే – ' రామాయణే (3–41–6) వీప్సాయామపి దృశ్యతే, యథా – 'కాలే ఖలు సమారబ్ధాః ఫలం బధ్నన్తి నీతయః' (ర.వం.)

**అలంకారాలు :–** ఇందు ఉత్తరార్ధముచే పూర్వార్ధము సమర్థింపబడిన 'అర్థాన్తరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును. అన్వయము – సరళము.

**క్రియాదర్శము:– అభూత్** –'భూ– సత్తాయామ్' లుఙ్ – ప్రథమపురుషైక వచనాంతః।

**అభూత్** – అభూతామ్ – అభూవన్।

---

**శ్లో॥ ధర్మేణాపి పదం శర్వే – కారితే పార్వతీం ప్రతి।**
**పూర్వాపరాధభీతస్య – కామస్యోచ్ఛ్వసితం మనః। 14**

**పదవిభాగము:–** ధర్మేణ, అపి, పదమ్, శర్వే, కారితే, పార్వతీమ్, ప్రతి, పూర్వాపరాధభీతస్య, కామస్య, ఉచ్ఛ్వసితమ్, మనః।

**అన్వయక్రమము :–** ధర్మేణ అపి శర్వే పార్వతీం ప్రతి పదం కారితే (సతి), పూర్వాపరాధభీతస్య కామస్య మనః ఉచ్ఛ్వసితమ్।

**ప్రతిపదార్థము :–** ధర్మేణ + అపి – ధర్మముచేత కూడ, శర్వే – శివుడు, పార్వతీమ్ ప్రతి – పార్వతీదేవినిగూర్చి, పదమ్ – అడుగును, కారితే (సతి) – పెట్టించబడినవాడుగా అగుచుండగా, కామస్య – మన్మథునియొక్క, మనః – మనస్సు, ఉచ్ఛ్వసితమ్ – ఊరడిల్లినది.

**తాత్పర్యము :–** ధర్మముచేత కూడ శివుడు పార్వతీదేవినిగూర్చి అడుగు వేసినవాడగుచుండగా తొల్లిటి తప్పిదముచేత భయపడిన మన్మథునియొక్క మనస్సు ఊఱడిల్లినది.

**విభక్తులు / క్రియలు :–** 1. ధర్మేణ – **ధర్మేణ**, ధర్మాభ్యామ్, ధర్మైః; అకారాన్త పుంలింగ ధర్మశబ్దము. తృ.ఏ. ధర్మశబ్దము వేదములలో మాత్రమే నపుంసకలింగము. లోకములో పుంలింగమే. (చూ. గురుబాల పేజి. 105) 2. శర్వే – **శర్వే,** శర్వయోః, శర్వేషు; అకారాన్త పుంలింగ శర్వశబ్దము. స.ఏ. 3. పార్వతీమ్ – **పార్వతీమ్,** పార్వత్యౌ, పార్వత్యః; ఈకారాన్త స్త్రీలింగ పార్వతీశబ్దము. ద్వి.ఏ. 4. పదమ్ – **పదమ్**, పదే, పదాని; అకారాన్త నపుంసకలింగ పదశబ్దము. ప్ర.ఏ. 5. కారితే – **కారితే,** కారితయోః, కారితేషు; అకారాన్త పుంలింగ కారితశబ్దము. స.ఏ. 6. పూర్వాపరాధభీతస్య – **...భీతస్య,** ...భీతయోః, ...భీతానామ్ ; అకారాన్త పుంలింగ...భీతశబ్దము. ష.ఏ. 7. కామస్య – **కామస్య,** కామయోః, కామానామ్; అకారాన్త పుంలింగ కామశబ్దము. ష.ఏ. 8. మనః – మనః, మనసీ, మనాంసి; సకారాన్త నపుంసకలింగ మనశ్శబ్దము. ప్ర.ఏ. 9. ఉచ్ఛ్వసితమ్ – **ఉచ్ఛ్వసితమ్,** ఉచ్ఛ్వసితే, ఉచ్ఛ్వసితాని; అకారాన్త నపుంసకలింగ ఉచ్ఛ్వసితశబ్దము .ప్ర.ఏ. 10. అపి, ప్రతి – అవ్యయాలు.

**సమాసాలు :–**

1. పార్వతీమ్ – పర్వతస్య అపత్యం స్త్రీ పార్వతీ, తామ్। (త.వృ.)
2. పూర్వాపరాధభీతస్య – పూర్వః చాసౌ అపరాధః (కర్మధా.) పూర్వాపరాధః పూర్వాపరాధేన భీతః (తృ.త.) పూర్వాపరాధభీతః, తస్య।

**సంధులు :–**

1. ధర్మేణ + అపి – ధర్మేణాపి – సవర్ణదీర్ఘసన్ధిః।
2. కామస్య + ఉచ్ఛ్వసితమ్ – కామస్యోచ్ఛ్వసితమ్ – గుణసన్ధిః।





**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. ధర్మేణాపి :–**

శ్లో॥ బ్రహ్మచారీ **గృహస్థశ్చ** వానప్రస్థో యతిస్తథా।
ఏతే గృహస్థ ప్రభవాశ్చత్వారః పృథగాశ్రమాః ॥ మనుస్మృతి – 6–87

మానవధర్మశాస్త్రమగు **'మనుస్మృతి'**ని ఇట అనుసంధానము చేసికొందురుగాక. ధర్మపత్నితో కూడియే ధర్మకార్యములు చేయవలెనని ధర్మశాస్త్రములు.

'సస్త్రీకో ధర్మమాచరేత్' ఇత్యాది వచనములచే తెలుపుచున్నవి.

శ్లో॥ భార్యామూలం త్రివర్గస్య – భార్యా మూలం తరిష్యతః' అని మహాభారతమున్ను భార్య ధర్మార్థకామమోక్షములను చతుర్విధపురుషార్థములను సాధించుటకు మూలసాధనమని చెప్పుచున్నది.

శ్లో॥ ధృతిః క్షమా దమో – స్తేయం శౌచమింద్రియనిగ్రహః।
ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్॥ – మనుస్మృతి – 6–92.

1. ధృతి 2. క్షమ 3. దమము 4. అస్తేయము 5. శౌచము 6. ఇంద్రియనిగ్రహము 7. ధీ (శాస్త్రాదితత్త్వజ్ఞానము) 8. విద్య (ఆత్మజ్ఞానము) 9. సత్యము 10. అక్రోధము – ఇవి ధర్మలక్షణములు.

బ్రహ్మచర్యముతో వేదాధ్యయనము చేసి వివాహము చేసికొని ప్రారంభించేది దాంపత్యజీవితము. గృహస్థుగా జీవించడమే **గృహస్థాశ్రమాన్ని** పాటించడం. 'గృహస్థాశ్రమము' పరమపవిత్రమైనది. పై ధర్మలక్షణములు ఆచరణ సాధ్యం చేసికొని జీవించడమే గృహస్థాశ్రమజీవితము. గృహస్థధర్మాలలో ఒకటి 'పంచయజ్ఞాలు' చేయడం.

శ్లో॥ ఋషియజ్ఞం దేవయజ్ఞం భూతయజ్ఞం చ సర్వదా।
నృయజ్ఞం పితృయజ్ఞం చ యథాశక్తి న హాపయేత్॥ 4–11

శ్లో॥ "పిత్రోరర్చాథ పత్యుశ్చ సామ్యం సర్వజనేషు చ।
**మిత్రద్రోహో** విష్ణుభక్తిరేతే పంచమహామఖాః॥"

1. మాతాపితృభక్తి 2. పాతివ్రత్యము 3. సమత 4. మిత్రులను ద్వేషింపకుండుట 5. విష్ణుభక్తి.

ఇటువంటి 'ధర్మాచరణ'మే శివతత్త్వము. ఆ పరమశివుడు పరమపవిత్రమగు 'గృహస్థాశ్రమము'న అడుగిడుచున్నాడని 'ధర్మేణాపి' శబ్దప్రయోగప్రయోజనమును

మన మాచరించుటకు సూచించినట్లైనది.

గృహస్థధర్మశ్చోక్తో మనునా–

**'అనా(శమీ న తిష్ఠేత్తు క్షణమేకమపి ద్విజః'।** ఇతి।

---

**అవతారికా :–** మునిభిరుపస్థాయ శివస్తవనమ్।
సప్తర్షులు సమీపించి శివుని స్తుతించుటు।

**శ్లో॥ అథ తే మునయః సర్వే – మానయిత్వా జగద్గురుమ్।**
**ఇదమూచురనూచానాః – ప్రీతికణ్టకితత్వచః॥ 15**

**పదవిభాగము :–** అథ, తే, మునయః, సర్వే, మానయిత్వా, జగద్గురుమ్, ఇదమ్, ఊచుః, అనూచానాః, ప్రీతికణ్టకితత్వచః।

**అన్వయక్రమము :–** అథ అనూచానాః ప్రీతికణ్టకితత్వచః తే సర్వే మునయః జగద్గురుం మానయిత్వా ఇదమ్ ఊచుః।

**ప్రతిపదార్థము :–** అథ – పిమ్మట, అనూచానాః – సాంగవేదప్రవక్తలు, ప్రీతికణ్టకితత్వచః – సంతోషముతో పులకించినట్టి చర్మము కలవారు అగు, తే – ఆ, సర్వే మునయః – ఋషులందరు, జగద్గురుమ్ – లోకములకు తండ్రియైన శివభగవానుని, మానయిత్వా – పూజించి, ఇదమ్ – ఈ మాటను, ఊచుః – పలికిరి.

**తాత్పర్యము :–** పిమ్మట సాంగవేద ప్రవక్తలు, సంతోషముతో పులకించిన చర్మము కలవారగు ఆ సప్తర్షులు లోకములకు తండ్రియైన శివభగవానుని పూజించి ఈ మాటను పలికిరి.

**పాఠాన్తరాలు :–** 1. అథ తే – ప్రథమే, 2. మానయిత్వా – పూజయిత్వా, ప్రణిపత్య 3. కణ్టకితత్వచః – కణ్టకితం వచః

**విభక్తులు / క్రియలు :–** 1. అథ – అవ్యయము 2. అనూచానాః – అనూచానః, అనూచానౌ, **అనూచానాః**; అకారాన్త పుంలింగ అనూచానశబ్దము. ప్ర.బ. 3. ప్రీతికణ్టకితత్వచః – ...త్వక్, ...త్వచౌ, **...త్వచః**; చకారాన్త పుంలింగ ...త్వక్ఛబ్దము. ప్ర.బ. 4. తే – సః, తౌ, **తే**; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.బ. 5. సర్వే – సర్వః, సర్వౌ, **సర్వే**; అకారాన్త పుంలింగ సర్వనామ సర్వశబ్దము. ప్ర.బ.6. జగద్గురుమ్ – **జగద్గురుమ్,** జగద్గురూ, జగద్గురూన్; ఉకారాన్త పుంలింగ జగద్‌గురుశబ్దము.





ద్వి.ఏ. 7. మునయః – మునిః, మునీ, మునయః; ఇకారాన్త పుంలింగ మునిశబ్దము. ప్ర.బ. 8. మానయిత్వా – అవ్యయము 9. ఇదమ్ – **ఇదమ్**, ఇమే, ఇమాని; మకారాన్త నపుంసకలింగ ఇదమ్ శబ్దము. ద్వి.ఏ. 10. ఊచుః – క్రియ.

**సమాసాలు :–**

1. ప్రీతికణ్టకితత్వచః – కణ్టకం సంజాతం యాసాం తాః కణ్టకితాః, ప్రీత్యాకణ్టకితాః త్వచః యేషాం (బహుప్రీహి) తే, ప్రీతికణ్టకితత్వచః।
2. జగద్గురుమ్ – జగతః గురుః – జగద్గురుః (ష.త.), తమ్।

**సంధులు :–**

1. ఊచుః + అనూచానాః – ఊచురనూచానాః – విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. అనూచానః :–** (త్రి.)

ఎ) అను+వచ్+లిట్+తస్య కానచ్, వేదస్య అనువచనం కృతవాన్।
ఉపేయివానిత్యాదినా సాధుః।

బి) **"అనూచానః** సర్వవేదః శ్రోత్రియశ్ఛాన్దసో మతః"। 395
అని హలాయుధకోశము '4' నామములను పేర్కొన్నది.

సి) "ఋషయశ్చక్రిరే ధర్మం యో - నూచానః స నో మహాన్" – ఇతి మనుః

డి) 'ఉపేయివాననాశ్వాననూచానశ్చ' (3–2–109)

పతే **నిపాత్యన్తే।** ఉపపూర్వాదిణో భాషాయామపి భూతమాత్రే లిడ్వా। తస్య నిత్యం క్వసుః। ఉపేయివాన్। 'ఉపేయుషః స్వామపి మూర్తిమగ్ర్యామ్'। ఉపేయుషీ। ఉపేత్యవివక్షితమ్। ఈయివాన్। సమీయివాన్। నఞ్పూర్వాదశ్నాతేః క్వసురిడభావశ్చ। ధృతజయధృతే రనాశుషః' ఇతి అనుపూర్వాద్వచేః కర్తరి **కానచ్**। వేదస్యానువచనం కృతవాననూచానః। – పాణినిసూత్రవ్యాఖ్యా

**క్రియాదర్శము –** 1. ఊచుః – 'బ్రూఞ్ – వ్యక్తాయాం వాచి' (మాట్లాడుట) ద్వికర్మకమ్, సేట్, వచ్యాదేశే (ఉభయ) అనిట్, పరస్మైపదీ. లిట్ – ప్రథమపురుషబహువచనాంతః।

ఉవాచ – ఊచతుః – **ఊచుః**

---

**శ్లో॥ యద్బ్రహ్మ సమ్యగామ్నాతం – యదగ్నౌ విధినా హుతమ్।**
**యచ్చ తప్తం తపస్తస్య – విపక్వం ఫలమద్య నః॥ 16**

**పదవిభాగము :–** యత్, బ్రహ్మ, సమ్యక్, ఆమ్నాతమ్, యత్, అగ్నౌ, విధినా, హుతమ్, యత్, చ, తప్తమ్, తపః, తస్య, విపక్వమ్, ఫలమ్, అద్య, నః।

**అన్వయక్రమము :–** బ్రహ్మ సమ్యక్ ఆమ్నాతం యత్, అగ్నౌ విధినా హుతం యత్, తపః తప్తం యత్, తస్య ఫలం అద్య నః విపక్వమ్।

**ప్రతిపదార్థము :–** బ్రహ్మ – వేదము, సమ్యక్ – చక్కగా, ఆమ్నాతమ్ – అధ్యయనము చేయబడినది, యత్ – ఏది కలదో; అగ్నౌ – అగ్నియందు, విధినా – శాస్త్రోక్తముగా, హుతమ్ – హోమము చేయబడినది, యత్ – ఏది కలదో; తపః – చాంద్రాయణాది తపస్సు, తప్తమ్ – చేయబడినది, యత్ – ఏది కలదో; తస్య – దానియొక్క, ఫలమ్ – ఫలము, అద్య – ఇప్పుడు, విపక్వమ్ – సిద్ధించినది.

**తాత్పర్యము :–** వేదము చక్కగా అధ్యయనము చేయబడినది ఏది కలదో; అగ్నియందు శాస్త్రోక్తముగా హోమము చేయబడినది ఏది కలదో; చాంద్రాయణాది తపస్సు చేయబడినది ఏది కలదో; దానియొక్క ఫలము ఇప్పుడు మాకు సిద్ధించినది.

**విభక్తులు / క్రియలు :–** 1. బ్రహ్మ – బ్రహ్మ, బ్రహ్మణీ, బ్రహ్మాణి; నకారాన్త నపుంసకలింగ బ్రహ్మన్శబ్దము. ప్ర.ఏ. 2. సమ్యక్ – అవ్యయము 3. ఆమ్నాతమ్ – **ఆమ్నాతమ్,** ఆమ్నాతే, ఆమ్నాతాని; అకారాన్త నపుంసకలింగ ఆమ్నాతశబ్దము. ప్ర.ఏ. 4. యత్ – **యత్**, యే, యాని; దకారాన్త నపుంసకలింగ యచ్ఛబ్దము. ప్ర.ఏ. 5. అగ్నౌ – **అగ్నౌ**, అగ్న్యోః, అగ్నిషు; ఇకారాన్త పుంలింగ అగ్నిశబ్దము. స.ఏ. 6. విధినా – **విధినా**, విధిభ్యామ్, విధిభిః; ఇకారాన్త పుంలింగ విధిశబ్దము. తృ.ఏ. 7. హుతమ్ – **హుతమ్**, హుతే, హుతాని; అకారాన్త నపుంసకలింగ హుతశబ్దము. ప్ర.ఏ. 8. తపః – **తపః**, తపసీ, తపాంసి; సకారాన్త నపుంసకలింగ తపశ్శబ్దము. ప్ర.ఏ. 9. తప్తమ్ – **తప్తమ్**, తప్తే, తప్తాని; అకారాన్త నపుంసకలింగ తప్తశబ్దము. ప్ర.ఏ. 10. తస్య – **తస్య,** తయోః, తేషామ్; దకారాన్త నపుంసకలింగ తచ్ఛబ్దము. ష.ఏ. 11. ఫలమ్ – **ఫలమ్**, ఫలే, ఫలాని; అకారాన్త నపుంసకలింగ ఫలశబ్దము. ప్ర.ఏ. 12. అద్య – అవ్యయము 13. నః – మమ, ఆవయోః, **నః;** దకారాన్త 'అస్మచ్ఛబ్దము' ష.ఏ. 14. విపక్వమ్ – **విపక్వమ్**, విపక్వే, విపక్వాని ;అకారాన్త నపుంసకలింగ విపక్వశబ్దము. ప్ర.ఏ.

**సంధులు :–**

1. యత్ + బ్రహ్మ – యద్బ్రహ్మ – జశ్త్వసన్ధిః।
2. సమ్యక్ + ఆమ్నాతమ్ – సమ్యగామ్నాతమ్ – జశ్త్వసన్ధిః।
3. యత్ + అగ్నౌ – యదగ్నౌ – జశ్త్వసన్ధిః।





4. యత్ + చ – యచ్చ – శ్చుత్వసన్ధిః।
5. తపః + తస్య – తపస్తస్య – విసర్గసన్ధిః, సకారాదేశః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. విపక్వమ్ :–**

ఎ) విశేషేణ పక్వం విపక్వం, కర్మణి క్త ప్రత్యయః।
'పచో వః' ఇతి నిష్ఠాతస్య వత్వమ్ । పక్వః।

బి) విశేషేణ అపాచి ఇతి। వి పచ్ కర్మణి క్త, 'పచో వః' ఇతి వత్వమ్। కృతపాకమ్।

సి) శ్లో॥ తన్వీ శ్యామా శిఖరిదశనా **పక్వబిం**బాధరోష్ఠీ
మద్యే క్షామా చకితహరిణీప్రేక్షణా నిమ్ననాభిః।
శ్రోణీభారాదలసగమనాస్తోకనమ్రా స్తనాభ్యాం
యా తత్ర స్యాత్ యువతివిషయే సృష్టిరాద్యేవ ధాతుః॥
– మేఘదూతే – 19

---

**అవతారికా :–** తదేవ ఫలమాహ – ఆ ఫలమునే చెప్పుచున్నాడు.

**శ్లో॥ యదధ్యక్షేణ జగతాం – వయమారోపితాస్త్వయా।**
**మనోరథస్యావిషయం – మనోవిషయమాత్మనః॥ 17**

**పదవిభాగము :–** యత్, అధ్యక్షేణ, జగతామ్, వయమ్, ఆరోపితాః, త్వయా, మనోరథస్య, అవిషయమ్, మనోవిషయమ్, ఆత్మనః।

**అన్వయక్రమము :–** యత్ జగతామ్ అధ్యక్షేణ త్వయా వయం మనోరథస్య అవిషయమ్ ఆత్మనః మనోవిషయమ్ ఆరోపితాః।

**ప్రతిపదార్థము :–** యత్ – దేనిచేత, జగతామ్ – లోకములకు, అధ్యక్షేణ – ప్రభువైన, త్వయా – నీచేత, వయమ్ – మేము, మనోరథస్య – కోరికకు, అవిషయమ్ – విషయముకానట్టి, ఆత్మనః – నీయొక్క, మనోవిషయమ్ – హృదయస్థానమును, ఆరోపితాః – పొందింపబడితిమో.

**తాత్పర్యము :–** దేనిచేత లోకములకు ప్రభువైన నీచేత మేము కోరికకు విషయము కానట్టి నీయొక్క హృదయస్థానమును పొందింపబడితిమో.

**పాఠాన్తరాలు :–** 1. మనోరథస్యావిషయమ్ – మనోరథస్యాప్యపథమ్.

**విభక్తులు / క్రియలు :–** 1. యత్ – అవ్యయము (హేతుః) 2. జగతామ్ – జగతః, జగతోః, **జగతామ్** ; తకారాన్త నపుంసకలింగ జగత్శబ్దము. ష.ఏ. 3. అధ్యక్షేణ – **అధ్యక్షేణ**, అధ్యక్షాభ్యామ్, అధ్యక్షైః; అకారాన్త పుంలింగ అధ్యక్షశబ్దము. తృ.ఏ. 4. త్వయా – **త్వయా**, యువాభ్యామ్, యుష్మాభిః; దకారాన్త యుష్మచ్ఛబ్దము. తృ.ఏ. 5. వయమ్ – అహమ్, ఆవామ్, **వయమ్**; దకారాన్త అస్మచ్ఛబ్దము. ప్ర.బ. 6. మనోరథస్య – **మనోరథస్య**, మనోరథయోః, మనోరథానామ్; అకారాన్త పుంలింగ మనోరథశబ్దము. ష.ఏ. 7. అవిషయమ్ – **అవిషయమ్**, అవిషయౌ, అవిషయాన్; అకారాన్త పుంలింగ అవిషయశబ్దము. ద్వి.ఏ. 8. ఆత్మనః – **ఆత్మనః**, ఆత్మనోః, ఆత్మనామ్; నకారాన్త పుంలింగ ఆత్మన్శబ్దము. ష.ఏ. 9. మనోవిషయమ్ – **మనోవిషయమ్**, మనోవిషయౌ, మనోవిషయాన్; అకారాన్త పుంలింగ మనోవిషయశబ్దము. ద్వి.ఏ 10. ఆరోపితాః – ఆరోపితః, ఆరోపితౌ, **ఆరోపితాః**; అకారాన్త పుంలింగ ఆరోపితశబ్దము. ప్ర.బ.

**సమాసాలు :–**

1. అధ్యక్షేణ – అధిగతః అక్షమ్ – అధ్యక్షః, (ద్వి.త.) తేన।
2. మనోరథస్య – మన ఏవ రథః అస్య (బహువ్రీహి) మనోరథః, తస్య।
3. అవిషయమ్ – విషయో న భవతీతి – అవిషయః (నఞ్తత్పు.) తమ్।
4. మనోవిషయమ్ – మనసః విషయః (ష.త.) మనోవిషయః, తమ్।

**సంధులు :–**

1. యత్ + అధ్యక్షేణ – యదధ్యక్షేణ – జశ్త్వసన్ధిః।
2. ఆరోపితాః + త్వయా – ఆరోపితాస్త్వయా – విసర్గసన్ధిః (సకారాదేశః)।
3. మనోరథస్య + అవిషయమ్ – మనోరథస్యావిషయమ్ – సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. మనోరథః :–** (పుం.) – ఎ) మనసః రథ ఇవ, మన ఏవ రథో **–** త్రేతి వా।

బి) శ్లో॥ ...వాంఛితో **–** ర్థో మనోరథః ॥ 535

అని హలాయుధకోశము '2' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ **మనోరథానాం** న సమాప్తిరస్తి – వర్షాయుతైరప్యథవాపి లక్షైః।
పూర్ణేషు పూర్ణేషు పునర్నవానామ్, ఉత్పత్తయస్సన్తి మనోరథానామ్॥

డి) కుమారసంభవమహాకావ్యమున – '5-64'ను ఇట అనుసంధానము చేసికొనదగును.

ఇ) శ్లో॥ శ్రోత్రాభిరామధ్వనినా రథేన స ధర్మపత్నీసహితస్సహిష్ణుః।
యయావనుద్ధాతసుఖేన మార్గే స్వేనేవ పూర్ణేన **మనోరథేన**॥

– ర.వం. 2-72

---





**అవతారికా :–** తదేవోపపాదయతి। దానినే చెప్పుచున్నాడు.

**శ్లో॥ యస్య చేతసి వర్తేథాః – స తావత్కృతినాం వరః।**
**కిం పునర్బ్రహ్మయోనేర్య – స్తవ చేతసి వర్తతే॥ 18**

**పదవిభాగము :–** యస్య, చేతసి, వర్తేథాః, సః, తావత్, కృతినామ్, వరః, కిమ్, పునః, బ్రహ్మయోనేః, యః, తవ, చేతసి, వర్తతే॥

**అన్వయక్రమము :–** యస్య చేతసి వర్తేథాః సః తావత్ కృతినాం వరః (అస్తి)। బ్రహ్మయోనేః తవ చేతసి యః వర్తతే సః కిం పునః।

**ప్రతిపదార్థము :–** యస్య – ఎవనియొక్క చేతసి – మనస్సునందు, త్వమ్ – నీవు, వర్తేథాః – ఉందువో, సః తావత్ – అతడే, కృతినామ్ – ధన్యులలో, వరః – శ్రేష్ఠుడు, బ్రహ్మయోనేః – యోగశరీరివైన, తవ – నీయొక్క, చేతసి – మనస్సునందు, యః – ఎవడు, వర్తతే – ఉండునో, సః – వాడు, కిం పునః – ధన్యులలో శ్రేష్ఠుడని చెప్పవలయునా?

**తాత్పర్యము :–** ఎవనియొక్క మనస్సునందు నీవు ఉందువో అతడే ధన్యులలో శ్రేష్ఠుడు. యోగశరీరివైన నీయొక్క మనస్సునందు ఎవడు ఉండునో వాడు ధన్యులలో శ్రేష్ఠుడని చెప్పవలయునా?

**విభక్తులు / క్రియలు :–** 1. యస్య – **యస్య**, యయోః, యేషామ్; దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము. ష.ఏ. 2. చేతసి – **చేతసి**, చేతసోః, చేతస్సు; సకారాన్త నపుంసకలింగ చేతశ్శబ్దము. స.ఏ. 3. వర్తేథాః – క్రియ – లిఙ్ 4. సః – **సః**, తౌ, తే; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ. 5. తావత్ – అవ్యయము 6. కృతినామ్ – కృతినః, కృతినోః, **కృతినామ్**; నకారాన్త పుంలింగ కృతిన్శబ్దము. ష.బ. 7. వరః – **వరః**, వరౌ, వరాః; అకారాన్త పుంలింగ వరశబ్దము. ప్ర.ఏ. 8. బ్రహ్మయోనేః – **బ్రహ్మయోనేః**, బ్రహ్మయోన్యోః, బ్రహ్మయోనీనామ్; ఇకారాన్త పుంలింగ బ్రహ్మయోనిశబ్దము. ష.ఏ. 9. తవ – **తవ**, యువయోః, యుష్మాకమ్; దకారాన్త యుష్మచ్ఛబ్దము. ష.ఏ. 10. యః – **యః**, యౌ, యే; దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము. ప్ర.ఏ. 11. వర్తతే – క్రియ 12. కిమ్, పునః – అవ్యయాలు.

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. కృతినామ్ – కృతమస్తి యేషాం తే కృతినః, తేషామ్ కృతినామ్।
2. బ్రహ్మయోనేః – బ్రహ్మణః యోనిః బ్రహ్మయోనిః (ష.త.), తస్య।

**సంధులు :–**

1. సః + తావత్ – స తావత్, సులోపః।

2. పునః + బ్రహ్మయోనేః – పునర్బ్రహ్మయోనేః – విసర్గసన్ధిః (రుత్వమ్)।
3. బ్రహ్మయోనేః + యః – బ్రహ్మయోనేర్యః – విసర్గసన్ధిః (రుత్వమ్)।
4. యః + తవ – యస్తవ – విసర్గసన్ధిః (సకారాదేశః)।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

1. ఎ) బ్రహ్మయోనిః – ఇకారాన్త **పుంలింగము**, యోగిశరీరము, అధ్యాత్మశాస్త్రము అని **'సర్వశబ్ద'**.

బి) బ్రహ్మయోనిః **(స్త్రీ.)** – 1. □□□□□□□□□ □□□□□□ □□ □□□□□□□□, 2. □□□ □□□□□□ □□ □□□ □□□□□ □□ □□□□□□□□; అని ఆప్టే మహాశయుడు ఈ శ్లోకాన్నే ఉదాహరణగా చూపినాడు.

సి) బ్రహ్మయోని (విశేషణము) – ః □□□□□□ □□□□ □□□□□□□

శ్లో॥ త్వయైవం చిన్త్యమానస్య గురుణా **బ్రహ్మయోనినా**।
సానుబన్ధాః కథం న స్యుః సమ్పదో మే నిరాపదః॥ – ర.వం. 1–64

**క్రియాదర్శము :–** 1. **వర్తేథాః** :– 'వృతు – వర్తనే' (ఉండుట) అకర్మకమ్, భ్వాదిప్రకరణమ్ (1), సేట్, ఆత్మనేపదీ, విధిలిఙ్ – మధ్యమపురుషైకవచనాంతః।

రూపాలు :– **వర్తేథాః** – వర్తేయాథామ్ – వర్తేధ్వమ్

**2. వర్తతే :–** ('వృతు – వర్తనే) – లట్ – ప్రథమపురుషైకవచనాంతః।
**వర్తతే** – వర్తేతే – వర్తన్తే

శ్లో॥ **వర్తతే** తు వసత్యాస్తే ధ్రియతే చావతిష్ఠతే।
క్షియతి స్థలతి స్థిత్యాం మరత్యపి చ తిష్ఠతి॥ 1–1–5

అని 'ఆఖ్యాతచన్ద్రికా' '9' తుల్యమైన క్రియారూపములను పేర్కొన్నది.

---

**శ్లో॥ సత్యమర్కాచ్చ సోమాచ్చ – పరమధ్యాస్మహే పదమ్।**
**అద్య తూచ్చైస్తరం తాభ్యాం – స్మరణానుగ్రహాత్తవ॥ 19**

**పదవిభాగము :–** సత్యమ్, అర్కాత్, చ, సోమాత్, చ, పరమ్, అధ్యాస్మహే, పదమ్, అద్య, తు, ఉచ్చైస్తరమ్, తాభ్యామ్, స్మరణానుగ్రహాత్, తవ।



**అన్వయక్రమము :–** అర్కాత్ సోమాత్ చ పరం పదమ్ అధ్యాస్మహే సత్యమ్। అద్య తు తవ స్మరణానుగ్రహాత్ తాభ్యామ్ ఉచ్చైస్తరం పదమ్ అధ్యాస్మహే।

**ప్రతిపదార్థము :–** అర్కాత్ చ – సూర్యునికంటెను, సోమాత్ చ – చంద్రునికంటెను, పరం పదమ్ – ఉన్నతమైన స్థానమును, అధ్యాస్మహే – నెలకొనియున్నాము, సత్యమ్ – నిజము, అద్య తు – ఇప్పుడన్ననో, తవ – నీయొక్క, స్మరణానుగ్రహాత్ – స్మరణానుగ్రహమువలన, తాభ్యామ్ – ఆ సూర్యచంద్రులకంటె, ఉచ్చైస్తరమ్– మునుపటికంటెను పైదయిన, పదమ్ – స్థానమును, అధ్యాస్మహే – నెలకొనియున్నాము.

**తాత్పర్యము :–** సూర్యచంద్రులకంటెను ఉన్నతమైన స్థానమున నెలకొనియున్నాము. నిజము. ఇప్పుడన్ననో నీయొక్క స్మరణానుగ్రహమున ఆ సూర్యచంద్రులకంటె, మునుపటికంటెను పైదయిన స్థానమున నెలకొనియున్నాము.

**పాఠాన్తరాలు :–** 1. సత్యం – నిత్యం 2. ఉచ్చైస్తరమ్ – ఉచ్చైస్తరాం 3. తాభ్యాం – తస్మాత్

**విభక్తులు / క్రియలు :–** 1. అర్కాత్ – **అర్కాత్**, అర్కాభ్యామ్, అర్కేభ్యః; అకారాన్త పుంలింగ అర్కశబ్దము. పం.ఏ. 2. సోమాత్ – **సోమాత్**, సోమాభ్యామ్, సోమేభ్యః; అకారాన్త పుంలింగ సోమశబ్దము. పం.ఏ 3. పరమ్ – అవ్యయము 4. పదమ్ – **పదమ్**, పదే, పదాని; అకారాన్త నపుంసకలింగ పదశబ్దము. ద్వి.ఏ. 5. అధ్యాస్మహే – క్రియ 6. సత్యమ్ – అవ్యయము 7. అద్య, తు – అవ్యయాలు 8. తవ – తవ, యువయోః, యుష్మాకమ్; దకారాన్త 'యుష్మ'చ్ఛబ్దము. ష.ఏ. 9. స్మరణానుగ్రహాత్ – **...అనుగ్రహాత్**, ....అనుగ్రహాభ్యామ్, ...అనుగ్రహేభ్యః; అకారాన్త పుంలింగ స్మరణానుగ్రహశబ్దము. పం.ఏ. 10. తాభ్యామ్ – తస్మాత్, **తాభ్యామ్**, తేభ్యః ; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. పం.ద్వి. 11. ఉచ్చైస్తరమ్ – **ఉచ్చైస్తరమ్**, ఉచ్చైస్తరే, ఉచ్చైస్తరాణి; అకారాన్త నపుంసకలింగ ఉచ్చైస్తరశబ్దము. ద్వి.ఏ.

**సమాసాలు :–**

1. స్మరణానుగ్రహాత్ – స్మరణమ్ ఏవ అనుగ్రహః – స్మరణానుగ్రహః (కర్మధా.) తస్మాత్।
2. ఉచ్చైస్తరమ్ – అతిశయేన ఉచ్చైః, ఉచ్చైస్తరమ్, తత్। ఉచ్చైస్తరమితి ద్రవ్యప్రకర్షత్వాన్నాముప్రత్యయః।

**సంధులు :-**

1. అర్కాత్ + చ – అర్కాచ్చ – శ్చుత్వసన్ధిః।
2. సోమాత్ + చ – సోమాచ్చ – శ్చుత్వసన్ధిః।
3. తు + ఉచ్చైస్తరమ్ – తూచ్చైస్తరమ్ – సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :-**

**1. పదమ్ :-**

ఎ) పదమ్ – 'అధ్యాస్మహే' ఇతి యోగాత్, 'అధిశీఙ్స్థాసాం కర్మ' ఇతి కర్మత్వమ్, తతః 'కర్మణి ద్వితీయా' ఇతి ద్వితీయా।

బి) భయలింగభగ**పదాని** నపుంసకే।
ఏతాని నపుంసకే స్యుః। భయమ్। లిఙ్గమ్, భగమ్, **పదమ్**

సి) శ్లో॥ తద్రక్ష కల్యాణపరంపరాణాం భోక్తారమూర్జస్వలమాత్మదేహమ్।
మహీతలస్పర్శనమాత్రభిన్నం ఋద్ధం హి రాజ్యం **పద**మైంద్రమాహుః॥
– ర.వం. 2-50

"...పెద్దలు – సకలవస్తువులచే సంపూర్ణమైన రాజ్యమును భూసంబంధముగల ఇంద్రపదమునుగా చెప్పుదురు.

డి) శ్లో॥ నిజౌజసోజ్జాయితుం జగద్రుహా–
ముపాజహీథా న మహీతలం యది।
సమాహితైరప్యనిరూపితస్తతః
**పదం** దృశస్స్యాః కథమీశ! మాదృశామ్॥ – మాఘే 1-37

"...ఓ ప్రభూ! కృష్ణ! మా వంటి వారలయొక్క చూపునకు లక్ష్యమైనవాడవు ఎట్లు అగుదువు?

ఇ) శ్లో॥ సహసా విదధీత న క్రియా–
మవివేకః **పరమా**పదాం **పదమ్**।
వృణతే హి విమృశ్యకారిణం
గుణలుబ్ధాస్స్వయమేవ సమ్పదః ॥ – కిరాతార్జునీయే – 2-30

"...యుక్తాయుక్త విచక్షణలేకుండుట ఆపదలకు గొప్పస్థానమగుచున్నది."

ఎఫ్) పదమ్ – (పద్ – అచ్)

1) "పదం వ్యవసితిత్రాణస్థానలక్ష్మాంఘ్రివస్తుషు' – అమరకోశః 3-93



పదతి। 'పద స్థైర్యే'। పద్యతి వా। 'పద గతౌ" దివాది / ఆత్మనేపదీ / అనిట్। 'పచాద్యచ్' (3-1-134) భావకర్మకరణేషు వా ఘఞ్।

2. 'పదం శబ్దే చ వాక్యే చ వ్యవసాయాపదేశయోః। పాదతచ్చిహ్నయోః స్థానత్రాణయోరఙ్కవస్తునో" ఇతి విశ్వః।

**క్రియాదర్శము :– అధ్యాస్మహే** – 'ఆస – ఉపవేశనే', అధి – ఉపసర్గపూర్వకాత్, అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, లట్ – ఉత్తమపురుషబహువచనాంతః।
అధి + ఆసే – అధ్యాసే, అధి + ఆస్వహే – అధ్యాస్వహే, అధి + ఆస్మహే – **అధ్యాస్మహే.**

---

**శ్లో॥ త్వత్సమ్భావితమాత్మానం – బహు మన్యామహే వయమ్।**
**ప్రాయఃప్రత్యయమాధత్తే – స్వగుణేషూత్తమాదరః ॥ 20**

**పదవిభాగము :–** త్వత్‌సంభావితమ్, ఆత్మానమ్, బహు, మన్యామహే, వయమ్, ప్రాయః, ప్రత్యయమ్, ఆధత్తే, స్వగుణేషు, ఉత్తమాదరః।

**అన్వయక్రమము :–** వయం త్వత్సంభావితమ్ ఆత్మానం బహు మన్యామహే। ఉత్తమాదరః స్వగుణేషు ప్రాయః ప్రత్యయమ్ ఆధత్తే।

**ప్రతిపదార్థము :–** వయమ్ –మేము, త్వత్సంభావితమ్ – నీచేత గౌరవింపబడినట్టి, ఆత్మానమ్ – మమ్ము, బహు – అధికముగా, మన్యామహే – తలచుకొనుచున్నాము. ఉత్తమాదరః – గొప్పవారియొక్క ఆదరము, స్వగుణేషు – తమ గుణములయందు, ప్రాయః – తఱుచుగా, ప్రత్యయమ్ – నమ్మికను, ఆధత్తే – కలిగించును.

**తాత్పర్యము :–** మేము నీచేత గౌరవింపబడినట్టి మమ్ము అధికముగా తలచుకొను చున్నాము. గొప్పవారియొక్క ఆదరము తమ గుణములయందు తఱుచుగా నమ్మికను కలిగించును.

**విభక్తులు / క్రియలు :–** 1. వయమ్ – అహమ్, ఆవామ్, **వయమ్**; దకారాన్త 'అస్మ'చ్ఛబ్దము. ప్ర.బ. 2. త్వత్సంభావితమ్ – **...సంభావితమ్**, ...సంభావితౌ, ...సంభావితాన్; అకారాన్త పుంలింగ ...సంభావితశబ్దము. ద్వి.ఏ. 3. ఆత్మానమ్ – **ఆత్మానమ్**, ఆత్మా, ఆత్మనః; నకారాన్త పుంలింగ ఆత్మన్‌శబ్దము. ద్వి.ఏ. 4. బహు – **బహు,** బహునీ, బహూని; ఉకారాన్త నపుంసకలింగ బహుశబ్దము. ప్ర.ఏ. 5. మన్యామహే – క్రియ 6. ఉత్తమాదరః – **ఉత్తమాదరః**, ఉత్తమాదరౌ, ఉత్తమాదరాః; అకారాన్త పుంలింగ ఉత్తమాదరశబ్దము. ప్ర.ఏ. 7. స్వగుణేషు – స్వగుణే, స్వగుణయోః, **స్వగుణేషు;**

అకారాన్త పుంలింగ స్వగుణశబ్దము. స.బ. 8. ప్రాయః – అవ్యయము 9. ప్రత్యయమ్ – **ప్రత్యయమ్,** ప్రత్యయౌ, ప్రత్యయాన్; అకారాన్త పుంలింగ ప్రత్యయశబ్దము. ద్వి.ఏ. 10. ఆధత్తే – క్రియ.

**సమాసాలు :–**

1. త్వత్సంభావితమ్ – త్వయా సంభావితః (తృ.త.) త్వత్సంభావితః తమ్।
2. ఉత్తమాదరః – ఉత్తమాద్ ఆదరః (పం.త.)।
3. స్వగుణేషు – స్వస్య గుణాః స్వగుణాః (ష.త.), తేషు స్వగుణేషు।

**సంధులు :–**

1. స్వగుణేషు + ఉత్తమాదరః – స్వగుణేషూత్తమాదరః – సవర్ణదీర్ఘసంధిః।
2. ఉత్తమ + ఆదరః – ఉత్తమాదరః – సవర్ణదీర్ఘసంధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:**

1. **ప్రాయః–** ఎ) (అవ్యయము) – ప్ర + అయ్ గతౌ+ అసున్। బాహుల్యమ్।

బి) శ్లో॥ తతో –హం శర్మవర్మా చ జ్ఞాతవన్తౌ క్రమేణ తామ్।
అత్రాన్తరే స చ **ప్రాయః** పర్యహీయత వాసరః॥
–ఇతి కథాసరిత్సాగరే 6–123

సి) శ్లో॥ ఆవిర్భూతానురాగాః క్షణముదయగిరేరుజ్జిహానస్య భానోః
పర్ణచ్ఛాయైః పురస్తాదుపవనతరవో దూరమాశ్వేవ గత్వా।
ఏతే తస్మిన్నివృత్తాః పునరపరగిరి ప్రాన్తపర్యస్తబిమ్బే
**ప్రాయో** భృత్యాస్త్యజన్తి ప్రచలితవిభవం స్వామినం సేవమానాః॥
–ఇతి ముద్రారాక్షసే 4–22

డి) శ్లో॥ **ప్రాయో** ధనవతామేవ ధనతృష్ణా గరీయసీ।
పశ్య కోటిద్వయాసక్తం లక్షాయ ప్రవణం ధనుః॥
– భోజచరితమ్

**సాధారణముగ** ధనమున్నవారికే ధనాశ ఉంటుంది. రెండు కోట్లుగల దానికి లక్షయందు ఆశగలుగుట చూడుదు. ధనుస్సునకు రెండుకోట్లు అనగా (2) అగ్రములు ఉండును. అది లక్ష్యమునకై చూస్తూ ఉండుట లోకప్రసిద్ధముగదా!

**అలంకారములు:–** 'అత్ర అర్థాన్తరన్యాసాలంకారః' ఈ శ్లోకమున ఉత్తరార్ధముచే పూర్వార్ధము సమర్థింపబడిన 'అర్థాన్తరన్యాసాలంకారము' గలదు.



**క్రియాదర్శము:–** 1. **మన్యామహే –** (మను–అవబోధనే (తెలియుట), సకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, **తనాది ప్రకరణమ్** (8), లట్ – ఉత్తమపురుషబహువచనాంతః రూపాలు – మన్వే – మన్వహే / మనువహే – మన్మహే / మనుమహే)

**1.'మన – జ్ఞానే'** సకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ, **దివాదయః** (4) లట్ – ఉత్తమపురుషబహువచనాంతః।
మన్యే – మన్యావహే – మన్యామహే
సారూప్యముండుటచే పై రెండు ధాతువుల క్రియారూపములు ఇవ్వబడినవి.

**2. ఆధత్తే** – ఆఙ్ – ఉపసర్గ, 'డుధాఞ్ – ధారణపోషణయోః' (ధరించుట, పోషించుట) సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ, లట్ – ప్రథమపురుషైకవచనాంతః। **ఆధత్తే** – ఆదధాతే – అదధతే.

---

**శ్లో॥ యా నః ప్రీతిర్విరూపాక్ష – త్వదనుధ్యానసమ్భవా।**
**సా కిమావేద్యతే తుభ్య – మన్తరాత్మాసి దేహినామ్॥ 21**

**పదవిభాగము:–** యా, నః, ప్రీతిః, విరూపాక్ష!, త్వదనుధ్యానసమ్భవా, సా, కిమ్, ఆవేద్యతే, తుభ్యమ్, అన్తరాత్మా, అసి, దేహినామ్।

**అన్వయక్రమము:–** హే విరూపాక్ష! నః త్వదనుధ్యానసమ్భవా యా ప్రీతిః, సా తుభ్యం కిమ్ ఆవేద్యతే। త్వం దేహినామ్ అన్తరాత్మా అసి।

**ప్రతిపదార్థము:–** హే విరూపాక్ష! – ఓ త్రినేత్రుడా! ఓ ముక్కంటీ!, నః – మాయొక్క త్వదనుధ్యానసమ్భవా – నీ స్మరణవలన పుట్టుక కలదైన, యా – ఏ, ప్రీతిః – సంతోషము కలదో, సా – ఆ సంతోషము, తుభ్యమ్ – నీకొఱకు, కిమ్ – ఏల, ఆవేద్యతే – విన్నవింపబడును, త్వమ్ – నీవు, దేహినామ్ – జీవులకు, అన్తరాత్మా – లోపలియాత్మవుగ, అసి – ఉన్నావు.

**తాత్పర్యము:–** ఓ ముక్కంటీ! నీ స్మరణవలన పుట్టుక కలదైన మాయొక్క సంతోషము కలదో, ఆ సంతోషము నీకొఱకు ఏల విన్నవింపబడును? నీవు ఏ జీవులకు లోపలియాత్మవుగ ఉన్నావు.

**పాఠాన్తరాలు:–** 1. విరూపాక్ష – విశాలాక్ష 2. త్వదనుధ్యాన – తవనిధ్యాన 3. ఆవేద్యతే – ఆఖ్యాయతే.

**విభక్తులు / క్రియలు:-** 1. హే విరూపాక్ష! - **హే విరూపాక్షౌ!,** హేవిరూపాక్షౌ!, హే విరూపాక్షాః ! అకారాన్త పుంలింగ విరూపాక్షశబ్దము. సం.ప్ర.ఏ. 2. నః - మే, నౌ, నః దకారాన్త 'అస్మ'చ్ఛబ్దము. ష.ఏ. 3.త్వదనుధ్యానసంభవా - **...సంభవా,** ...సంభవే, ...సంభవాః ఆకారాన్త స్త్రీలింగ ...సంభవాశబ్దము. ప్ర.ఏ. 4. **యా** - యా, యే, యాః దకారాన్త స్త్రీలింగ యచ్ఛబ్దము. ప్ర.ఏ. 5. ప్రీతిః - **ప్రీతిః,** ప్రీతీ, ప్రీతయః ఇకారాన్త స్త్రీలింగ ప్రీతిశబ్దము. ప్ర.ఏ. 6. **సా - సా,** తే, తాః దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ. 7. తుభ్యమ్ - **తుభ్యమ్,** యువాభ్యామ్, యుష్మభ్యమ్ దకారాన్త యుష్మచ్ఛబ్దము. చ.ఏ. 8. కిమ్ - అవ్యయము 9. ఆవేద్యతే - క్రియ 10. త్వమ్ - **త్వమ్,** యువామ్, యూయమ్ దకారాన్త యుష్మచ్ఛబ్దము. ప్ర.ఏ. 11. దేహినామ్ - దేహినః, దేహినోః, దేహినామ్ నకారాన్త పుంలింగ దేహిన్‌శబ్దము. ష.బ. 12. అన్తరాత్మా - అన్తరాత్మా, అన్తరాత్మానౌ, అన్తరాత్మానః నకారాన్త పుంలింగ అన్తరాత్మన్‌శబ్దము. ప్ర.ఏ. 13. అసి - క్రియ.

**సమాసాలు:-**

1. విరూపాక్ష - విగతం రూపం యాభ్యాం తే విరూపే, తే అక్షిణీ యస్య (బహుప్రీహి) సః, విరూపాక్షః, తస్య సంబుద్ధిః।
2. త్వదనుధ్యానసంభవా - తవ అనుధ్యానమ్ (ష.త.) త్వదనుధ్యానమ్, తస్మాత్ సంభవతీతి।
3. అన్తరాత్మా - అంతస్థి ్వత ఆత్మా (కర్మధా.) అన్తరాత్మా।
4. దేహినామ్ - దేహః ఏషామ్ అస్తీతి, దేహినః, (తద్ధితవృత్తిః) తేషామ్, దేహినామ్।

**సంధులు:-**

1. ప్రీతిః + విరూపాక్ష! - ప్రీతిర్విరూపాక్ష! - విసర్గసన్ధిః (రుత్వమ్)।
2. అన్తరాత్మా + అసి - అన్తరాత్మాసి - సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1. విరూపాక్షః -**

ఎ) 1. విరూపే అక్షిణీ యస్య। బహుప్రీహౌ 'సక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్ షచ్' ఇతి షచ్। (సూ. 5-4-116)

2. వివిధాని రవిచన్ద్రాగ్నిరూపాణ్యక్షీణస్య।

3. వివిధరూపాణి వివిధరూపేషు వా అక్షాణీన్ద్రియాణ్యస్యేతి వా।

బి) శ్లో॥ ఈశానః శశిశేఖరః పశుపతిః శూలీ శివః శంకరః,
.......దక్షధ్వంసకృత్॥ 11

శ్లో॥ స్థాణుః.... వృషాంకః॥ 12



శ్లో॥ అహిర్బుధ్నో **విరూపాక్షః** శిపివిష్టో గణాధిపః।
గంగాధరో మహాదేవో మృడః స్యాన్నీలలోహితః॥ 13

- అని హలాయుధకోశము '45' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ దృశా దగ్ధం మనసిజం జీవయన్తి దృశైవ యాః।
**విరూపాక్షస్య** జయినీస్తాః స్తువేవామలోచనాః॥
-ఇతి సాహిత్యదర్పణే (10)

2. **అన్తరాత్మా** - అన్తరాత్మ సాక్షిమాత్రం కో - ప్యాత్మా। అత్ర మనుః -

శ్లో॥ యో - స్యాత్మనః కారయితా తం క్షేత్రజ్ఞం ప్రచక్షతే।
యః కరోతి తు కర్మాణి స భూతాత్మోచ్యతే బుధైః॥

శ్లో॥ జీవసంజ్ఞో - **న్తరాత్మా** చ సహజః సర్వ**దేహినామ్।**
యన్న వేదయతే సర్వం సుఖం దుఃఖం చ జన్మసు॥ (12-12, 13)

ఇతి। నహి సకలశరీరిణామఖిలకర్మసాక్షిభూతేన భవతా అస్మాకం హృదయగతం న విజ్ఞాతమితి సమ్భవతి। విజ్ఞాతస్యార్థస్య తు పునర్వచనమనర్థకమేవేతి భావః॥ - అని 'వివరణమ్' వ్యాఖ్య.

**క్రియాదర్శము:-**

1. ఆవేద్యతే - ఆఙ్ ఉపసర్గ, 'విద - సత్తాయామ్' కర్మణి, లట్ - ప్రథమపురుషైకవచనాంతః।

**ఆవేద్యతే** - ఆవేద్యేతే - ఆవేద్యన్తే.

---

**శ్లో॥ సాక్షాద్దృష్టో - సి న పున - ర్విద్మస్త్వా వయమఞ్జసా।**
**ప్రసీద కథయాత్మానం - న ధియాం పథి వర్తసే॥ 22**

**పదవిభాగము:-** సాక్షాత్, దృష్టః, అసి, న, పునః, విద్మః, త్వా, వయమ్, అఞ్జసా, ప్రసీద, కథయ, ఆత్మానమ్, న, ధియామ్, పథి, వర్తసే।

**అన్వయక్రమము:-** (హే దేవ!) సాక్షాత్ దృష్టః అసి, అఞ్జసా పునః త్వా వయం న విద్మః, (అతః) ప్రసీద, ఆత్మానం కథయ, ధియాం పథి న వర్తసే।

ప్రతిపదార్థము - హే దేవ! - ఓ స్వామీ!, సాక్షాత్ - ప్రత్యక్షముగా, దృష్టః - చూడబడినవాడవు, అసి - అగుచున్నావు, అఞ్జసా పునః - నిజముగా, త్వా -

నిన్ను, వయమ్ – మేము, న విద్మః – ఎఱుగము, (అతః) – (ఇందువలన), ప్రసీద – అనుగ్రహింపుము, ఆత్మానమ్ – నిజరూపమును, కథయ – చెప్పుము, ధియామ్ – బుద్ధులయొక్క, పథి – మార్గమందు, న వర్తసే – లేవు.

**తాత్పర్యము:–** ఓ స్వామీ! ప్రత్యక్షముగా చూడబడినవాడవు అగుచున్నావు. నిజముగా నిన్ను మేము ఎఱుగము. అనుగ్రహింపుము. నిజరూపమును చెప్పుము. బుద్ధులయొక్క మార్గమందు లేవు.

**పాఠాన్తరాలు :–** న పునర్మిద్మః – నో విద్మః పునః

**విభక్తులు / క్రియలు:–**1. సాక్షాత్ – అవ్యయము 2. దృష్టః – **దృష్టః**, దృష్టౌ, దృష్టాః అకారాన్త పుంలింగ దృష్టశబ్దము. ప్ర.ఏ. 3. అసి – క్రియ 4. అఞ్జసా – అవ్యయము 5. పునః, న – అవ్యయాలు 6. త్వామ్ – **త్వామ్,** యువామ్, యుష్మాన్ దకారాన్త యుష్మచ్ఛబ్దము. ద్వి.ఏ. 7. వయమ్ – అహమ్, ఆవామ్, **వయమ్,** దకారాన్త పుంలింగ అస్మచ్ఛబ్దము. ప్ర.బ. 8. విద్మః – క్రియ 9. ప్రసీద – క్రియ 10. ఆత్మానమ్ – **ఆత్మానమ్,** ఆత్మానౌ, ఆత్మనః నకారాన్త పుంలింగ ఆత్మన్‌శబ్దము ద్వి.ఏ. 11. కథయ – క్రియ 12. ధియామ్ – ధియః, ధియోః, **ధియామ్** ఈకారాన్త స్త్రీలింగ ధీశబ్దము. ష.బ. 13. పథి – **పథి**, పథోః, పథిషు నకారాన్త పుంలింగ పథిన్‌శబ్దము. స.ఏ. 14. వర్తసే – క్రియ.

**సంధులు –**

1. సాక్షాత్ + దృష్టః – సాక్షాద్దృష్టః – జశ్త్వసన్ధిః।
2. దృష్టః + అసి – దృష్టో – సి – పూర్వరూపసన్ధిః।
3. పునః + విద్మః – పునర్విద్మః – విసర్గసన్ధిః (రుత్వమ్)।
4. విద్మః + త్వామ్ – విద్మస్త్వామ్ – విసర్గసన్ధిః (సకారాదేశః)।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. ధీః – (స్త్రీ.) –**

ఎ) ధ్యైచిన్తాయామ్ భావే క్విప్ సమ్ప్రసారణం చ।

బి) శ్లో।। ప్రేక్షా ప్రజ్ఞా ప్రతిభా ధీర్ధిషణా శేముషీ మనీషా చ।
బుద్ధిర్మతిశ్చ మేధా సంఖ్యా సంవిత్తిరుపలబ్ధిః।। 334
అని హలాయుధకోశము 13 నామములను పేర్కొన్నది.

సి) శ్లో।। ధృతిః క్షమా దమో – స్తేయం శౌచమిన్ద్రియనిగ్రహః।
ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్।। ఇతి మనుః 6–92





**క్రియాదర్శము:–** 1. అసి – అస (అస్) భువి, (ఉండుట), అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, అదాదిప్రకరణమ్(2), లట్ – మధ్యమపురుషైకవచనాంతః।
అసి – స్థః – స్థ

2. **విద్మః / విద్మ** – విద (విద్) జ్ఞానే (తెలియుట) సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, అదాదిప్రకరణమ్ (2), లట్ – ఉత్తమపురుషబహువచనాంతః।
1. వేద – విద్వ – **విద్మ**
2. వేద్మి – విద్వః – **విద్మః**

* 'విదో లటో వా' వేత్తేర్లటః పరస్మైపదానాం ణలాదయో వాస్యుః। ఇతి ణలో – భావపక్షే।

3. **ప్రసీద** – ప్ర – ఉపసర్గ, షద్ 'విశరణగత్యవసాదనేషు' 1. అకర్మకమ్, 2,3 సకర్మకమ్. అనిట్, పరస్మైపదీ, తుదాది (6), లోట్ – మధ్యమపురుషైకవచనాంతః
రూపాలు – **ప్రసీద / ప్రసీదతాత్** – ప్రసీదతమ్ – ప్రసీదత.

4. **కథయ** – 'కథ – వాక్య ప్రబంధే', సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, చురాదిప్రకరణమ్ (10), లోట్ – మధ్యమపురుషైకవచనాంతః।
**కథయ / కథయతాత్** – కథయతమ్ – కథయత.

---

**అవతారికా:–** తాత్త్వికం రూపం తావదాస్తామ్। న దృశ్యమానమపి రూపం తత్త్వతో రూపయితుం శక్యమిత్యాహ – నీ తాత్త్వికరూపమట్లుంచుము. ప్రత్యక్షముగా అగపడుచున్న రూపమును నిరూపించుటకును మాకు శక్తి లేదనుచున్నారు.

**శ్లో।। కిం యేన సృజసి వ్యక్త – ముత యేన బిభర్షి తత్।**
**అథ విశ్వస్య సంహర్తా – భాగః కతమ ఏష తే।। 23**

**పదవిభాగము:–** కిమ్, యేన, సృజసి, వ్యక్తమ్, ఉత, యేన, బిభర్షి, తత్, అథ, విశ్వస్య, సంహర్తా, భాగః, కతమః, ఏషః, తే।

**అన్వయక్రమము:–** హే దేవ!, ఏషః తే భాగః కిమ్? యేన వ్యక్తం సృజసి సః, ఉత యేన తత్ బిభర్షి సః, అథ యః విశ్వస్య సంహర్తా సః, కతమః?।

**ప్రతిపదార్థము:–** హే దేవ! – ఓ స్వామీ!, ఏషః – ఈ కనబడుచున్న, తే – నీయొక్క, భాగః – రూపము, కిమ్ – ఏమి?, యేన – ఏ భాగముచేత, వ్యక్తమ్ –

స్ఫుటమగు ప్రపంచమును, సృజసి – పుట్టించుచున్నావో, సః కిమ్ – అది నీ రూపా? ఉత – లేక, యేన – ఏ భాగముచేత, తత్ – ఆ ప్రపంచమును, బిభర్షి – పాలించుచున్నావో, సః కిమ్ – అది నీ రూపా? అథ – లేక, యః – ఏ భాగము, విశ్వస్య –ప్రపంచముయొక్క, సంహర్తా – ధ్వంసకమో, సః కిమ్ – అది నీ రూపా? కతమః – ఏది?

**తాత్పర్యము:–** ఓ స్వామీ! ఈ కనబడుచున్న నీయొక్క రూపము ఏమి? ఏ భాగముచేత స్ఫుటమగు ప్రపంచమును పుట్టించుచున్నావో, అది నీ రూపా? లేక ఏ భాగముచేత ఆ ప్రపంచమును పాలించుచున్నావో, అది నీ రూపా? లేక ఏ భాగము ప్రపంచముయొక్క ధ్వంసకమో, అది నీ రూపా! ఏది?

**పాఠాన్తరాలు:–** 1. అథో యస్తస్య – అథ విశ్వస్య.

**విభక్తులు / క్రియలు:–** 1. ఏషః – **ఏషః,** ఏతౌ, ఏతే దకారాన్త పుంలింగ ఏతచ్ఛబ్దము. ప్ర.ఏ. 2. తే – **తే,** యువయోః, యుష్మాకమ్ దకారాన్త యుష్మచ్ఛబ్దము. ష.ఏ. 3. భాగః – **భాగః,** భాగౌ, భాగాః అకారాన్త పుంలింగ భాగశబ్దము. ప్ర.ఏ. 4. కిమ్ – అవ్యయము 5. యేన – యద్ధేతునా ఇత్యర్థః – అవ్యయము 6. వ్యక్తమ్ – **వ్యక్తమ్,** వ్యక్తౌ, వ్యక్తాన్ అకారాన్త పుంలింగ వ్యక్తశబ్దము. ద్వి.ఏ. 7. సృజసి – క్రియ 8. సః – **సః,** తౌ, తే దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ. 9. ఉత, అథ – అవ్యయాలు 10. బిభర్షి – **క్రియ** 11. యః – యః, యౌ, యే దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము. ప్ర.ఏ. 12. విశ్వస్య – **విశ్వస్య,** విశ్వయోః, విశ్వానామ్ అకారాన్త పుంలింగ విశ్వశబ్దము. ష.ఏ. 13. సంహర్తా – **సంహర్తా,** సంహర్తారౌ, సంహర్తారః ఋకారాన్త పుంలింగ సంహర్తృశబ్దము. ప్ర.ఏ. 14. కతమః – కతమః, కతమే, కతమాః అకారాన్త పుంలింగ కతమశబ్దము. ప్ర.ఏ.

**సంధులు:–**

1. కతమః + ఏషః – కతమ ఏషః – విసర్గలోపసన్ధిః।
2. ఏషః + తే – ఏష తే – సులోపః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

అత్ర సర్వత్ర భాగపదప్రయోగాద్ భాగే పరమార్థభూతః సత్త్వరజస్తమోభిరస్పృష్టః కశ్చిదస్త్యేవేతి వ్యజ్యతే। తాదృశస్య పరమార్థభూతస్యావగమవిషయో - యమస్మాకం ప్రశ్న ఇతి చ ధ్వన్యతే।

**1. భాగః –** (పుం.) భజ్యతే ఇతి। భజ్ కర్మణి ఘఞ్। అంశః।

**క్రియాదర్శము –**

1. **సృజసి** – 'సృజ – విసర్గే', సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, తుదాదయః (6), లట్ – మధ్యమపురుషైకవచనాంతః।

**సృజసి** – సృజథః – సృజథ

2. బిభర్షి – 'డుభృఞ్ (భృ) – ధారణపోషణయోః (ధరించుట, పోషించుట) సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ, జుహోత్యాదయః (3), లట్ – మధ్యమపురుషైకవచనాంతః।

**బిభర్షి** – బిభృథః – బిభృథ

---





**అవతారికా:–** నను హర ఇత్యేవం నిశ్చయాత్ కథమయం సంశయస్తత్రాహ। హరుడీతడను నిశ్చయమునుండి యెట్లు ఈ సందియము అన చెప్పుచున్నారు.

**శ్లో॥ అథ వా సుమహత్యేషా – ప్రార్థనా దేవ తిష్ఠతు।**
**చిన్తితోపస్థితాంస్తావ – చ్ఛాధి నః కరవామ కిమ్॥ 24**

**పదవిభాగము:–** అథ వా, సుమహతీ, ఏషా, ప్రార్థనా, దేవ, తిష్ఠతు, చిన్తితోపస్థితాన్, తావత్, శాధి, నః, కరవామ, కిమ్।

**అన్వయక్రమము:–** అథ వా హే దేవ! సుమహతీ ఏషా ప్రార్థనా తిష్ఠతు। చిన్తితోపస్థితాన్ నః తావత్ శాధి, కిం కరవామ।

**ప్రతిపదార్థము:–** అథ వా – పోనీ, హే దేవ! – ఓ స్వామీ!, సుమహతీ – మిక్కిలి గొప్పదైన, ఏషా – ఈ, ప్రార్థనా – వేడికోలు, తిష్ఠతు – అటులుండుగాక!, చిన్తితోపస్థితాన్ – తలంపబడినవారమై వచ్చియున్న, నః తావత్ – మమ్ములను ఐతే, శాధి – ఆజ్ఞాపింపుము, కిమ్ – ఏమి, కరవామ – చేయుదుము?

**తాత్పర్యము:–** పోనీ ఓ స్వామీ! ఓ ముక్కంటీ! మిక్కిలి గొప్పదైన ఈ వేడికోలు అటులుండుగాక! తలంపబడిన వారమై వచ్చియున్న మమ్ములను ఐతే ఆజ్ఞాపింపుము. ఏమి చేయుదుము?

**విభక్తులు / క్రియలు:–** 1. అథ, వా, తావత్, కిమ్ – అవ్యయాలు 2. దేవ! – **హేదేవ!,** హేదేవౌ, హేదేవాః అకారాన్త పుంలింగ దేవశబ్దము. సం.ప్ర.ఏ. 3. సుమహతీ – **సుమహతీ,** సుమహత్యౌ, సుమహత్యః ఈకారాన్త స్త్రీలింగ సుమహతీశబ్దము. ప్ర.ఏ. 4. ఏషా – **ఏషా,** ఏతే, ఏతాః దకారాన్త స్త్రీలింగ ఏతచ్ఛబ్దము. ప్ర.ఏ. 5. ప్రార్థనా – **ప్రార్థనా,** ప్రార్థనే, ప్రార్థనాః ఆకారాన్త స్త్రీలింగ ప్రార్థనాశబ్దము. ప్ర.ఏ. 6. తిష్ఠతు – క్రియ 7. చిన్తితోపస్థితాన్ – ...ఉపస్థితమ్, ...ఉపస్థితే,

...ఉపస్థితాన్ అకారాన్త పుంలింగ ...ఉపస్థితశబ్దము. ద్వి.బ. 8. నః – మామ్, ఆవామ్, నః దకారాన్త అస్మచ్ఛబ్దము. ద్వి.బ 9. శాధి – క్రియ 10. కరవామ – క్రియ.

**సమాసాలు:–**

1. సుమహతీ – శోభనా చ అసౌ మహతీ చ (కర్మధా.)।
2. చిన్తితోపస్థితాన్ –
ఎ) చింతితేన ఉపస్థితాః (తృ.త.) చింతితోపస్థితాః, తాన్।
బి) చింతితాశ్చ తే ఉపస్థితాశ్చ (కర్మధా.) చింతితోపస్థితాః, తాన్।

**సంధులు:–**

1. సుమహతీ + ఏషా – సుమహత్యేషా – యణాదేశసన్ధిః।
2. చిన్తితోపస్థితాన్ తావత్ – చిన్తితోపస్థితాంస్తావత్ – **అనునాసికానుస్వారౌ రుత్వం చ।**
3. తావత్ శాధి – తావచ్ఛాధి – **ఛత్వమ్ శశ్ఛోటి** (సూ. 8-4-62), ఛత్వమమీతివాచ్యమ్, పదాంతమందున్న వర్గముల మొదటి నాలుగు అక్షరములకు (ఝయ్యులకు) పరముగానున్న శకారమునకు అచ్చులుగాని, హయవరలుగాని పరమగుచో ఛకారము వికల్పముగ వచ్చును.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. ప్రార్థనా – (స్త్రీ.)**

ఎ) ప్ర + అర్థ్ + ణిచ్ + యుచ్।

బి) అధ్యేషణైషణా యాచ్ఞా యాచనా ప్రార్థనా స్మృతా। 360

అని హలాయుధకోశము '5' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ సన్తో దిగ్ జలమాకాశం గౌరన్నం ప్రార్థనా విషమ్।
క్రాద్ధస్య బ్రాహ్మణః కాలః కథం వా యక్ష! మన్యసే॥
– ఇతి మహాభారతే 3-312 / 81

డి) 'లబ్ధావకాశా మే **ప్రార్థనా**' / 'న దురవాపేయం ఖలు **ప్రార్థనా**' – ఇతి శాకున్తలే.

**క్రియాదర్శము:–**

1. **తిష్ఠతు** – 'ష్ఠా (స్థా) – గతి నివృత్తౌ' (నిలుచుట), అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, భ్వాదయః (1), లోట్ – ప్రథమపురుషైకవచనాంతః।
**తిష్ఠతు** / తిష్ఠతాత్ – తిష్ఠతామ్ – తిష్ఠన్తు



2. **శాధి** – 'శాసు (శాస్) – అనుశిష్టౌ' (శాసించుట), అదాది (2), సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లోట్ – మధ్యమపురుషైకవచనాంతః।
**శాధి** / శిష్టాత్ – శిష్టమ్ – శిష్ట।
3. **కరవామ** – 'డుకృఞ్ (కృ) – కరణే' (చేయుట), తనాది (8), సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ, లోట్ – ఉత్తమపురుషబహువచనాంతః।
కరవాణి – కరవావ – **కరవామ.**

---

**అవతారికా:–** పరమేశ్వరః ఋషీన్ ప్రత్యాహ। పరమేశ్వరుడు సప్తర్షులతో మాట్లాడుట.

**శ్లో॥ అథ మౌళిగతస్యేన్దో – ర్విశదైర్దశనాంశుభిః।**
**ఉపచిన్వన్ ప్రభాం తన్వీం – ప్రత్యాహ పరమేశ్వరః॥ 25**

**పదవిభాగము:–** అథ, మౌళిగతస్య, ఇన్దోః, విశదైః, దశనాంశుభిః, ఉపచిన్వన్, ప్రభామ్, తన్వీమ్, ప్రత్యాహ, పరమేశ్వరః।

**అన్వయక్రమము:–** అథ పరమేశ్వరః మౌళిగతస్య ఇన్దోః తన్వీం ప్రభాం విశదైః దశనాంశుభిః ఉపచిన్వన్ ప్రత్యాహ।

**ప్రతిపదార్థము:–** అథ – పిమ్మట, పరమేశ్వరః – పరమశివుడు, మౌళిగతస్య ఇన్దోః – శిరస్సును పొందినట్టి చంద్రునియొక్క, తన్వీమ్ – కొద్దిపాటి, ప్రభామ్ – వెలుగును, విశదైః – స్వచ్ఛములైన, దశనాంశుభిః – దంతకాంతులతో, ఉపచిన్వన్ – వృద్ధిపొందించుచు, ప్రత్యాహ – బదులు చెప్పెను.

**తాత్పర్యము:–** పిమ్మట పరమశివుడు శిరస్సును పొందినట్టి చంద్రునియొక్క కొద్దిపాటి వెలుగును స్వచ్ఛములైన దంతకాంతులతో వృద్ధిపొందించుచు బదులు చెప్పెను.

**విభక్తులు / క్రియలు:–** 1. అథ – అవ్యయము 2. పరమేశ్వరః – **పరమేశ్వరః,** పరమేశ్వరౌ, పరమేశ్వరాః అకారాన్త పుంలింగ పరమేశ్వరశబ్దము. ప్ర.ఏ. 3. మౌళిగతస్య – **మౌళిగతస్య,** మౌళిగతయోః, మౌళిగతానామ్ అకారాన్త పుంలింగ మౌళిగతశబ్దము. ష.ఏ. 4. ఇన్దోః – **ఇన్దోః,** ఇన్ద్వోః, ఇన్దూనామ్ ఉకారాన్త పుంలింగ ఇన్దుశబ్దము. ష.ఏ. 5. తన్వీమ్ – **తన్వీమ్,** తన్వ్యౌ, తన్వీః ఈకారాన్త స్త్రీలింగ తన్వీశబ్దము ద్వి.ఏ. 6. ప్రభామ్ – **ప్రభామ్**, ప్రభే, ప్రభాః ఆకారాన్త స్త్రీలింగ ప్రభాశబ్దము. ద్వి.ఏ. 7. విశదైః – విశదేన, విశదాభ్యామ్, **విశదైః** అకారాన్త పుంలింగ విశదశబ్దము. తృ.బ. 8. దశనాంశుభిః – ...అంశునా, ...అంశునాభ్యామ్, **...అంశుభిః** ఉకారాన్త పుంలింగ...అంశుశబ్దము. తృ.బ. 9. ఉపచిన్వన్ – **ఉపచిన్వన్,** ఉపచిన్వన్తౌ, ఉపచిన్వన్తః తకారాన్త పుంలింగ ఉపచిన్వత్శబ్దము. ప్ర.ఏ. 10. ప్రత్యాహ – క్రియ.

**సమాసాలు:-**

1. పరమేశ్వరః - పరమః చాసౌ ఈశ్వరః (కర్మధా.) పరమేశ్వరః।
2. మౌళిగతస్య - మౌళిం గతః, మౌళిగతః (ద్వి.త.), తస్య।
('ద్వితీయా శ్రితాతీతపతితగతాత్యస్తప్రాప్తాపన్నైః') ఇతి సమాసః।
3. దశనాంశుభిః - దశనానామ్ అంశవః (ష.త.) దశనాంశవః, తైః।

**సంధులు:-**

1. మౌళిగతస్య + ఇన్దోః - మౌళిగతస్యేన్దోః - గుణసన్ధిః।
2. ఇన్దోః + విశదైః - ఇన్దోర్విశదైః - విసర్గసన్ధిః (రుత్వమ్)।
3. విశదైః + దశనాంశుభిః - విశదైర్దశనాంశుభిః - విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1. విశదః - (త్రి.)** ఎ) వి శద్ అచ్।

బి) శ్లో॥ శుచిర్మేధ్యం పవిత్రం చ పుణ్యం పావనముచ్యతే।
విమలం **విశదం** వీధ్రముజ్జ్వలం స్యాదనావిలమ్॥ 132
- అని హలాయుధకోశము '10' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ ప్రసాదసుముఖే తస్మిన్ చన్ద్రే చ **విశద**ప్రభే।
తదా చక్షుష్మతాం ప్రీతిరాసీత్ సమరసా ద్వయోః॥ ర.వం. 4-18

" - స్వచ్ఛమగు కాంతిగల చంద్రుని, ప్రసన్నగుణోపేతుడైన రఘువంశమహారాజును చూచుచున్న వారందరికీ ఇరువురియందును సమానమైన ప్రీతికలిగెను."

డి) శ్లో॥ స్వచ్ఛామ్భఃస్నపనవిధౌ తమఙ్గమోష్ఠ -
స్తామ్బూలద్యుతి**విశదో** విలాసినీనామ్।
వాసశ్చ ప్రతను వివిక్తమస్త్వితీయా -
నాకల్పో యది కుసుమేషుణా న శూన్యః॥
- ఇతి శిశుపాలవధే - 8-70

**క్రియాదర్శము:-** 1. ప్రత్యాహ - ప్రతి - ఉపసర్గ, 'బ్రూఞ్ - వ్యక్తాయాం వాచి' ద్వికర్మకమ్, సేట్, వచ్యాదేశే (ఉభయ), అనిట్, పరస్మైపదీ। లట్ - ప్రథమపురుషైకవచనాంతః।

బ్రవీతి / **ఆహ** - బ్రూత / అహతుః - బ్రువన్తి / ఆహుః.

---



**శ్లో॥ విదితం వో యథా స్వార్థా - న మే కాశ్చిత్ ప్రవృత్తయః।**
**నను మూర్తిభిరష్టాభి - రిత్థంభూతో - స్మి సూచితః॥ 26**

**పదవిభాగము:-** విదితమ్, వః, యథా, స్వార్థా, న, మే, కాశ్చిత్, ప్రవృత్తయః, నను, మూర్తిభిః, అష్టాభిః, ఇత్థంభూతః, అస్మి, సూచితః।

**అన్వయక్రమము:-** (హే మునయః) కాశ్చిత్ మే ప్రవృత్తయః యథా స్వార్థాః న, తథా వః విదితమ్। అష్టాభిః మూర్తిభిః ఇత్థంభూతః సూచితః అస్మి।

**ప్రతిపదార్థము:-** (హే మునయః - ఓ సప్తర్షులారా!), కాశ్చిత్ - ఏవి, మే - నాయొక్క, ప్రవృత్తయః - వ్యాపారములు, యథా - ఎట్లు, స్వార్థాఃన - స్వప్రయోజనములు కావో, తథా - అట్లే, వః - మీకు, విదితమ్ - తెలియును, అష్టాభిః - ఎనిమిదియగు, మూర్తిభిః - రూపములచేత, ఇత్థంభూతః - ఈలాగు పొందినవాడుగా, సూచితః - సూచింపబడినవాడుగ, అస్మి - ఉన్నాను.

**తాత్పర్యము:-** ఏవి నాయొక్క వ్యాపారములు ఎట్లు స్వప్రయోజనములు కావో అట్లే మీకు తెలియును. ఎనిమిదియగు రూపములచేత ఈలాగు పొందినవాడుగా సూచింపబడినవాడుగ ఉన్నాను.

**విభక్తులు / క్రియలు:-** 1. కాశ్చిత్ - అ 2. మే - మమ / **మే**, ఆవయోః / నౌ, అస్మాకమ్ / నః దకారాన్త 'అస్మద్'శబ్దము. ష.ఏ. 3. ప్రవృత్తయః - ప్రవృత్తిః, ప్రవృత్తీ, **ప్రవృత్తయః** ఇకారాన్త స్త్రీలింగ ప్రవృత్తిశబ్దము. ప్ర.బ. 4. యథా, న, తథా - అవ్యయాలు 5. స్వార్థాః - **స్వార్థః,** స్వార్థౌ, స్వార్థాః అకారాన్త పుంలింగ స్వార్థశబ్దము. ప్ర.ఏ. 6. వః - తవ/తే, యువయోః / వామ్, యుష్మాకమ్ / **వః** దకారాన్త యుష్మద్శబ్దము. ష.బ. 7. విదితమ్ - **విదితమ్,** విదితే, విదితాని; అకారాన్త నపుంసకలింగ విదితశబ్దము ప్ర.ఏ. 8. అష్టాభిః - అష్టయా, అష్టాభ్యామ్, **అష్టాభిః;** ఆకారాన్త స్త్రీలింగ అష్టాశబ్దము. తృ.బ. 9. మూర్తిభిః - మూర్త్యా, మూర్తిభ్యామ్, **మూర్తిభిః;** ఇకారాన్త స్త్రీలింగ మూర్తిశబ్దము. తృ.బ. 10. ఇత్థంభూతః - **ఇత్థంభూతః,** ఇత్థంభూతౌ, ఇత్థంభూతాః; అకారాన్త పుంలింగ ఇత్థంభూతశబ్దము. ప్ర.ఏ. 11. సూచితః - **సూచితః,** సూచితౌ, సూచితాః; అకారాన్త పుంలింగ సూచితశబ్దము. ప్ర.ఏ. 12. అస్మి - క్రియ.

**సమాసాలు:-**

ఇత్థంభూతః - ఇత్థం భూతః ఇత్థంభూతః (సుప్సుపాసమాసః)।

**సంధులు:-**

1. వః + యథా - వో యథా - ఉత్వాదేశః।
2. స్వార్థాః + న - స్వార్థా న - విసర్గలోపః।

3. మూర్తిభిః + అష్టాభిః – మూర్తిభిరష్టాభిః – విసర్గసన్ధిః (రుత్వమ్)।
4. అష్టాభిః + ఇత్థంభూతః – అష్టాభిరిత్థంభూతః – విసర్గసన్ధిః (రుత్వమ్)।
5. ఇత్థంభూతః + అస్మి – ఇత్థంభూతో – స్మి – పూర్వరూపసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

1. అష్టాభిః మూర్తిభిః ఇత్థంభూతః –

ఎ) శివమూర్తీనామష్టవిధత్వముక్తం శైవాగమతన్త్రే, తథా హి –
"భూమిరాపో – నలో వాయురాత్మా వ్యోమ రవిః శశీ।
ఇతీమాః సర్వలోకానాం ప్రత్యక్షాః శివమూర్తయః"॥ ఇతి

బి) శ్లో॥ యా సృష్టిస్స్రష్టురాద్యా వహతి విధిహుతం యా హవిర్యా చ హోత్రీ
యే ద్వే కాలం విధత్తశ్శ్రుతివిషయగుణా యా స్థితా వ్యాప్య విశ్వమ్।
యామాహుస్సర్వభూతప్రకృతిరితి యయా ప్రాణినః ప్రాణవన్తః
ప్రత్యక్షాభిః ప్రపన్నాభిః **తనుభి**రవతు వస్తాభి**రష్టాభి**రీశః॥
– ఇతి అభిజ్ఞానశాకున్తలే 1–1

1) ఆదికాలప్రసిద్ధమగు **జలమును** 2. యథావిధిగా హోమముచేయబడు హవిస్సును వహించు **అగ్నియు** 3. హోమము చేయు **పురుషుడు**ను. 4,5. కాలప్రవర్తకులైన **సూర్య**చంద్రులును 6. బ్రహ్మాండమంతటను నిండి శబ్దగుణకమైయుండు **ఆకాశమును** 7. సకలబీజాధారమైన పృథ్వియును 8. ప్రాణులకు **ప్రాణవాయువును** అనెడు '8' తనువులచేత అందఱికి ప్రత్యక్షమూర్తియగు **పరమశివుడు** మిమ్ము రక్షించుగాక!

ఈ శ్లోకమును **'కంఠహారము'**గా ధరింతురుగాక.

సి) శ్లో॥ ఏకైశ్వర్యే స్థితో – పి ప్రణతబహుఫలే యః స్వయంకృత్తివాసాః
కాన్తాసమ్మిశ్రదేహో ప్యవిషయమనసాం యః పరస్తాద్యతీనామ్।
**అష్టాభి**ర్యస్య కృత్స్నం జగదపి **తనుభి** ర్బిభ్రతో నాభిమానః
సన్మార్గాలోకనాయ వ్యపనయతు స వః తామసీం వృత్తి**మీశః॥**
– ఇతి మాళవికాగ్నిమిత్రే 1–1

...అష్టవిధములైన శరీరములతో సర్వమును భరించువాడయ్యును, ఎవనికి అహంకారము లేశమంతయు లేదో, ఆ పరమశివుడు సన్మార్గమును చూపించుట కొఱకై మీయొక్క మనస్సులయందున్న **'తమోమయచిత్తవృత్తి'**ని తొలగించుగాక!



**క్రియాదర్శము:–** 1. **అస్మి** – 'అస (అస్) – భువి (ఉండుట)' అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, అదాది ప్రకరణమ్ (2), లట్ – ఉత్తమపురుషైకవచనాన్తః।
**అస్మి** – స్వః – స్మః।

---

**శ్లో॥ సో ఽహం తృష్ణాతురైర్వృష్టిం – విద్యుత్వానివ చాతకైః।**
**అరివిప్రకృతైర్దేవైః – ప్రసూతిం ప్రతి యాచితః॥** **27**

**పదవిభాగము:–** సః, అహమ్, తృష్ణాతురైః, వృష్టిమ్, విద్యుత్వాన్, ఇవ, చాతకైః, అరివిప్రకృతైః, దేవైః, ప్రసూతిమ్, ప్రతి, యాచితః।

**అన్వయక్రమము:–** సః అహం 'తృష్ణాతురైః చాతకైః వృష్టిం విద్యుత్వాన్ ఇవ' అరివిప్రకృతైః దేవైః ప్రసూతిం ప్రతి యాచితః అస్మి।

**ప్రతిపదార్థము:–** సః అహమ్ – అట్టి నేను, తృష్ణాతురైః – దప్పికగొన్న, చాతకైః – చాతకపక్షులచేత, వృష్టిమ్ – వానను, విద్యుత్వాన్+ఇవ – మేఘునివలె, అరివిప్రకృతైః – శత్రువుచేత పీడింపబడిన, దేవైః – దేవతలచేత, ప్రసూతిమ్ ప్రతి – పుత్రోత్పాదనమునుగూర్చి, యాచితః – వేడుకొనబడినవాడుగ, అస్మి – ఉన్నాను.

**తాత్పర్యము:–** అట్టి నేను, దప్పికగొన్న చాతకపక్షులచేత **వానను** మేఘుని వలె, శత్రువుచేత పీడింపబడిన దేవతలచేత **పుత్రోత్పాదము**నుగూర్చి వేడుకొనబడిన వాడుగ ఉన్నాను.

**విభక్తులు/క్రియలు:–** 1. సః – **సః**, తౌ, తే; దకారాన్తపుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ., 2. అహమ్ – **అహమ్,** అవామ్, వయమ్; దకారాన్త 'అస్మ'చ్ఛబ్దము. ప్ర.ఏ., 3. తృష్ణాతురైః – తృష్ణాతురేణ, తృష్ణాతురాభ్యామ్, తృష్ణాతురైః; అకారాన్త పుంలింగ తృష్ణాతుర శబ్దము, తృ.బ., 4. చాతకైః – చాతకేన, చాతాకాభ్యామ్, చాతకైః; అకారాన్త పుంలింగ చాతకశబ్దము, తృ.బ., 5. వృష్టిమ్ – **వృష్టిమ్,** వృష్టీ, వృష్టీః; ఇకారాన్త స్త్రీలింగవృష్టిశబ్దము, ద్వి.ఏ., 6. విద్యుత్వాన్ – విద్యుత్వాన్, విద్యుత్వన్తౌ, విద్యుత్వన్తః; తకారాన్త పుంలింగ విద్యుత్వచ్ఛబ్దము, ప్ర.ఏ., 7. అరివిప్రకృతైః – అరివిప్రకృతేన, అరివిప్రకృతాభ్యామ్, **అరివిప్రకృతైః**; అకారాన్త పుంలింగ అరివిప్రకృత శబ్దము, తృ.బ., 8. దేవైః – దేవేన, దేవాభ్యామ్, **దేవైః**; అకారాన్తపుంలింగ దేవశబ్దము, తృ.బ., 9. ప్రసూతిమ్ – **ప్రసూతిమ్**, ప్రసూతీ, ప్రసూతీః; ఇకారాన్త స్త్రీలింగప్రసూతి శబ్దము, ద్వి.ఏ., 10. ప్రతి, ఇవ – అవ్యయాలు, 11. యాచితః – **యాచితః**, యాచితౌ, యాచితాః; అకారాన్త పుంలింగ యాచితశబ్దము, ప్ర.ఏ., 12. అస్మి – క్రియ.

**సమాసాలు:-**

1. తృష్ణాతురైః - తృష్ణయా ఆతురాః (తృ.త) తృష్ణాతురాః, తైః।
2. విద్యుత్వాన్ - విద్యుత్ అస్తి యస్య (బహుర్రీహి) సః, విద్యుత్వాన్।
3. అరివిప్రకృతైః - అరిభిః, విప్రకృతాః (తృ.త.) అరివిప్రకృతాః, తైః।
   అరిణా విప్రకృతాః - ఏకవచనముగా టీకలో ఉన్నది.

**సంధులు:-**

1. సః +అహమ్ - సో - హమ్। పూర్వరూపసన్ధిః
2. తృష్ణాతురైః + వృష్టిమ్ - తృష్ణాతురైర్వృష్టిమ్ - విసర్గసన్ధిః (రుత్వమ్)।
3. అరివిప్రకృతైః + దేవైః - అరివిప్రకృతైర్దేవైః - విసర్గసన్ధిః (రుత్వమ్)

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

1. **చాతకః** - (పుం.) ఎ) చతతే యాచతే జలమమ్బుదమితి।
చత్ యాచనే + ణ్వుల్।

క్రియార్థమైన క్రియ ఉపపదముగా నుండగా, లేనపుడును, ధాతువుపై భవిష్యదర్థమున తుమున్ (తుమ్), **ణ్వుల్ (అక)** ప్రత్యయములు చేరును.

'తుమున్ ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయామ్' (సూ.3-3-10)

బి) శ్లో॥ మన్దం మన్దం నుదతి పవనశ్చానుకూలో యథా త్వాం
వామశ్చాయం నదతి మధురం **చాతక** స్తే సగన్ధః।
గర్భాధానక్షణపరిచయాన్నూనమాబద్ధమాలాః
సేవిష్యన్తే నయనసుభగం ఖే భవన్తం బలాకాః॥

- ఇతి మేఘదూతే-9

వివరములకు 'మృణాళినీ' వ్యాఖ్య చూడగలరు.

సి) శ్లో॥ .....సారఙ్గశ్చాతకో మతః।
అని హలాయుధకోశము-2 నామములను పేర్కొన్నది.

డి) శ్లో॥ తదన్యతస్తావదనన్యకార్యో
గుర్వర్థమాహర్తుమహం యతిష్యే।
స్వస్త్యస్తు తే నిర్గలితామ్బుగర్భం
శరద్ఘనం నార్దతి **చాతకో** - పి॥ - ర.వం.5-17

'...... తనలోని నీటి నంతటిని వర్షించి, శూన్యగర్భమైన శరత్కాలపు మేఘమును చేరి, చాతకపక్షి నీటికొరకై అర్థింపదు గదా!"



**అలంకారములు:-** ఇందు 'అర్థాన్తరన్యాసాలంకార' మున్నదని చెప్పదగును. ఈ శ్లోకమున పూర్వార్ధముచేత ఉత్తరార్ధము సమర్థింపబడిన 'అర్థాన్తరన్యాసము' గలదు.

**క్రియాదర్శము:-** 'అస్మి' - పూర్వము చెప్పబడినది.

---

**శ్లో॥ అత ఆహర్తుమిచ్ఛామి - పార్వతీమాత్మజన్మనే।**
**ఉత్పత్తయే హవిర్భోక్తు - ర్యజమాన ఇవారణిమ్॥ 28**

**పదవిభాగము :-** అతః, ఆహర్తుమ్, ఇచ్ఛామి, పార్వతీమ్, ఆత్మజన్మనే, ఉత్పత్తయే, హవిః, భోక్తుః, యజమానః, ఇవ, అరణిమ్।

**అన్వయక్రమము :-** అతః ఆత్మజన్మనే పార్వతీం యజమానః హవిర్భోక్తుః ఉత్పత్తయే అరణిమ్ ఇవ ఆహర్తుమ్ ఇచ్ఛామి।

**ప్రతిపదార్థము :-** అతః - కావున, ఆత్మజన్మనే - పుత్రునికొఱకు, పార్వతీమ్ - పార్వతీదేవిని, యజమానః - యజ్ఞము చేయువాడు, హవిర్భోక్తుః - అగ్నియొక్క, ఉత్పత్తయే - పుట్టుకకొఱకు, అరణిమ్+ఇవ - అగ్నిమంథనదారువునువలె, ఆహర్తుమ్ - తీసికొనివచ్చుటకు, ఇచ్ఛామి - కోరుచున్నాను.

**తాత్పర్యము :-** కావున, పుత్రునికొఱకు పార్వతీదేవిని, యజ్ఞముచేయువాడు అగ్నియొక్క పుట్టుకకొఱకు అగ్నిమంథనదారువునువలె, తీసికొనివచ్చుటకు కోరుచున్నాను.

**పాఠాన్తరాలు :-** 1. ఉత్పత్తయే - ఉత్పాదాయ

**విభక్తులు / క్రియలు :-** 1. అతః - అవ్యయము 2. ఆత్మజన్మనే - **ఆత్మజన్మనే**, ఆత్మజన్మభ్యామ్, ఆత్మజన్మభ్యః; నకారాన్త పుంలింగ ఆత్మజన్మన్‌శబ్దము. చ.ఏ. 3. పార్వతీమ్ - **పార్వతీమ్,** పార్వత్యౌ, పార్వత్యః; ఈకారాన్త స్త్రీలింగ పార్వతీశబ్దము. ద్వి.ఏ. 4. యజమానః - **యజమానః**, యజమానౌ, యజమానాః; అకారాన్త పుంలింగ యజమానశబ్దము .ప్ర.ఏ. 5. ఉత్పత్తయే - **ఉత్పత్తయే,** ఉత్పత్తిభ్యామ్, ఉత్పత్తిభ్యః; ఇకారాన్త స్త్రీలింగ ఉత్పత్తిశబ్దము. చ.ఏ. 6. హవిర్భోక్తుః - **హవిర్భోక్తుః**, హవిర్భోక్త్రోః, హవిర్భోక్తృణామ్; ఋకారాన్త పుంలింగ హవిర్భోక్తృశబ్దము. ష.ఏ. 7. అరణిమ్ - **అరణిమ్**, అరణీ, అరణీన్; ఇకారాన్త పుం(స్త్రీ)లింగ అరణిశబ్దము. ద్వి.ఏ. 8. ఇవ - అవ్యయము 9. ఆహర్తుమ్ - అవ్యయము 10. ఇచ్ఛామి - క్రియ.

**సమాసాలు :-**

1. ఆత్మజన్మనే - ఆత్మనః జన్మ ఆత్మజన్మ (ష.త.) తస్మై।

2. హవిర్భోక్తుః –భునక్తీతి భోక్తా హవిషః భోక్తా హవిర్భోక్తా (ష.త.) తస్య।

**సంధులు :–**

1. అతః + ఆహర్తుమ్ – అత ఆహర్తుమ్ – విసర్గలోపః।
2. హవిర్భోక్తుః + యజమానః – హవిర్భోక్తుర్యజమానః – విసర్గసన్ధిః।
3. యజమానః + ఇవ – యజమాన ఇవ – విసర్గలోపః।
4. ఇవ + అరణిమ్ – ఇవారణిమ్ – సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. అరణిః** (పుం / స్త్రీ.) :–

ఎ) 1. ఋ + అనిః। అగ్నిసాధనీభూతకాష్ఠమ్

2. అర్యత ఇతి అరణిః।

బి) నిర్మన్థకాష్ఠమరణిః.... అని హలాయుధకోశము '2' నామములను పేర్కొన్నది.

సి) 'విపక్షవక్షో – రణిమన్థనోత్థః ప్రతాపవహ్నేరివ ధూమలేఖా'

– ఇతి ధనంజయవిజయవ్యాయోగే।

అని హలాయుధకోశవ్యాఖ్య – పేర్కొన్నది.

డి) **'అరిసృధృధమ్యమ్యశ్యవితృభ్యో – నిః'** (ఉణాదిప్రకరణమ్ 2 –102)

అష్టభ్యో – నిప్రత్యయః స్యాత్। అరణిరగ్నేర్యోనిః। సరణిః। ధరణిః। ధమనిః। అమనిర్గతిః। అశనిః। అవనిః। తరణిః। బాహులకాద్రజనిః।

ఇ) శ్లో॥ తత్తాదృశో భగవతో వచసా నికామ –
మాసాద్య మోదభరమాశ్రమాగతానామ్।
ప్రాప్తా**రణే**ర్ద్విజవరస్య శుచైవ సాక–
మన్తం జగామ సమయో – పి మహానమీషామ్॥ చంపూభారతే – 5–15

ఎఫ్) "ప్రయచ్ఛన్తి ఫలం భూమి**రరణీ**వ హుతాశనమ్" పంచతంత్ర 1–126

(అరణీ – స్త్రీలింగరూపము).

**అలంకారములు :–** 'అత్ర ఉపమామాహ। యజమానః హవిర్భోక్తుః ఉత్పాదాయ అరణిమివేతి। యజమానో యాగకర్తా హవిషో భోక్తురగ్నేః ఉత్పాదాయ ఉత్పాదనాయ। అరణిర్నామ అగ్నిహోత్రాదిష్వగ్నినిర్మన్థనార్థం నిర్మితం దారు। అగ్న్యుత్పాదనార్థం యథా యజమానో – రణిమిచ్ఛతి, తథా అహం పుత్రోత్పాదనార్థం పార్వతీం పరిణేతుమిచ్ఛామీత్యర్థః। అత్ర ఆత్మనో యజమానోపమానేన ధర్మప్రవణత్వం





సూచితమ్। ఆత్మజన్మనో వహ్న్యుపమానేన తస్య లోకోత్తర ప్రతాపత్వం సూచితమ్। పార్వత్యా అరణ్యుపమానేన 'ఉభే ఏవ క్షమే వోఢుముభయోర్వీర్యమాహితమ్' ఇత్యాదినోక్తం పార్వత్యా ఏవాత్మవీర్యధారణయోగ్యత్వం వ్యజ్యతే।

–అని 'వివరణమ్' వ్యాఖ్య

**క్రియాదర్శము :–** 1. **ఇచ్ఛామి** – 'ఇష – ఇచ్ఛాయామ్' (కోరుట), తుదాదయః (6), సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లట్ – ఉత్తమపురుషైకవచనాంతః।

**ఇచ్ఛామి** – ఇచ్ఛావః – ఇచ్ఛామః

---

**శ్లో॥ తామస్మదర్థే యుష్మాభి – ర్యాచితవ్యో హిమాలయః।**
**విక్రియాయై న కల్పన్తే – సంబన్ధాః సదనుష్ఠితాః॥ 29**

**పదవిభాగము:–** తామ్, అస్మదర్థే, యుష్మాభిః, యాచితవ్యః, హిమాలయః, విక్రియాయై, న, కల్పన్తే, సంబన్ధాః, సదనుష్ఠితాః।

**అన్వయక్రమము:–** అస్మదర్థే యుష్మాభిః తాం హిమాలయః యాచితవ్యః సదనుష్ఠితాః సమ్బన్ధాః విక్రియాయై న కల్పన్తే।

**ప్రతిపదార్థము:–** అస్మదర్థే – నా నిమిత్తముగ, యుష్మాభిః – మీచేత, తామ్ – ఆ పార్వతీదేవినిగూర్చి, హిమాలయః – హిమవంతుడు, యాచితవ్యః – వేడబడ వలసినవాడు, సదనుష్ఠితాః – సత్పురుషులచేత కూర్చబడిన, సమ్బన్ధాః – సంబంధములు, విక్రియాయై – వికటించుటకొఱకు, న కల్పన్తే – ఏర్పడవు.

**తాత్పర్యము:–** నా నిమత్తముగ ఆ పార్వతీదేవినిగూర్చి మీచేత హిమవంతుడు వేడబడవలసినవాడు. సత్పురుషులచేత కూర్చబడిన సంబంధములు వికటించుట కొఱకు ఏర్పడవు.

**పాఠాన్తరాలు:–**

1. హిమాలయః – హిమాచలః

**విభక్తులు / క్రియలు:–** 1. అస్మదర్థే – అస్మదర్థే, అస్మదర్థయోః, అస్మదర్థేషు; అకారాన్త పుంలింగ అస్మదర్థశబ్దము. స.ఏ. 2. యుష్మాభిః – త్వయా, యువాభ్యామ్, **యుష్మాభిః;** దకారాన్త యుష్మచ్ఛబ్దము. తృ.ఏ. 3. తామ్ – **తామ్**, తే, తాః; దకారాన్త స్త్రీలింగతచ్ఛబ్దము. ద్వి.ఏ. 4. హిమాలయః – **హిమాలయః**, హిమాలయౌ, హిమాలయాః; అకారాన్త పుంలింగ హిమాలయశబ్దము. ప్ర.ఏ. 5.

యాచితవ్యః – **యాచితవ్యః**, యాచితవ్యౌ, యాచితవ్యాః; అకారాన్త పుంలింగ యాచితవ్యశబ్దము. ప్ర.ఏ. 6. సదనుష్ఠితాః – సదనుష్ఠితః, సదనుష్ఠితౌ, సదనుష్ఠితాః; అకారాన్త పుంలింగ సదనుష్ఠితశబ్దము. ప్ర.బ. 7. సంబంధాః – సంబంధః, సంబంధౌ, **సంబంధాః**; అకారాన్త పుంలింగ సంబంధశబ్దము. ప్ర.బ. 8. విక్రియాయై – **విక్రియాయై,** విక్రియాభ్యామ్, విక్రియాభ్యః; ఆకారాన్త స్త్రీలింగ విక్రియాశబ్దము. తృ.ఏ. 9. న – అవ్యయము 10. కల్పన్తే – క్రియ

**సమాసాలు:–**

1. అస్మదర్థే – అస్మాకమ్ అర్థః (ష.త.) అస్మదర్థః, తస్మిన్ అస్మదర్థే।
2. సదనుష్ఠితాః – సద్భిః అనుష్ఠితాః (తృ.త.)।
3. హిమాలయః – హిమస్య ఆలయః (ష.త.)।

**సంధులు:–**

1. యాచితవ్యః + హిమాలయః – యాచితవ్యో హిమాలయః – ఉత్వాదేశః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

1. **"నిమిత్తాత్ కర్మయోగే'** । ఇతి సప్తమీ। (వార్తికమ్)

నిమిత్తమిహ ఫలమ్। సీమాణ్డకోశః। పుష్కలకో గన్ధమృగః।
"చర్మణి ద్వీపినం హన్తి దన్తయోర్హన్తి కుంజరమ్।
కేశేషు చమరీం హన్తి సీమ్ని పుష్కలకోహతః॥" (ఇతి భాష్యమ్)

శ్లో॥ ఏషో – క్షమాలావలయం మృగాణాం
కణ్డూయితారం కుశసూచిలావమ్।
**సభాజనే** మే భుజమూర్ధ్వబాహుః
సవ్యేతరం ప్రాధ్వమితః ప్రయుఙ్క్తే॥ – ర.వం. 13–43

ఏష దక్షిణం భుజం మే సభాజనే సంమాననానిమిత్తే। సప్తమీ.

– ఇతి పాణినిసూత్రవ్యాఖ్యాయామ్.

**అలంకారాలు:–** అత్ర అర్థాన్తరన్యాసాలంకారః।

ఈ శ్లోకమున ఉత్తరార్ధముచే పూర్వార్ధము సమర్థింపబడిన 'అర్థాన్తరన్యాసా లంకారము' గలదు. అన్వయము – సరళము.

**క్రియాదర్శము:– కల్పన్తే –** 'కృపూ–సామర్థ్యే' (సమర్థుడగుట) భ్వాదిప్రకరణమ్(1), అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, లట్–ప్రథమపురుషబహువచనాంతః।

కల్పతే – కల్పేతే – **కల్పన్తే**

---





**అవతారికా :–** న చాహం లౌల్యాత్ స్త్రియమిచ్ఛామి కిన్తు దేవోపకారాయ – యద్యేవం నిఖిలదేవేషు విద్యమానేషు హిమగిరేః శిలాభూతస్య కన్యాపరిణయేచ్ఛా కథమిత్యుక్తే స ఏవ మే శ్లాఘ్యసంబన్ధో – త్ర భవాన్హిమవానిత్యాహ।

నేనాసక్తిచే స్త్రీని కోరను, దేవతల యుపకారమునకై కోరుచున్నాను – అట్లైతే దేవతలనేకులుండగా ఊతిస్వరూపముగల హిమవంతుని బిడ్డేల ననగా నాయన పూజ్యుడని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఉన్నతేన స్థితిమతా – ధురముద్వహతా భువః।**
**తేన యోజితసంబన్ధం – విత్త మామప్యవఞ్చితమ్॥ 30**

**పదవిభాగము :–** ఉన్నతేన, స్థితిమతా, ధురమ్, ఉద్వహతా, భువః, తేన, యోజితసంబన్ధమ్, విత్త, మామ్, అపి, అవఞ్చితమ్।

**అన్వయక్రమము :–** ఉన్నతేన స్థితిమతా భువః ధురమ్ ఉద్వహతా తేన యోజితసంబన్ధం మామపి అవఞ్చితం విత్త।

**ప్రతిపదార్థము :–** ఉన్నతేన – ఉన్నతుడును, స్థితిమతా – నిలుకడకలవాడును, భువః – భూమియొక్క, ధురమ్ – బరువును, ఉద్వహతా – మోయువాడును అగు, తేన – ఆ హిమవంతునిచేత, యోజితసంబన్ధమ్ – కూర్చబడిన చుట్టఱికముగలవానిని, మామపి – నన్నును, అవఞ్చితమ్ – వంచింపబడనివానినిగ, విత్త – తెలిసికొనుడు.

**తాత్పర్యము :–** ఉన్నతుడును, నిలుకడగలవాడును, భూమియొక్క బరువును మోయువాడును అగు ఆ హిమవంతునిచేత కూర్చబడిన చుట్టఱికముగల వానిని నన్నును వంచింపబడనివానినిగ తెలిసికొనుడు.

**విభక్తులు / క్రియలు :–** 1. ఉన్నతేన – **ఉన్నతేన**, ఉన్నతాభ్యామ్, ఉన్నతైః; అకారాన్త పుంలింగ ఉన్నతశబ్దము. తృ.ఏ. 2. స్థితిమతా – **స్థితిమతా**, స్థితిమద్భ్యామ్, స్థితిమద్భిః; తకారాన్త పుంలింగ స్థితిమత్ శబ్దము. తృ.ఏ. 3. భువః – **భువః,** భువోః, భువామ్; ఊకారాన్త స్త్రీలింగ భూశబ్దము. ష.ఏ. 4. ధురమ్ – **ధురమ్**, ధురౌ, ధురాన్; అకారాన్త పుంలింగ ధురశబ్దము. ద్వి.ఏ. 5. ఉద్వహతా – **ఉద్వహతా**, ఉద్వహద్భ్యామ్, ఉద్వహద్భిః ; తకారాన్త పుంలింగ ఉద్వహత్శబ్దము. తృ.ఏ. 6. తేన – తేన, తాభ్యామ్, తైః ; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. తృ.ఏ. 7. యోజితసంబన్ధమ్ – **యోజితసంబన్ధమ్,** యోజితసంబన్ధౌ, యోజితసంబంధాన్; అకారాన్త పుంలింగ యోజితసంబంధ శబ్దము. ద్వి.ఏ. 8. మామ్ – **మామ్,** ఆవామ్, నః; దకారాన్త పుంలింగ 'అస్మ'చ్ఛబ్దము. ద్వి.ఏ. 9.

అపి – అవ్యయము 10. అవజ్ఞీతమ్ – **అవజ్ఞీతమ్**, అవజ్ఞీతౌ, అవజ్ఞీతాన్; అకారాన్త పుంలింగ అవజ్ఞీతశబ్దము. ద్వి.ఏ. 11. విత్త – క్రియ.

**సమాసాలు :–**

1. స్థితిమతా – స్థితిః అస్యాస్తీతి – స్థితిమాన్, (త.వృత్తిః) తేన। స్థితిమతా।
2. ఉద్వహతా – ఉద్వహతీతి ఉద్వహన్ (త.వృత్తిః) తేన। ఉద్వహతా।
3. యోజితసంబన్ధమ్ – యోజితః సంబంధః యస్య (బహువ్రీహి) సః, యోజితసంబంధః, తమ్।
4. అవజ్ఞీతమ్ – న వజ్ఞీతః, అవజ్ఞీతః (నఞ్‌తత్పురుష), తమ్।

**సంధులు:–**

1. అపి + అవజ్ఞీతమ్ – అప్యవజ్ఞీతమ్ – యణాదేశసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. ఉన్నతః (త్రి.) :–** ఎ) ఉత్ + నమ్+ క్త।

బి) శ్లో॥ ప్రాంశూచ్చమున్నతం తుఙ్గముదగ్రం... 751

– అని హలాయుధకోశము '5' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ సర్వాతిరిక్తసారేణ సర్వతేజోఽభిభావినా।
స్థితస్సర్**వోన్నతేనో**ర్వీం క్రాన్త్వా మేరురివాత్మనా॥ – ర.వం. 1–14

"... అందఱికంటెను ఉన్నతమైన శరీరముచేత మేరుపర్వతమువలె భూమిని ఆక్రమించి ఉన్నవాడును..."

**క్రియాదర్శము :– విత్త :–** 'విద – జ్ఞానే' సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, అదాదిప్రకరణమ్ (2), లోట్ – మధ్యమపురుషబహువచనాంతః।

విద్ధి / విత్తాత్ – విత్తమ్ – **విత్త**

---

**అవతారికా:–** తర్హి స కిం వాచ్య ఇత్యాశఙ్క్యాహ। అట్లైనను ఏమి చెప్పవలయునో యన చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఏవం వాచ్య స్స కన్యార్థ – మితి వో నోపదిశ్యతే।**
**భవత్ప్రణీతమాచార – మామనన్తి హి సాధవః॥ 31**

**పదవిభాగము:–** ఏవమ్, వాచ్యః, సః, కన్యార్థమ్, ఇతి, వః, న, ఉపదిశ్యతే, భవత్ప్రణీతమ్, ఆచారమ్, ఆమనన్తి, హి, సాధవః।



**అన్వయక్రమము:–** 'కన్యార్థం స ఏవం వాచ్యః' ఇతి వః న ఉపదిశ్యతే। హి సాధవః భవత్ప్రణీతమ్ ఆచారమ్ ఆమనన్తి।

**ప్రతిపదార్థము:–** కన్యార్థమ్ – కన్యకొఱకు, సః – ఆ హిమవంతుడు, ఏవం వాచ్యః –ఇట్లు చెప్పబడవలసినవాడు, ఇతి – అని, వః – మీకు, న ఉపదిశ్యతే – చెప్పబడుటలేదు, హి – ఏలయన, సాధవః – విద్వాంసులు, భవత్ప్రణీతమ్ – మీచేత రచింపబడిన, ఆచారమ్ – నడవడిని, ఆమనన్తి – ఉపదేశింతురు.

**తాత్పర్యము:–** కన్యకొఱకు ఆ హిమవంతుడు ఇట్లు చెప్పబడవలసినవాడు అని మీకు చెప్పబడుటలేదు. ఏలయన విద్వాంసులు మీచేత రచింపబడిన నడవడిని ఉపదేశింతురు.

**విభక్తులు / క్రియలు:–** 1. కన్యార్థమ్ – క్రియావిశేషణమవ్యయము. 2. సః – **సః**, తౌ, తే ; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ. 3. ఏవమ్ – అవ్యయము 4. వాచ్యః – **వాచ్యః**, వాచ్యౌ, వాచ్యాః; అకారాన్త పుంలింగ వాచ్యశబ్దము. ప్ర.ఏ. 5. ఇతి, న, హి – అవ్యయాలు. 6. వః – తవ, యువయోః, **వః;** దకారాన్త యుష్మచ్ఛబ్దము. ష.బ. 7. ఉపదిశ్యతే – క్రియ – కర్మణి 8. సాధవః – సాధుః, సాధూ, **సాధవః**; ఉకారాన్త పుంలింగ సాధుశబ్దము. ప్ర.బ. 9. భవత్ప్రణీతమ్ – **భవత్ప్రణీతమ్,** భవత్ప్రణీతౌ, భవత్ప్రణీతాన్; అకారాన్త పుంలింగ భవత్ప్రణీతశబ్దము. ద్వి.ఏ. 10. ఆచారమ్ – **ఆచారమ్**, ఆచారౌ, ఆచారాన్; అకారాన్త పుంలింగ ఆచారశబ్దము. ద్వి.ఏ. 11. ఆమనన్తి – క్రియ.

సమాసాలు:–

1. కన్యార్థమ్ – కన్యాయై ఇదం కన్యార్థం క్రియావిశేషణవవ్యయము (చ.త.)।
2. భవత్ప్రణీతమ్ – భవద్భిః ప్రణీతః (తృ.త.) భవత్ప్రణీతః, తమ్।

**సంధులు:–**

1. వాచ్యః + సః – వాచ్యస్సః – విసర్గసన్ధిః।
2. సః + కన్యార్థమ్ – స కన్యార్థమ్ – సులోపః।
3. వః + న – వో న – ఉత్వాదేశః।
4. న + ఉపదిశ్యతే – నోపదిశ్యతే – గుణసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

1. **కన్యార్థం** – కన్యాయై ఇదం కన్యార్థమ్ – చ.త.
'చతుర్థీ తదర్థార్థబలిహిత సుఖరక్షితైః' సూ. 2–1–35
వా॥ అర్థేన నిత్యసమాసో విశేష్యలింగతా చేతి వక్తవ్యమ్।

చతుర్థ్యన్తము తదర్థవాచకముతోను, అర్థ, బలి, హిత, సుఖ, రక్షిత ప్రకృతిక సుబన్తములతో వికల్పముగ సమసించును. ఇందు అర్థశబ్దముతో సమాసము నిత్యము. విశేషలిఙ్గతయును విహితము.

ద్విజాయ అయమ్ – ద్విజార్థః

ద్విజాయ ఇదమ్ – ద్విజార్థమ్.

ద్విజాయ ఇయమ్ – ద్విజార్థా.

**అలంకారములు:–** ఇందు ఉత్తరార్ధముచే పూర్వార్ధము సమర్థింపబడిన 'అర్థాన్తరన్యాసాలంకారము' గలదు.

**క్రియాదర్శము:–**

**1. ఉపదిశ్యతే** – ఉప – ఉపసర్గ, 'దిశ – అతిసర్జనే'. ఉప ఉపసర్గపూర్వకమైన ఈ ధాతువునకు 'ఉపదేశించుట' అని అర్థము. సకర్మకమ్, అనిట్, ఉభయపదీ, కర్మణిప్రయోగము, ఆత్మనేపదీ, లట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**ఉపదిశ్యతే** – ఉపదిశ్యేతే – ఉపదిశ్యన్తే

2. **ఆమనన్తి** – ఆఙ్ – ఉపసర్గ, 'మ్నా – అభ్యాసే', 'పాఘ్రాధ్మాస్థామ్నా' ఇతి మనాదేశః। సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, భ్వాదయః (1), లట్ – ప్రథమ పురుషబహువచనాంతః।

ఆమనతి – ఆమనతః – **ఆమనన్తి**

---

**శ్లో॥ ఆర్యాప్యరున్ధతీ తత్ర – వ్యాపారం కర్తుమర్హతి।**
**ప్రాయేణైవంవిధే కార్యే – పురన్ధ్రీణాం ప్రగల్భతా॥ 32**

**పదవిభాగము:–** ఆర్యా, అపి, అరున్ధతీ, తత్ర, వ్యాపారమ్, కర్తుమ్, అర్హతి, ప్రాయేణ, ఏవంవిధే, కార్యే, పురన్ధ్రీణామ్, ప్రగల్భతా।

**అన్వయక్రమము:–** ఆర్యా అరున్ధతీ అపి తత్ర వ్యాపారం కర్తుమ్ అర్హతి। ప్రాయేణ ఏవంవిధే కార్యే పురన్ధ్రీణాం ప్రగల్భతా (భవతి)।

**ప్రతిపదార్థము:–** ఆర్యా – పూజ్యురాలైన, అరున్ధతీ అపి – అరున్ధతీదేవియును, తత్ర – ఆ వివాహకృత్యమునందు, వ్యాపారమ్ – సాహాయ్యమును, కర్తుమ్ – చేయుటకు, అర్హతి – తగును, ప్రాయేణ – తఱుచుగా, ఏవంవిధే – ఇటువంటి,





కార్యే – వివాహకార్యమునందు, పురన్ధ్రీణామ్ – కుటుంబినులకు, ప్రగల్భతా – చాతుర్యము, (భవతి) – (ఉండును.)

**తాత్పర్యము:–** పూజ్యురాలైన అరున్ధతీదేవియును ఆ వివాహకృత్యమునందు సాహాయ్యమును చేయుటకు తగును. తఱుచుగా ఇటువంటి వివాహకార్యమునందు కుటుంబినులకు చాతుర్యము ఉండును.

**పాఠాన్తరాలు:–**

1. వ్యాపారమ్ – సాహాయ్యమ్

**విభక్తులు / క్రియలు:–** 1. ఆర్యా – **ఆర్యా,** ఆర్యే, ఆర్యాః; ఆకారాన్త స్త్రీలింగ ఆర్యాశబ్దము. ప్ర.ఏ. 2. అరున్ధతీ – **అరున్ధతీ,** అరున్ధత్యౌ, అరున్ధత్యః; ఈకారాన్త స్త్రీలింగ అరున్ధతీశబ్దము. ప్ర.ఏ. 3. తత్ర, అపి, ప్రాయేణ – అవ్యయాలు 4. వ్యాపారమ్ – **వ్యాపారమ్,** వ్యాపారౌ, వ్యాపారాన్ ; అకారాన్త పుంలింగ వ్యాపారశబ్దము. ద్వి.ఏ. 5. కర్తుమ్ – అవ్యయము 6. అర్హతి – క్రియ 7. ఏవంవిధే – **ఏవంవిధే**, ఏవంవిధయోః, ఏవంవిధేషు; అకారాన్త నపుంసకలింగ ఏవంవిధశబ్దము. స.ఏ. 8. కార్యే – **కార్యే**, కార్యయోః, కార్యేషు; అకారాన్త నపుంసకలింగ కార్యశబ్దము. స.ఏ. 9. పురన్ధ్రీణామ్ – పురన్ధ్ర్యాః, పురన్ధ్ర్యోః, **పురన్ధ్రీణామ్;** ఈకారాన్త స్త్రీలింగ పురన్ధ్రీశబ్దము. ష.బ 10. ప్రగల్భతా – **ప్రగల్భతా**, ప్రగల్భతే, ప్రగల్భతాః; ఆకారాన్త స్త్రీలింగ ప్రగల్భతాశబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు:–**

1. ఏవంవిధే – 'ఏవం విధా యస్య (బహువ్రీహి) తద్, ఏవంవిధం, తస్మిన్ ఏవంవిధే।
2. పురన్ధ్రీ పురం – గృహం ధరతి ఇతి పురన్ధ్రీ (కృద్వృత్తిః)।

**సంధులు:–**

1. ఆర్యా + అపి – అర్యాపి – సవర్ణదీర్ఘసన్ధిః।
2. అపి + అరున్ధతీ – అప్యరున్ధతీ – యణాదేశసన్ధిః।
3. ప్రాయేణ + ఏవంవిధే – ప్రాయేణైవంవిధే – వృద్ధిసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. ఆర్యా – (స్త్రీ.)**

ఎ) ఋ+ ణ్యత్ + స్త్రియాం టాప్। పార్వతీ। శ్రేష్ఠా స్త్రీ।

బి) శ్లో॥ "యస్యాః పాదే ప్రథమే ద్వాదశా మాత్రాస్తథా తృతీయే – పి।
అష్టాదశ ద్వితీయే చతర్థకే పంచదశా సార్యా" – ఇతి శ్రుతబోధః।
(ఛన్దోవిశేషమైనప్పుడు)

సి) శ్లో॥ యత్రార్యా రుదతీ భీతా పాణ్డవానిదమబ్రవీత్।
మహద్ వ్యసనమాపన్నా శిఖినా పరివారితా॥
- ఇతి మహాభారతే - 3-12-87

డి) 'ఋ హలోర్ణ్యత్ (సూ 3-1-124)
ఋవర్ణాన్తాద్ధలన్తాచ్చ ధాతోర్ణ్యత్ స్యాత్। కార్యమ్। వర్జ్యమ్।
ఆర్యేణ అర్తుమర్హేణ। ఋ - గతౌ। అనేన ణ్యత్।
శ్లో॥ తేన సంగత**మార్యేణ** రామాజర్యం కురు ద్రుతమ్।
లజ్కాం ప్రాప్య తతః పాప దశగ్రీవం హనిష్యసి॥ - ఇతి భట్టికావ్యే 6-54

**అలంకారములు:-** అత్ర అర్థాన్తరన్యాసాలంకారః।

**క్రియాదర్శము:- అర్హతి** - అర్హ (అర్హ్) పూజాయామ్ (పూజించుట) సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్ (1), లట్ - ప్రథమపురుషైకవచనాంతః।
**అర్హతి** - అర్హతః - అర్హన్తి.
శ్లో॥ అథార్చత్యర్చతి భజత్యపచాయతి చాత్మనే॥ 52
శ్లో॥ చత్వారి వల్గూయతి చ సభాజయతి మానతి।
సపర్యత్యర్చయతి చారాఘ్నోతి మహయత్యపి॥ 53
పూజయత్యర్హయతి చ మహత్యారాధయత్యపి।
మానయత్యఞ్చయతి చార్హతి యక్షయతే - ర్చనే॥ 54
- ఇతి ఆఖ్యాతచన్ద్రికాయామ్ 2-2

---

**శ్లో॥ తత్ ప్రయాతౌషధిప్రస్థం - సిద్ధయే హిమవత్పురమ్।**
**మహాకోశీప్రపాతే - స్మిన్ - సఙ్గమః పునరేవ నః॥ 33**

**పదవిభాగము:-** తత్, ప్రయాత, ఓషధిప్రస్థమ్, సిద్ధయే, హిమవత్పురమ్, మహాకోశీప్రపాతే, అస్మిన్, సంగమః, పునః, ఏవ, నః।

**అన్వయక్రమము:-** తత్ ఓషధిప్రస్థం హిమవత్పురం సిద్ధయే ప్రయాత। అస్మిన్ మహాకోశీప్రపాతే ఏవ నః పునః సంగమః (భవతు)।

**ప్రతిపదార్థము:-** తత్ - కావున, ఓషధిప్రస్థమ్ - ఓషధిప్రస్థమనెడి, హిమవత్పురమ్ - హిమవన్నగరమునుగూర్చి, సిద్ధయే - (వివాహకార్యము) సిద్ధించుటకొఱకు, ప్రయాత - బయలుదేరుడు. అస్మిన్ - ఈ, మహాకోశీప్రపాతే ఏవ - మహాకోశియను నదియొక్క జలపాతమునందు, నః - మనకు, పునః - తిరిగి, సంగమః - కలయిక.





**తాత్పర్యము:-** కావున ఓషధిప్రస్థమనెడి హిమవన్నగరమునుగూర్చి వివాహకార్యము సిద్ధించుటకొఱకు బయలుదేరుడు. ఈ మహాకోశియను నదీజలపాతమునందు మనకు తిరిగి కలయిక.

**పాఠాన్తరాలు:-** 1. కోశీ - కౌశీ, 2. పునరేవ - పునరస్తు.

**విభక్తులు / క్రియలు:-** 1. తత్ - అవ్యయము 2. ఓషధిప్రస్థమ్ - ఓషధిప్రస్థమ్, ఓషధిప్రస్థే, ఓషధిప్రస్థాని; అకారాన్త నపుంసకలింగ ఓషధిప్రస్థశబ్దము. ద్వి.ఏ 3. హిమవత్పురమ్ - **హిమవత్పురమ్,** హిమవత్పురే, హిమవత్పురాణి; అకారాన్త నపుంసకలింగ హిమవత్పురశబ్దము. ద్వి.ఏ. 4. సిద్ధయే - **సిద్ధయే,** సిద్ధిభ్యామ్, సిద్ధిభ్యః; ఇకారాన్త స్త్రీలింగ సిద్ధిశబ్దము. చ.ఏ. 5. ప్రయాత - క్రియ 6. అస్మిన్ - **అస్మిన్,** అనయోః, ఏషు; మకారాన్త పుంలింగ ఇదమ్‌శబ్దము. స.ఏ. 7. మహాకోశీప్రపాతే - ...**ప్రపాతే,** ...ప్రపాతయోః, ...ప్రపాతేషు; అకారాన్త పుంలింగ ...ప్రపాతశబ్దము. స.ఏ. 8. ఏవ, పునః - అవ్యయాలు 9. **నః** - మమ, ఆవయోః, నః; దకారాన్త 'అస్మ'చ్ఛబ్దము. ష.బ. 10 .సంగమః - **సంగమః,** సంగమౌ, సంగమాః; అకారాన్త పుంలింగ సంగమశబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు:-**

1. ఓషధిప్రస్థమ్ - ఓషధీనాం ప్రస్థః యస్మిన్ తద్ ఓషధిప్రస్థమ్, తత్।
2. హిమవత్పురమ్ - హిమవతః పురమ్ (ష.త.), హిమవత్పురమ్, తత్।
3. మహాకోశీప్రపాతే - మహాకోశ్యాః ప్రపాతః మహాకోశీప్రపాతః (ష.త.), తస్మిన్।

**సంధులు:-**

1. ప్రయాత + ఓషధిప్రస్థమ్ - ప్రయాతౌషధిప్రస్థమ్ - వృద్ధిసన్ధిః।
2. ...ప్రపాతే + అస్మిన్ - ...ప్రపాతే - స్మిన్ - పూర్వరూపసన్ధిః।
3. పునః + ఏవ - పునరేవ - విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1. ఓషధిః - (స్త్రీ.)**

ఎ) ఓషో దాహో దీప్తిర్వా వీయతే - త్ర। ఓష + ధా + కి।
బి) "ఫలపాకావసానాస్తు బుధైరోషధయః స్మృతాః"॥ - అని హలాయుధకోషః
సి) శ్లో॥ ఉద్భిజ్జాః స్థావరా జ్ఞేయా - బీజకణ్డప్రరోహిణః।
ఓషధ్యః ఫలాపాకాన్తా బహుపుష్పఫలోపగాః ॥ - ఇతి మనుః 1 -46

డి)1. శ్లో॥ వనేచరాణాం వనితాసఖానాం
దరీగృహోత్సఙ్గనిషక్తభాసః।
భవన్తి యత్రౌషధయో రజన్యా-
మతైలపూరాస్సురతప్రదీపాః ॥ - కు.సం. 1-10

2. శ్లో॥ **అథౌషధీనామ**ధిపస్య వృద్ధౌ
తిథౌ చ జామిత్రగుణాన్వితాయామ్।
సమేతబన్ధుర్హిమవాన్సుతాయా
వివాహదీక్షావిధిమన్వతిష్ఠత్॥ - కు.సం. 7-1

3) శ్లో॥ సరళాసక్తమాతంగ - గ్రైవేయస్ఫురితత్విషః।
**ఆసన్నోషధయో** నేతు - ర్నక్తమస్నేహదీపికాః॥
- ర.వం. 4-75

ఇ) 'దర్వివిదివేదిఖనిశాన్యశ్రివేశికృ**ష్యోషధి** కట్యఙ్గులయః।'
ఏతే స్త్రియాం స్యుః। పక్షే జీప్। దర్వీరిత్యాది। - లింగానుశాసనప్రకరణమ్।

**క్రియాదర్శము:-** 1. **ప్రయాత** - ప్ర - ఉపసర్గ, 'యా - ప్రాపణే (పొందుట) (వెళ్లుట), సకర్మకమ్, అదాదయః (2), అనిట్, పరస్మైపదీ, లోట్ - మధ్యమపురుష బహువచనాంతః।

ప్రయాహి / ప్రయాతాత్ - ప్రయాతమ్ - **ప్రయాత.**

---

**శ్లో॥ తస్మిన్ సంయమినామాద్యే - జాతే పరిణయోన్ముఖే।**
**జహుః పరిగ్రహవ్రీడాం - ప్రాజాపత్యాస్తపస్వినః॥ 34**

**పదవిభాగము:-** తస్మిన్, సంయమినామ్, ఆద్యే, జాతే, పరిణయోన్ముఖే, జహుః, పరిగ్రహవ్రీడామ్, ప్రాజాపత్యాః, తపస్వినః।

**అన్వయక్రమము:-** సంయమినామ్ ఆద్యే తస్మిన్ పరిణయోన్ముఖే జాతే (సతి) ప్రాజాపత్యాః తపిస్వనః పరిగ్రహవ్రీడాం జహుః।

**ప్రతిపదార్థము:-** సంయమినామ్ - యోగులలో, ఆద్యే - మొదటివాడగు, తస్మిన్ - ఆ శివుడు, పరిణయోన్ముఖే - వివాహమునందు ఉత్సుకత కలవాడు, జాతే (సతి) - కాగా, ప్రాజాపత్యాః - కాయకనామవివాహ సంబంధులగు, తపస్వినః

37



- సప్తర్షులు, పరిగ్రహవ్రీడామ్ - భార్యలచేత కలిగిన సిగ్గును, జహుః - వీడిరి.

**తాత్పర్యము:-** యోగులలో మొదటివాడగు ఆ శివుడు వివాహమునందు ఉత్సుకత కలవాడు కాగా కాయకనామవివాహసంబంధులగు సప్తర్షులు భార్యలచేత కలిగిన సిగ్గును వీడిరి. (అనగా సప్తర్షులు - నిత్యము యోగానుసంధానము కల్గియుండువారు.)

**పాఠాన్తరాలు:-** 1. ఉన్ముఖే -ఉత్సుకే, 2. తపస్వినః - తపోధనాః

**విభక్తులు / క్రియలు:-** 1. సంయమినామ్ - సంయమినః, సంయమినోః, **సంయమినామ్** నకారాన్త పుంలింగ సంయమిన్శబ్దము. ష.బ. 2. ఆద్యే - **ఆద్యే**, ఆద్యయోః, ఆద్యేషు; అకారాన్త పుంలింగ ఆద్యశబ్దము. స.ఏ. 3. తస్మిన్ - **తస్మిన్**, తయోః, తేషు; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. స.ఏ. 4. పరిణయోన్ముఖే - **...ఉన్ముఖే**, ...ఉన్ముఖయోః, ...ఉన్ముఖేషు; అకారాన్త పుంలింగ...ఉన్ముఖశబ్దము. స.ఏ. 5. జాతే - **జాతే**, జాతయోః, జాతేషు; అకారాన్త పుంలింగ జాతశబ్దము. స.ఏ. 6. ప్రాజాపత్యాః - ప్రాజాపత్యః, ప్రాజాపత్యౌ, **ప్రాజాపత్యాః**; అకారాన్త పుంలింగ ప్రాజాపత్యశబ్దము. ప్ర.బ. 7. తపస్వినః - తపస్వీ, తపస్వినౌ, **తపస్వినః;** నకారాన్త పుంలింగ తపస్విన్శబ్దము .ప్ర.బ. 8. పరిగ్రహవ్రీడామ్ - **...వ్రీడామ్**, ...వ్రీడే, ...వ్రీడాః; ఆకారాన్త స్త్రీలింగవ్రీడాశబ్దము. ద్వి.ఏ. 9. జహుః - క్రియ.

**సమాసాలు:-**

1. పరిణయోన్ముఖే - పరిణయస్య ఉన్ముఖః (ష.త.) పరిణయోన్ముఖః, తస్మిన్।
2. ప్రాజాపత్యాః - ప్రజానాం పతిః (ష.త.) ప్రజాపతిః, ప్రజాపతేః ఇమే (త.వృ.)।
3. పరిగ్రహవ్రీడామ్ - పరిగ్రహస్య వ్రీడా - పరిగ్రహవ్రీడా (ష.త.) తామ్।

**సంధులు:-**

1. పరిణయ + ఉన్ముఖే - పరిణయోన్ముఖే - గుణసన్ధిః।
2. ప్రాజాపత్యాః + తపస్వినః - ప్రాజాపత్యాస్తపస్వినః । విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1. ప్రాజాపత్యః -**

ఎ) [illegible] - [illegible].

శ్లో॥ సహోభౌ చరతాం ధర్మమితి వాచానుభాష్య చ।
కన్యాప్రదానమభ్యర్చ్య ప్రాజాపత్యో విధిః స్మృతః -మనుస్మృతి-3-30

శ్లో॥ ఇత్యుక్త్వా చరతాం ధర్మం సహ యా దీయతే - ర్థినే।
స కాయః పావయేత్తజ్జః షట్‌షడ్ వంశయాన్సహాత్మనా॥
- యాజ్ఞవల్క్యస్మృతి -1-60

బి) '[illegible]' [illegible] అని, ఈ శ్లోకాన్నే ఉదాహరించినాడు. - ఆప్టే

**క్రియాదర్శము:- జహుః** - 'ఓహాక్ (హా) - త్యాగే' విడుచుట, జుహోత్యాదయః (3), సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్ - ప్రథమపురుషబహువచనాంతః।

**జహౌ** - జహతుః - జహుః

---

**శ్లో॥ తతః పరమమిత్యుక్త్వా - ప్రతస్థే మునిమణ్డలమ్।**
**భగవానపి సంప్రాప్తః - ప్రథమోద్దిష్టమాస్పదమ్॥ 35**

**పదవిభాగము:-** తతః, పరమమ్, ఇతి, ఉక్త్వా, ప్రతస్థే, మునిమణ్డలమ్, భగవాన్, అపి, సంప్రాప్తః, ప్రథమోద్దిష్టమ్, ఆస్పదమ్।

**అన్వయక్రమము:-** తతః, మునిమణ్డలం పరమమ్ ఇతి ఉక్త్వా ప్రతస్థే। భగవాన్ అపి ప్రథమోద్దిష్టమ్ ఆస్పదం సంప్రాప్తః।

**ప్రతిపదార్థము:-** తతః - పిమ్మట, మునిమణ్డలమ్ - సప్తర్షులసమూహము, పరమమ్ - సరి, ఇతి - యని, ఉక్త్వా - పలికి, ప్రతస్థే - బయలుదేరెను. భగవాన్ + అపి - పూజ్యుడగు శివభగవానుడును, ప్రథమోద్దిష్టమ్ - తొలుత చెప్పబడిన, ఆస్పదమ్ - స్థానమునుగూర్చి, సంప్రాప్తః - పోయెను.

**తాత్పర్యము:-** పిమ్మట సప్తర్షులసమూహము సరియని పలికి బయలుదేరెను. పూజ్యుడగు శివభగవానుడును తొలుత చెప్పబడిన స్థానమును (మహాకోశీ ప్రపాతము) గూర్చి పోయెను.

**పాఠాన్తరాలు:-** 1. పరమమ్ - ప్రమాణమ్ 2. సంప్రాప్తః - సంక్రాన్తః 3. ఆస్పదమ్ - ఆశ్రయమ్.

**విభక్తులు / క్రియలు:-** 1. తతః - అవ్యయము 2. మునిమణ్డలమ్ - **మునిమణ్డలమ్,** మునిమణ్డలే, మునిమణ్డలాని; అకారాన్త నపుంసకలింగ మునిమణ్డలశబ్దము. ప్ర.ఏ. 3. పరమమ్ - అవ్యయము 4. ఇతి, అపి - అవ్యయాలు 5. ఉక్త్వా - అవ్యయము 6. ప్రతస్థే - క్రియ 7. భగవాన్ - **భగవాన్,** భగవన్తౌ, భగవన్తః; తకారాన్తపుంలింగభగవత్‌శబ్దము. ప్ర.ఏ. 8. ప్రథమోద్దిష్టమ్ - ప్రథమోద్దిష్టమ్, ప్రథమోద్దిష్టే, ప్రథమోద్దిష్టాని; అకారాన్త నపుంసకలింగ ప్రథమోద్దిష్టశబ్దము. ద్వి.ఏ. 9. ఆస్పదమ్ - **ఆస్పదమ్,** ఆస్పదే, ఆస్పదాని; అకారాన్త నపుంసకలింగ ఆస్పదశబ్దము. ద్వి.ఏ. 10. సంప్రాప్తః - సంప్రాప్తః, సంప్రాప్తౌ, సంప్రాప్తాః; అకారాన్త పుంలింగ సంప్రాప్తశబ్దము. ప్ర.ఏ. ,





**సమాసాలు:-**

1. మునిమణ్డలమ్ - మునీనాం మణ్డలమ్ (ష.త.), మునిమణ్డలమ్।
2. ప్రథమోద్దిష్టమ్ - ప్రథమమ్ ఉద్దిష్టమ్ - ప్రథమోద్దిష్టమ్ (కర్మధా.) తత్।

**సంధులు:-**

1. ఇతి + ఉక్త్వా - ఇత్యుక్త్వా - యణాదేశసన్ధిః।
2. ప్రథమ + ఉద్దిష్టమ్ - ప్రథమోద్దిష్టమ్ - గుణసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1. భగవాన్ - (త్) - (త్రి.)**

ఎ) భగః 'ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః। జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీఙ్గనా' ఇత్యుక్తలక్షణం షడైశ్వర్యమస్యస్యేతి।

బి) భగ + నిత్యయోగే మతుప్, మస్య వః।

సి) "తత్రభవాన్ భగవానితి శబ్దో వృద్ధైః ప్రయుజ్యతే పూజ్యైః।" - అని హలాయుధకోశము

డి) "శ్లో॥ **భగవానపి** తా రాత్రీః శరదోత్ఫుల్లమల్లికాః।
వీక్ష్య రన్తుం మనశ్చక్రే యోగమాయాముపాశ్రితః॥" - ఇతి భాగవతే

ఇ) "శ్లో॥ నివేదనః సుఖాజాతః సుగన్ధారో మహాధనుః।
గన్ధపాలీ చ **భగవాన్** ఉత్థానః సర్వకర్మణామ్॥"
- ఇతి మహాభారతే 13-17-127

ఎఫ్) " అథ భగవాన్ కుశలీ కశ్యపః" - ఇతి శాకున్తలే -5

జి) శ్లో॥ ప్రకాశచన్ద్రోదయనష్టదోషః
ప్రవృత్తరక్షః పిశితాశదోషః।
రామాభిరామేరితచిత్తదోషః
స్వర్గప్రకాశో **భగవాన్** ప్రదోషః॥

"పూజ్యమైన ప్రదోషసమయము స్వర్గమువంటి ప్రకాశము గలదాయెను."

హెచ్) "ఉత్పత్తిం చ వినాశం చ భూతానామాగతిం గతిమ్।
వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి॥"

**క్రియాదర్శము:–** **ప్రతస్థే** – ప్ర – పూర్వకాత్ 'ష్ఠా గతినివృత్తౌ' విత్యస్మద్ధాతో స్సకర్మకాత్ కర్తరిభూతే లిట్ ఆత్మనేపదీ ప్రథమపురుషైకవచనాంతః।

**ప్రతస్థే** – ప్రతస్థాతే – ప్రతస్థిరే.

శ్లో॥ స గుప్తమూలప్రత్యన్తః శుద్ధపార్ష్ణిర్రయాన్వితః।
షడ్విధం బలమాదాయ – **ప్రతస్థే** దిగ్జిగీషయా॥ – ర.వం. 4–26

---

**శ్లో॥ తే చాకాశమసిశ్యామ – ముత్పత్య పరమర్షయః।**
**ఆసేదురోషధిప్రస్థం – మనసా సమరంహసః॥ 36**

**పదవిభాగము:–** తే, చ, ఆకాశమ్, అసిశ్యామమ్, ఉత్పత్య, పరమర్షయః, ఆసేదుః , ఓషధిప్రస్థమ్, మనసా, సమరంహసః।

**అన్వయక్రమము:–** మనసా సమరంహసః తే పరమర్షయః చ అసిశ్యామమ్ ఆకాశమ్ ఉత్పత్య ఓషధిప్రస్థమ్ ఆసేదుః।

**ప్రతిపదార్థము:–** మనసా – మనస్సుతో, సమరంహసః – సమానమైన వేగము కలవారైన, తే – ఆ, పరమర్షయః చ – సప్తర్షులును, అసిశ్యామమ్ – కత్తివలె నల్లనిదైన, ఆకాశమ్ – ఆకాశమునుగూర్చి, ఉత్పత్య – ఎగసి, ఓషధిప్రస్థమ్ – ఓషధిప్రస్థమను హిమవన్నగరమును, ఆసేదుః – చేరిరి.

**తాత్పర్యము:–** మనస్సుతో సమానమైన వేగముకలవారైన ఆ సప్తర్షులును కత్తివలె నల్లనిదైన ఆకాశమునుగూర్చి ఎగసి ఓషధిప్రస్థమను హిమవన్నగరమును చేరిరి.

**పాఠాన్తరాలు:–** 1. తే చాకాశ – అథాకాశ 2. పరమర్షయః – మునిపుంగవాః

**విభక్తులు / క్రియలు:–** 1. మనసా – మనసా, మనోభ్యామ్, మనోభిః; సకారాన్త నపుంసకలింగ మనశ్శబ్దము. తృ.ఏ. 2. సమరంహసః – సమరంహాః, సమరంహసౌ, **సమరంహసః;** సకారాన్త పుంలింగ సమరంహస్‌శబ్దము .ప్ర.బ 3. తే – సః, తౌ, **తే;** దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.బ. 4. పరమర్షయః – పరమర్షిః, పరమర్షీ, **పరమర్షయః;** ఇకారాన్త పుంలింగ పరమర్షిశబ్దము. ప్ర.బ. 5. అసిశ్యామమ్ – **అసిశ్యామమ్**, అసిశ్యామౌ, అసిశ్యామాన్; అకారాన్త పుంలింగ అసిశ్యామశబ్దము. ద్వి.ఏ. 6. ఆకాశమ్ – **ఆకాశమ్**, ఆకాశౌ, అకాశాన్; అకారాన్త పుంలింగ ఆకాశశబ్దము. ద్వి.ఏ. 7. ఉత్పత్య – అవ్యయము 8. ఓషధిప్రస్థమ్ – **ఓషధిప్రస్థమ్**, ఓషధిప్రస్థే, ఓషధిప్రస్థాన్; అకారాన్త పుంలింగ ఓషధిప్రస్థశబ్దము. ద్వి.ఏ. 9. ఆసేదుః – క్రియ.



**సమాసాలు:–**

1. సమరంహసః – సమం రహః యేషాం (బహువ్రీహి) తే సమరంహసః।
2. పరమర్షయః – పరమాశ్చ తే ఋషయశ్చ (కర్మధా.) పరమర్షయః।
3. అసిశ్యామమ్ – అసిః ఇవ శ్యామః అసిశ్యామః (కర్మధా.) తమ్। 'ఉపమానాని సామాన్యవచనైః' ఇతి సమాసః।

**సంధులు:–**

1. చ + ఆకాశమ్ – చాకాశమ్ – సవర్ణదీర్ఘసన్ధిః।
2. ఆసేదుః + ఓషధిప్రస్థమ్ – ఆసేదురోషధిప్రస్థమ్ – విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు**

**1. అసిః –**

ఎ)1) అసతీతి, అస్ దీప్తౌ, ఇన్।
2) అస్యతే క్షిప్యతే, అస్ – ఇన్।

బి) శ్లో॥ నిస్త్రింశః కరవాలః ఖడ్గః కౌక్షేయకః కృపాణః స్యాత్।
రిష్టి**రసి**చన్ద్రహాసౌ తరవారిర్మణ్డలాగ్రం చ ॥ 472
– అని హలాయుధకోశము '10' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ పర్ణశాలామథ క్షిప్రం – వికృ**ష్టాసిః** ప్రవిశ్య సః।
వైరూప్యపౌనరుక్త్యేన – భీషణాం తామయోజయత్॥ – ర.వం. 12–40

"...సీతారాములకెట్టి కీడును చేయునో అన్న భావముచేత, లక్ష్మణుడు ఖడ్గపాణియై శీఘ్రముగా పర్ణశాలను చేరి, భయంకరరూపముతో అచటనున్న శూర్పణఖయొక్క ముక్కు, చెవులను ఛేదించి, వికృతముగనున్నదానిని మరింత వికృతరూపిణిగ చేసెను.

డి) శ్లో॥ "అసిర్విశసనః ఖడ్గస్తీక్ష్ణధారో దురాసదః।
శ్రీగర్భో విజయశ్చైవ ధర్మపాలో నమో – స్తుతే॥" – ఇతి వారాహీతన్త్రమ్

**క్రియాదర్శము:– ఆసేదుః** – ఆజ్ – ఉపసర్గ, 'షద్ – విశరణగత్యవసాదనేషు' లిట్ – ప్రథమపురుషబహువచనాంతః।

అససాద, అసేదతుః, **ఆసేదుః**

---

**అవతారికా:–** ఇతఃపరం దశభిః శ్లోకైరోషధిప్రస్థమేవ వర్ణయతి।
ఇటునుండి 10 శ్లోకములలో ఓషధిప్రస్థమునే వర్ణించుచున్నాడు.

**శ్లో॥ అలకామతివాహ్యైవ - వసతిం వసుసమ్పదామ్।**
**స్వర్గాభిష్యన్దవమనం - కృత్వేవోపనివేశితమ్॥ 37**

**పదవిభాగము:-** అలకామ్, అతివాహ్య, ఏవ, వసతిమ్, వసుసమ్పదామ్, స్వర్గాభిష్యన్దవమనమ్, కృత్వా, ఇవ, ఉపవేశితమ్।

**అన్వయక్రమము:-** వసుసమ్పదాం వసతిమ్ అలకామ్ అతివాహ్య ఏవ, స్వర్గాభిష్యన్దవమనం కృత్వా ఇవ ఉపవేశితమ్ ఓషధిప్రస్థమ్ ఆసేదుః ఇతి పూర్వేణాన్వయః।

**ప్రతిపదార్థము:-** వసుసమ్పదామ్ - ధనసమృద్ధులకు, వసతిమ్ - నిలయమైన, అలకామ్ - (కుబేరుని రాజధానియగు) అలకానగరమును, అతివాహ్య+ ఏవ- అతిక్రమించి, స్వర్గాభిష్యన్దవమనమ్ - స్వర్గాతిరిక్తజనమును వెడలించుటకును, కృత్వా - చేసి, ఏవ - దీటుగా, ఉపవేశితమ్ ఇవ - నిర్మింపబడినదివలె నున్న, ఓషధిప్రస్థమ్, ఆసేదుః, ఇతి పూర్వేణాన్వయః।

**తాత్పర్యము:-** ధనసమృద్ధులకు నిలయమైన అలకానగరమును అతిక్రమించి స్వర్గాతిరిక్తజనమును వెడలించుటకు దీటుగాచేసి నిర్మింపబడినదివలె నున్న - ఓషధిప్రస్థమును చేరిరి.

**పాఠాన్తరాలు:-** 1. ఏవ - ఇవ, 2. వసు - బహు 3. ...ష్యన్దవమనం - ...స్యన్దివమనం, ...స్యన్దిరమణమ్

**విభక్తులు / క్రియలు:-** 1. వసుసంపదామ్ - వసుసంపదః, వసుసంపదోః, **వసుసమ్పదామ్** ; దకారాన్త స్త్రీలింగ ...సమ్పద్‌శబ్దము. ష.బ. 2. వసతిమ్ - వసతిమ్, వసతీ, వసతీః; ఇకారాన్త స్త్రీలింగ వసతిశబ్దము. ద్వి.ఏ. 3. అలకామ్ - అలకామ్, అలకే, అలకాః; ఆకారాన్త స్త్రీలింగ అలకాశబ్దము. ద్వి.ఏ. 4. అతివాహ్య, ఇవ, కృత్వా - అవ్యయాలు 5. స్వర్గాభిష్యన్దవమనమ్ - ...వమనమ్, ...వమనౌ, **...వమనాన్**; అకారాన్త పుంలింగ ...వమనశబ్దము. ద్వి.ఏ. 6. ఉపవేశితమ్ **- ఉపవేశితమ్**, ఉపవేశితౌ, ఉపవేశితాన్; అకారాన్త పుంలింగ ఉపవేశితశబ్దము. ద్వి.ఏ. 7. ఓషధిప్రస్థమ్ - **ఓషధిప్రస్థమ్,** ఓషధిప్రస్థౌ, ఓషధిప్రస్థాన్; అకారాన్త పుంలింగ ఓషధిప్రస్థశబ్దము. ద్వి.ఏ. 8. ఆసేదుః - క్రియ.

**సమాసాలు:-**

1. వసుసంపదామ్ - వసూనాం సంపదః - (ష.త.) వసుసంపదః, తాసామ్।
2. స్వర్గాభిష్యన్దవమనమ్ - స్వర్గస్య అభిష్యన్దః, స్వర్గాభిష్యన్దః (ష.త.) స్వర్గాభిష్యన్దస్య వమనమ్ (ష.త.), స్వర్గాభిష్యన్దవమనమ్। తత్।





**సంధులు:-**

1. అతివాహ్య + ఏవ - అతివాహ్యైవ - వృద్ధిసన్ధిః।
2. కృత్వా + ఇవ - కృత్వేవ - గుణసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1. అభిష్యన్దః -**

అత్ర అభిష్యన్దశబ్దో భోజరాజేన వ్యాఖ్యాతః -
శ్లో॥ ద్వావభిష్యన్దనిష్యన్దౌ సారే నిష్పీడనోద్భవే।
వ్యవస్థితాదభ్యధికో **- ష్యభిష్యన్దో** జనాదికః॥ ఇతి

అత్ర తు ధనం వివక్షితమ్ । అత ఏవాదిశబ్దప్రయోగః। అత్ర వైశ్రవణాలయస్య పరదేశత్వం స్వర్గస్య స్వదేశత్వం చ గమ్యతే, తేన చ వైశ్రవణో **-** పి హిమవదపేక్షయా న్యూనః, స్వర్గసంపదపి తదాయత్తేతి చ ధ్వన్యతే।

యథాహ కౌటిల్యః -

"భూతపూర్వమభూతపూర్వం వా జనపదం పరదేశాపవాహనేన **స్వదేశాభిష్యన వమనేన** వా నివేశయేద్" ఇతి। - 'వివరణమ్' వ్యాఖ్యాయామ్

**అలంకారాలు:-** అత్ర హిమవత్పురస్య ధనపరిపూర్ణత్వదర్శనాదుత్ప్రేక్షాద్వయమ్।

వైశ్రవణాలమభిభూమ తత్రస్థాః సంపదః సమానీయ విరచితమివేత్యేకా। స్వర్గాదతిరిక్తాః సంపదః సమానీయ విరచితమివేత్యన్యా। ద్వివిధా హి నయవిదాం ప్రవృత్తిః।

**క్రియాదర్శము:-** 1. ఆసేదుః - ఆఙ్ - ఉపసర్గ, 'షద్ - విశరణగత్యవసాదనేషు' (నశించుట, గమనము, చంపుట) 1. అకర్మకమ్, 2,3. సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, తుదాదిప్రకరణమ్(6), లిట్ - ప్రథమపురుషబహువచనాంతః।

ఆససాద - ఆసేదతుః - **ఆసేదుః**

---

**శ్లో॥ గఙ్గాస్రోతఃపరిక్షిప్తం - వప్రాన్తర్జ్వలితౌషధి।**
**బృహన్మణిశిలాసాలం - గుప్తావపి మనోహరమ్॥ 38**

**పదవిభాగము:-** గఙ్గాస్రోతఃపరిక్షిప్తమ్, వప్రాన్తర్జ్వలితౌషధి, బృహన్మణిశిలాసాలమ్, గుప్తౌ, అపి, మనోహరమ్।

**అన్వయక్రమము:-** గఙ్గాస్రోతఃపరిక్షిప్తం వప్రాన్తర్జ్వలితౌషధి బృహన్మణిశిలాసాలం గుప్తౌ అపి మనోహరమ్ ఓషధిప్రస్థమ్ ఆసేదుః, ఇతి పూర్వేణాన్వయః।

**ప్రతిపదార్థము:-** గఙ్గాస్రోతఃపరిక్షిప్తమ్ - గంగానదీప్రవాహములతో చుట్ట బడినదియు, వప్రాన్తర్జ్వలితౌషధి - ప్రాకారముయొక్క లోపల ప్రకాశించుచున్న తరుగుల్మలతాతృణాదులు కలిగినదియు, బృహన్మణిశిలాసాలమ్ - గొప్పవగు మాణిక్యప్రాకారములు గలదియు, గుప్తౌ + అపి - సంవృతమయ్యును, మనోహరమ్ - సుందరమును అగు, ఓషధిప్రస్థమ్ ఆసేదుః ఇతి పూర్వేణాన్వయః

**తాత్పర్యము:-** గంగానదీ ప్రవాహములతో చుట్టబడినదియు, ప్రాకారములోపల ప్రకాశించుచున్న తరుగుల్మలతాతృణాదులు కలదియు, గొప్పవగు మాణిక్య ప్రాకారములు గలదియు, సంవృతమయ్యును సుందరమును అగు - ఓషధి ప్రస్థమను హిమవన్నగరమును చేరిరి.

**విభక్తులు / క్రియలు:-** 1. గఙ్గాస్రోతఃపరిక్షిప్తమ్ - **...పరిక్షిప్తమ్**, ..పరిక్షిప్తే, ...పరిక్షిప్తాని ; అకారాన్త నపుంసకలింగ ...పరిక్షిప్తశబ్దము. ద్వి.ఏ. 2. వప్రాన్తర్జ్వలితౌషధి - **...ఓషధి**, ...ఓషధినీ, ...ఓషధీని; ఇకారాన్త నపుంసకలింగ ...ఓషధిశబ్దము. ద్వి.ఏ. 3. బృహన్మణిశిలాసాలమ్ - **...సాలమ్,** ...సాలే, ...సాలాని; అకారాన్త నపుంసకలింగ...సాలశబ్దము. ద్వి.ఏ. 4. గుప్తౌ - **గుప్తౌ,** గుప్త్యోః, గుప్తిషు; ఇకారాన్త నపుంసకలింగ గుప్తిశబ్దము. స.ఏ. 5. మనోహరమ్ - **మనోహరమ్,** మనోహరే, మనోహరాణి; అకారాన్త నపుంసకలింగ మనోహరశబ్దము. ద్వి.ఏ. 6. అపి - అవ్యయము

**సమాసాలు:-**

1. గఙ్గాస్రోతఃపరిక్షిప్తమ్ - గంగాయాః స్రోతాంసి గంగాస్రోతాంసి, తైః పరిక్షిప్తమ్, గంగాస్రోతఃపరిక్షిప్తమ్, (ష.త.)
2. వప్రాన్తర్జ్వలితౌషధి - వప్రస్య అంతః (ష.త.) వప్రాంతః వప్రాంతే జ్వలితాః ఓషధయః యస్య (బహువ్రీహి) తత్, వప్రాంతర్జ్వలితౌషధి తత్।
3. బృహన్మణిశిలాసాలమ్ - మణీనాం శిలాః (ష.త.) మణిశిలాః, మణిశిలానామ్ సాలః (ష.త.) మణిశిలాసాలః, బృహద్ మణిశిలాసాలః యస్య (బహువ్రీహి) తత్, బృహన్మణిశిలాసాలమ్ తత్।
4. మనోహరమ్ - మనసః హరమ్ - మనోహరమ్।

**సంధులు:-**

1. గుప్తౌ + అపి - గుప్తావపి - **యాన్తాదేశవాన్తాదేశసన్ధయః**



**ఏచో - యవాయావః** (సూ. 6-1-78). ఏఓఐఔలకు అచ్చుపరముగా నున్నప్పుడు క్రమముగా అయ్, అవ్, ఆయ్, ఆవ్ ఆదేశముగ వచ్చును.

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1. వప్రమ్ :- (నపుం.) (పుం.)** - ఎ) ఉప్యతే - త్రేతి। వప్ + 'వృద్ధివపిభ్యాం రన్' ఇతి రన్। ఉణాదిసూత్రమ్ 2-281। 'డువప్ - బీజసన్తానే'+ రన్।

బి శ్లో॥ ...వప్రం క్షేత్రం చ కేదారమ్ ॥ అని హలాయుధకోశము

సి) శ్లో॥ స వేలా**వప్ర**వలయాం పరిఖీకృతసాగరామ్।
అనన్యశాసనామూర్వీం శశా సైకపురీమివ॥ - ర.వం. 1-30

'ఆ దిలీపుడు సాగరపుచెలియలికట్టయే కోట **ప్రహరీగోడగాను,** సముద్రమే అగడ్తగా కల, ఇతరరాజులచే పాలింపబడనిదియును అగు భూమండలము నంతటిని, ఒకే ఒక్క పురమునువలె, ఏలెను'

**అలంకారాలు:-** ఇందు 'వ్యతిరేకాలంకార'మున్నదని చెప్పదగును.
**"వ్యతిరేకో విశేషశ్చేదుపమేయోపమానయోః"** అని చంద్రాలోకలక్షణము. ఉపమేయోపమానములకు పోలికతోబాటు, భేదమును కూడా చెప్పినయెడల "వ్యతిరేకాలంకార"మగును. దాగియున్నను మనోహరమైనదని వర్ణింపబడుటచే వ్యతిరేకము ధ్వన్యమగుచున్న దిచట.

---

**శ్లో॥ జితసింహభయా నాగా - యత్రాశ్వా బిలయోనయః**
**యక్షాః కింపురుషాః పౌరా - యోషితో వనదేవతాః॥ 39**

**పదవిభాగము:-** జితసింహభయాః, నాగాః, యత్ర, అశ్వాః, బిలయోనయః, యక్షాః, కింపురుషాః, పౌరాః, యోషితః, వనదేవతాః।

**అన్వయక్రమము:-** యత్ర నాగా జితసింహభయాః అశ్వాః బిలయోనయః, యక్షాః కింపురుషాః పౌరాః, వనదేవతాః యోషితః (సన్తి)।

**ప్రతిపదార్థము:-** యత్ర - ఎచట, నాగాః - ఏనుగులు, జితసింహభయాః - జయింపబడిన సింహములవలన భయము కలవియో, అశ్వాః - గుఱ్ఱములు, బిలయోనయః - కొండగుహలు ఉత్పత్తి స్థానములుగా కలవియో, యక్షాః -

యక్షులు, కింపురుషాః – కిన్నరులు, పౌరాః – పురజనులో, వనదేవతాః – వనదేవతలు, యోషితః – స్త్రీలో

**తాత్పర్యము:–** ఎచట ఏనుగులు జయింపబడిన సింహములవలన భయము కలవియో, గుఱ్ఱములు కొండగుహలు ఉత్పత్తిస్థానముగా కలవియో, యక్షులు, కిన్నరులు పురజనులో, వనదేవతలు స్త్రీలో (అట్టి ఓషధిప్రస్థము.)

**పాఠాన్తరాలు:–** 1. జిత – వీత, 2. యక్షాః కిమ్పురుషాః – యక్షకిమ్పురుషాః

**విభక్తులు / క్రియలు:–** 1. యత్ర – అవ్యయము 2. నాగాః – నాగః, నాగౌ, **నాగాః**; అకారాన్త పుంలింగ నాగశబ్దము. ప్ర.బ. 3. జితసింహభయాః – **...భయః**, ...భయౌ, ...భయాః; అకారాన్త పుంలింగ ...భయశబ్దము. ప్ర.బ. 4. అశ్వాః – అశ్వః, అశ్వౌ, **అశ్వాః**; అకారాన్త పుంలింగ అశ్వశబ్దము. ప్ర.బ. 5. బిలయోనయః – బిలయోనిః, బిలయోనీ, **బిలయోనయః**; ఇకారాన్త పుంలింగ బిలయోనిశబ్దము ప్ర.బ. 6. యక్షాః – యక్షః, యక్షౌ, **యక్షాః**; అకారాన్త పుంలింగ యక్షశబ్దము. ప్ర.బ. 7. కింపురుషాః – కింపురుషః, కింపురుషౌ, **కింపురుషాః**; అకారాన్త పుంలింగ కింపురుషశబ్దము. ప్ర.బ. 8. పౌరాః – పౌరః, పౌరౌ, **పౌరాః**; అకారాన్త పుంలింగ పౌరశబ్దము. ప్ర.బ. 9. వనదేవతాః – వనదేవతా, వనదేవతే, **వనదేవతాః**; ఆకారాన్త స్త్రీలింగ దేవతాశబ్దము. ప్ర.బ. 10. యోషితః – యోషిత్, యోషితౌ, **యోషితః**; తకారాన్త స్త్రీలింగ యోషిత్‌శబ్దము ప్ర.బ.

**సమాసాలు:–**

1. జితసింహభయాః – సింహేభ్యః భయమ్ (పం.త.) సింహభయమ్। జితం సింహభయమ్ యేషాం తే (బహువ్రీహి)।
2. బిలయోనయః – బిలాని యోనిః యేషాం (బహువ్రీహి) తే, బిలయోనయః
3. కింపురుషాః – కుత్సితాశ్చ తే పురుషాశ్చ, (గతిసమాసః) కింపురుషాః।
4. వనదేవతాః – వనే దేవతాః (స.త.) వనదేవతాః।

**సంధులు:–**

1. జితసింహభయాః + నాగాః – జితాసింహభయా నాగాః – విసర్గలోపః।
2. నాగాః + యత్ర – నాగా యత్ర – విసర్గలోపః।
3. యత్ర + అశ్వాః – యత్రాశ్వాః – సవర్ణదీర్ఘసన్ధిః।
4. అశ్వా + బిలయోనయః – అశ్వా బిలయోనయః – విసర్గలోపః।
5. పౌరాః + యోషితః – పౌరా యోషితః – విసర్గలోపః।
6. యోషితః+ వనదేవతాః – యోషితో వనదేవతాః – ఉత్వాదేశః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. అశ్వః –** ఎ) అశ్నుతే మార్గం వ్యాప్నోతి ఇతి అశ్వః। అశూ వ్యాప్తౌ,

42



అశూప్రుషిలటితి క్వన్। ఉణాదిసూత్రమ్ – 1-149

బి) శ్లో॥ అర్వా గన్ధర్వో - శ్వః సప్తిర్వాజీ తురంగమస్తురగః।
తారో హరిస్తురఙ్గో యుయురుక్తో ఘోటకో హయో వాహః॥ – అని హలాయుధకోశము '14' నామములను అందించినది.

సి) శ్లో॥ అమ్మృతాద్ బాష్పతో వహ్నేర్వేదేభ్యో - ణ్డాచ్చ గర్భతః।
సామ్నో హయానుముత్పత్తిః **సప్తధా** పరికీర్తితా॥

డి) శ్లో॥ అతో - యమశ్వః కపిలానుసారిణా
పితుస్త్వదీయస్య మయా - పహారితః।
అలం ప్రయత్నేన తవాత్ర మా నిధాః
పదం పదవ్యాం సగరస్య సన్తతేః॥ – ర.వం. 3-50

"నీ తండ్రిచేయు యాగమునకు సంబంధించి ఈ **అశ్వమును,** కపిలమహర్షితో సమానుడైన, నేను అపహరించితిని. ఇంక ఈ అశ్వరక్షణ విషయమునందు నీ ప్రయత్నము చాలును. సగరునిసంతానము పయనించినమార్గమందు నీవు కాలూనకుము.

ఎఫ్) అశ్వములగతి విశేషములు

శ్లో॥ ప్రథమా **విక్రమా** ధారా – ద్వితీయా **పులకా** మతా।
తృతీయా **పూర్ణకణ్ఠీ** తు – చతుర్థీ **త్వరితా** స్మృతా।
పంచమీ చైవ యా ధారా **నిరాలంబా** ప్రకీర్తితా॥

జి) వీపు, ఱొమ్ము, ముఖము, పక్కలు – వీనియందు మంచి సుళ్లుగల గుఱ్ఱము 'పంచభద్ర'మని పిలువబడును.

హెచ్) పెక్కు వివరములకు ఇటీవల కాలములో 'డా॥సూర్యదేవర రవికుమార్'గారి సంపాదకత్వమున వెలువడిన పద్యకావ్యము **'హయలక్షణవిలాసము'**ను చూడగలరు.

---

**శ్లో॥ శిఖరాసక్తమేఘానాం – వ్యజ్యన్తే యత్ర వేశ్మనామ్।**
**అనుగర్జితసందిగ్ధాః – కరణైర్మురజస్వనాః॥ 40**

**పదవిభాగము:–** శిఖరాసక్తమేఘానామ్, వ్యజ్యన్తే, యత్ర, వేశ్మనామ్, అనుగర్జితసందిగ్ధాః, కరణైః, మురజస్వనాః।

**అన్వయక్రమము:-** యత్ర శిఖరాసక్తమేఘానాం వేశ్మనామ్ అనుగర్జితసందిగ్ధాః మురజస్వనాః కరణైః వ్యజ్యన్తే।

**ప్రతిపదార్థము:-** యత్ర - ఎచట, శిఖరాసక్తమేఘానామ్ - పై కప్పులయందు తగులుకొన్న మబ్బులు గలవైన, వేశ్మనామ్ - భవనములకు, అనుగర్జితసందిగ్ధాః - ప్రతిధ్వనులతో తుల్యమైన, మురజస్వనాః - మద్దెల మ్రోతలు, కరణైః - తాడనములచే, వ్యజ్యన్తే - తెలియజేయబడుచున్నవో.

**తాత్పర్యము:-** ఎచట పైకప్పులయందు తగులుకొన్న మబ్బులుగలవైన భవనములకు ప్రతిధ్వనులతో తుల్యమైన మద్దెల మ్రోతలు తాడనములచే తెలియజేయబడుచున్నవో.

**పాఠాన్తరాలు:-** 1.వేశ్మనామ్ - వేశ్మసు 2. అనుగర్జిత - మన్ద్రగర్జిత 3. మురజ - మురవ

**విభక్తులు / క్రియలు:-** 1. శిఖరాసక్తమేఘానామ్ - ...మేఘస్య, ...మేఘయోః, **...మేఘానామ్** అకారాన్త పుంలింగ ...మేఘశబ్దము. ష.బ. 2. వేశ్మనామ్ - వేశ్మనః, వేశ్మనోః, **వేశ్మనామ్**; నకారాన్త పుంలింగ వేశ్మన్‌శబ్దము. ష.బ. 3. అనుగర్జితసందిగ్ధాః - ...సందిగ్ధః, ...సందిగ్ధౌ, **సందిగ్ధాః**; అకారాన్త పుంలింగ సందిగ్ధశబ్దము. ప్ర.బ. 4. మురజస్వనాః - ...స్వనః, ...స్వనౌ, **...స్వనాః**; అకారాన్త పుంలింగ ...స్వనశబ్దము. ప్ర.బ. 5. కరణైః - కరణేన, కరణాభ్యామ్, **కరణైః**; అకారాన్త నపుంసకలింగ కరణశబ్దము. తృ.బ. 6. వ్యజ్యన్తే - క్రియ - కర్మణి.

**సమాసాలు:-**

1. శిఖరాసక్తమేఘానామ్ - శిఖరేషు ఆసక్తాః (స.త.) శిఖరాసక్తాః, శిఖరాసక్తాః మేఘాః యేషాం (బహువ్రీహి) తే, శిఖరాసక్తమేఘాః తేషామ్।
2. అనుగర్జితసందిగ్ధాః - అనుగర్జితైః సందిగ్ధాః (తృ.త.) అనుగర్జితసందిగ్ధాః
3. మురజస్వనాః - మురజానాం స్వనాః (ష.త.) మురజస్వనాః।

సంధులు:-

1. శిఖర + ఆసక్త - శిఖరాసక్త - సవర్ణదీర్ఘసన్ధిః।
2. కరణైః + మురజస్వనాః - కరణైర్మురజస్వనాః - విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1. మురజః - (పుం.)**

ఎ) మురాత్ సంవేష్టనాత్ జాతః అసౌ। ముర + జన్ + డః మృదఙ్గః।

బి) ...మృదఙ్గో మురజః స్మృతః। - అని హలాయుధకోశము (97)





సి) శ్లో॥ **మురజ**పణవమేఘఘోషవద్ దశరథ వేశ్మ బభూవ యత్పురా।
విలపితపరిదేవనాకులం వ్యసనగతం తదభూత్ సుదుఃఖితమ్॥
- ఇతి రామాయణే 2-39-41

డి) శ్లో॥ సానన్దం నన్దిహస్తాహత**మురజ**రవాహూతకౌమారబర్హి-
త్రాసాన్నాసాగ్రరన్ధ్రం విశతి ఫణిపతౌ భోగసంకోచభాజి।
గణ్డోడ్డీనాలిమాలాముఖరితకకుభస్తాణ్డవే శూలపాణే -
ర్వైనాయక్యశ్చిరం వో వదనవిధుతయః పాన్తు చీత్కారవత్యః॥
- ఇతి మాలతీమాధవే 1-1

ఇ) శ్లో॥ ధైర్యావలంబినమపి త్వరయతి మాం మురజవాద్యరవో - యమ్।
అవతరతః సిద్ధిపథం శబ్దః స్వమనోరథస్యేవ॥ 22
- ఇతి మాళవికాగ్నిమిత్రే - ప్రథమాఙ్కే.

ఎఫ్) శ్లో॥ నృత్తవాదిత్రగీతానాం ప్రయోగవశభేదినామ్।
సంస్థానం తాడనం రోధః కరణాని ప్రచక్షతే॥
- ఇతి **రాజకన్దర్పనామ** సంగీతశాస్త్రే- అని 'వివరణవ్యాఖ్య' పేర్కొన్నది.

**అలంకారాలు:-** అత్ర నిశ్చయాన్తః సందేహాలంకారః। తల్లక్షణం యథా-
శ్లో॥ "సందేహః ప్రాకృతే - న్యస్య సంశయః ప్రతిభోత్థితః।
శుద్ధో నిశ్చయగర్భో - సౌ నిశ్చయాన్త ఇతి త్రిధా॥" ఇతి।

**క్రియాదర్శము:-** 1. **వ్యజ్యన్తే** - వి -ఉపసర్గ, 'అఞ్జూ - వ్యక్తిమ్రక్షణకాన్తిగతిషు' (వ్యక్తపరచుట, పూనుకొనుట, ప్రకటించుట, గమనము) సకర్మకమ్, వేట్, పరస్మైపదీ, కర్మణి, రుదాదిప్రకరణమ్, లిట్ - ప్రథమపురుషబహువచనాంతః
వ్యజ్యతే - వ్యజ్యేతే - **వ్యజ్యన్తే.**

---

**శ్లో॥ యత్ర కల్పద్రుమైరేవ - విలోలవిటపాంశుకైః।**
**గృహయన్త్రపతాకాశ్రీ - రపౌరాదరనిర్మితా॥ 41**

**పదవిభాగము:-** యత్ర, కల్పద్రుమైః, ఏవ, విలోలవిటపాంశుకైః, గృహయన్త్ర పతాకాశ్రీః, అపౌరాదరనిర్మితా।

**అన్వయక్రమము:–** యత్ర విలోలవిటపాంశుకైః కల్పద్రుమైః ఏవ అపౌరాదరనిర్మితా గృహయన్త్రపతాకాశ్రీః (సంభవతి)।

**ప్రతిపదార్థము:–** యత్ర – ఎచట, విలోలవిటపాంశుకైః – కదలుచున్న కొమ్మల యందలి వస్త్రములుగల, కల్పద్రుమైః ఏవ – కల్పవృక్షములచేతనే, అపౌరాదర నిర్మితా – పౌరప్రయత్నము లేకుండానే నిర్మితమైన, గృహయంత్ర పతాకాశ్రీః – గృహములయందలి ఆధారదారువులందుండు జెండాలశోభ (సంభవతి – సమకూడునో)

**తాత్పర్యము:–** ఎచట కదులుచున్న కొమ్మలయందలి వస్త్రములుగల కల్పవక్షములచేతనే పౌరప్రయత్నములేకయే నిర్మితమైన గృహములయందలి ఆధారదారువులందుండు జెండాలశోభ సమకూడునో.

**పాఠాన్తరాలు:–** 1. గృహయన్త్ర – గృహద్వార.

**విభక్తులు / క్రియలు :** 1. విలోలవిటపాంశుకైః – ...అంశుకేన, ...అంశుకాభ్యామ్, **...అంశుకైః** అకారాన్త పుంలింగ... అంశుశబ్దము. తృ.బ. 2. కల్పద్రుమైః – కల్పద్రుమేణ, కల్పద్రుమాభ్యామ్, **కల్పద్రుమైః**; అకారాన్త పుంలింగ కల్పద్రుమశబ్దము. తృ.బ. 3. ఏవ – అవ్యయము 4. అపౌరాదరనిర్మితా – **...నిర్మితా**, ...నిర్మితే, ...నిర్మితాః; ఆకారాన్త స్త్రీలింగ నిర్మితాశబ్దము. ప్ర.ఏ. 5. గృహయన్త్రపతాకాశ్రీః – **...శ్రీః**, ...శ్రియౌ, ...శ్రియః; ఈకారాన్త స్త్రీలింగ ...శ్రీశబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు:–**

1. విలోలవిటపాంశుకైః – విటపేషు అంశుకాని (స.త.) విటపాంశుకాని, విలోలాని విటపాంశుకాని యేషాం (బహువ్రీహి) తే, విలోలవిటపాంశుకాః
2. కల్పద్రుమైః – కల్పాః ఇతి ద్రుమాః (కర్మధా.) కల్పద్రుమాః।
3. అపౌరాదరసనిర్మితా – పౌరాణామ్ ఆదరః – పౌరాదరః (ష.త.), న పౌరాదరః(నఞ్తత్పు.) అపౌరాదరః, అపౌరాదరేణ నిర్మితా (తృ.త.) అపౌరాదరనిర్మితా।
4. గృహయన్త్రపతాకాశ్రీః – గృహేషు యంత్రాణి (స.త.) గృహయంత్రాణి, గృహయన్త్రేషు, పతాకాః, గృహయంత్రపతాకాః, (స.త.), గృహయన్త్ర పతాకానాం శ్రీః (ష.త.) గృహయన్త్రపతాకాశ్రీః।

**సంధులు:–**

1. కల్పద్రుమైః + ఏవ – కల్పద్రుమైరేవ – విసర్గసన్ధిః।





2. ...పతాకాశ్రీః + అపౌరాదర...– ...పతాకాశ్రీరపౌరదర... – విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. శ్రీః – (స్త్రీ.) –**

ఎ) హరిం శ్రయతీతి। శ్రి + 'క్విబ్వచిప్రచ్ఛీతి' క్విప్, దీర్ఘశ్చ। లక్ష్మీః।

బి) శ్లో॥ 'శ్రియం చ దేవదేవస్య పత్నీ నారాయణస్య యా'

– ఇతి విష్ణుపురాణే 1–8–13

సి) శోభా –

1. శోభార్థే – పి ప్రయుజన్తే లక్ష్మీశ్రీకాన్తివిభ్రమాః॥ 813

– అని హలాయుధకోశము

శ్లో॥ ఏవమాదిభిరాకీర్ణ శ్రియం పుష్పత్రయం గిరిః' – ఇతి రామాయణే 2–94–10

2. (పుం.) శ్రి+ క్విప్ దీర్ఘశ్చ। రాగవిశేషః। షడ్రాగాన్తర్గతపంచమరాగః।

డి) శ్లో॥ లక్ష్మీః శ్రీః కమలా పద్మా పద్మవాసా హరిప్రియా।

క్షీరోదతనయా మా చ శబ్దజ్ఞైరిన్దిరా స్మృతా॥ 31

– అని హలాయుధకోశము '9' నామములను పేర్కొన్నది.

ఇ) ఇట 'శ్రీసూక్తము'ను అనుసంధానము చేసికొందురుగాక.

ఎఫ్) ఈకారాన్తః స్త్రీలిఙ్గః శ్రీశబ్దః

**శ్రీః – శ్రియౌ** – శ్రియః

శ్రియమ్ – శ్రియౌ – శ్రియః

శ్రియా – శ్రీభ్యామ్ – శ్రీభిః

శ్రియై/శ్రియే – శ్రీభ్యామ్ – శ్రీభ్యః

శ్రియాః / శ్రియః – శ్రీభ్యామ్ – శ్రీభ్యః

శ్రియాః / శ్రియః – శ్రియోః – శ్రీణామ్ / శ్రియామ్

శ్రియామ్ / శ్రియి – శ్రియోః – శ్రీషు

హే శ్రీః – హే శ్రియౌ – హే శ్రియః

**శ్రీః** – శ్రయన్తి ఏతామ్శ్రీః। 'క్విబ్వచిప్రచ్ఛిశ్రిసుద్రుప్రుజ్వాం దీర్ఘో – సమ్ప్రసారణఇ్చ ఇతి క్విప్ ప్రకృతేర్దీర్ఘశ్చ। అజ్యన్తత్వాన్న సులోపః।

**శ్రియౌ** – ధాత్వవయవత్వాత్ ఇయఙ్।

హే శ్రీః – 'నే యఙి' తి నదీత్వనిషేధాత్ 'అమ్బార్థే'తి హ్రస్వో న।

**అలంకారాలు:–** అత్ర వ్యతిరేకాలంకారః। తత్ర యన్త్ర ప్రతివస్తుతయా విటపానాముపాదానం పతాకాప్రతివస్తుత్వేనాంశుకానాముపాదానం నిర్మాణ ప్రయాసాభావేన చాధిక్యమితి వివేకః।

---

**శ్లో॥ యత్ర స్ఫటికహర్మ్యేషు – నక్తమాపానభూమిషు।**
**జ్యోతిషాం ప్రతిబిమ్బాని – ప్రాప్నువన్త్యుపహారతామ్॥ 42**

**పదవిభాగము:–** యత్ర, స్ఫటికహర్మ్యేషు, నక్తమ్, ఆపానభూమిషు, జ్యోతిషామ్, ప్రతిబిమ్బాని, ప్రాప్నువన్తి, ఉపహారతామ్।

**అన్వయక్రమము:–** యత్ర నక్తం స్ఫటికహర్మ్యేషు ఆపానభూమిషు జ్యోతిషాం ప్రతిబిమ్బాని ఉపహారతామ్ ప్రాప్నువన్తి।

**ప్రతిపదార్థము:–** యత్ర – ఎచట, స్ఫటికహర్మ్యేషు – స్ఫటికశిలలమేడలయందు, నక్తమ్ – రాత్రియందు, ఆపానభూమిషు – పానగోష్ఠుల ప్రదేశములయందు, జ్యోతిషామ్ – నక్షత్రములయొక్క ప్రతిబిమ్బాని – ప్రతిబింబములు, ఉపహారతామ్ – ఉపహారత్వమును, ప్రాప్నువన్తి – పొందుచున్నవో.

**తాత్పర్యము:–** ఎచట రాత్రియందు స్ఫటికశిలలమేడలయందు, పానగోష్ఠుల ప్రదేశములయందు నక్షత్రములయొక్క ప్రతిబింబములు ఉపహారత్వమును, పొందుచున్నవో.

**పాఠాన్తరాలు:–** 1. నక్తమాపాన – నక్తసోపాన, 2. యత్ర స్ఫటికహర్మ్యేషు – శుభ్రసోపానపంక్తిషు

**విభక్తులు / క్రియలు:–** 1. యత్ర – అవ్యయము 2. స్ఫటికహర్మ్యేషు – **స్ఫటికహర్మ్యేషు,** స్ఫటికహర్మ్యయోః, స్ఫటికహర్మ్యేషు; అకారాన్త నపుంసకలింగ స్ఫటికహర్మ్యశబ్దము. స.బ. 3. ఆపానభూమిషు – ఆపానభూమౌ, ఆపానభూమ్యోః, **ఆపానభూమిషు**; ఇకారాన్త స్త్రీలింగ ఆపానభూమిశబ్దము. స.బ. 4. జ్యోతిషామ్ – జ్యోతిషః, జ్యోతిషోః, **జ్యోతిషామ్;** సకారాన్త నపుంసకలింగ జ్యోతిశ్శబ్దము. ష.బ. 5. ప్రతిబిమ్బాని – ప్రతిబింబమ్, ప్రతిబింబే, **ప్రతిబింబాని**; అకారాన్త నపుంసకలింగ ప్రతిబింబశబ్దము. ప్ర.బ. 6. ఉపహారతామ్ – **ఉపహారతామ్**, ఉపహారతే, ఉపహారతాః ఆకారాన్త స్త్రీలింగ ఉపహారతాశబ్దము. ద్వి.ఏ. 7. ప్రాప్నువన్తి – క్రియ 8. నక్తమ్ – అవ్యయము.

**సమాసాలు:–**

1. స్ఫటికహర్మ్యేషు – స్ఫటికానాం హర్మ్యాణి (ష.త.), స్ఫటికహర్మ్యాణి, తేషు।





2. ఆపానభూమిషు – ఆపానస్య భూమయః (ష.త.), ఆపానభూమయః, తాసు।
3. ఉపహారతామ్ – ఉపహారస్య భావః ఉపహారతా, తామ్। (త.వృ.)।

**సంధులు:–**

1. ప్ర + ఆప్నువన్తి – ప్రాప్నువన్తి – సవర్ణదీర్ఘసన్ధిః।
2. ప్రాప్నువన్తి + ఉపహారతామ్ – ప్రాప్నువన్త్యుపహారతామ్ – యణాదేశసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

1. **జ్యోతిః** – (నపుం.) (పుం.)
1) సకారాన్త నపుంసకలింగ జ్యోతిస్శబ్దము,
ఎ) షకారాన్త పుంలింగ జ్యోతిశ్శబ్దము.
బి) (నపుం.) 1. ద్యుత్ – దీప్తౌ + **‘ద్యుతేరిసన్నాదేశ్చ జః’** ఇతి ఇసన్ దస్య చ జః । ఉణాదిసూత్రమ్ । నక్షత్రమ్।
2. శ్లో॥ ‘జ్యోతీంష్యగ్నిఞ్చామేఘ్యమశస్తంఞ్చ నాభివీక్షేత’ – ఇతి చరకే।
సి) (పుం.) – 1. ద్యుత్ + కర్తరి ఇసన్। అగ్నిః
2. తస్యాన్తరేణ నాభేస్తు జ్యోతిఃస్థానం ధ్రువం స్మృతమ్।
తదా ధమతి వాతస్తు దేహస్తేనాస్య వర్ధతే। – ఇతి సుశ్రుతే।
డి) శ్లో॥ భం నక్షత్రం తారకం తారూ చ
జ్యోతిస్తారా ధిష్ణ్యమృక్షం తథోడు। – 51
– అని హలాయుధకోశము నక్షత్రమునకు 9 నామములను పేర్కొన్నది.

**అలంకారాలు:–** అత్ర **వ్యతిరేకాలంకారః।**

సర్వత్ర హి జనాః ప్రయత్నేన కుసుమాన్యానీయ పానగోష్ఠీషు రాత్రౌ పుష్పోపహారాన్ కుర్వన్తి। ఓషధిప్రస్థే తు పానగోష్ఠీప్రదేశానాం స్ఫటికమయత్వాద్ రాత్రౌ నక్షత్ర ప్రతిబింబైరేవ పుష్పోపహారః ప్రయత్నం వినైవేతి వ్యతిరేకాలంకారః।
– ఇతి ‘పుంసవనీ’ వ్యాఖ్యాయామ్.

**క్రియాదర్శము:– ప్రాప్నువన్తి** – ప్ర – ఉపసర్గ, ‘ఆప్ (ఆప్) – వ్యాప్తౌ’ (వ్యాపించుట), సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, తుదాదిప్రకరణమ్(6), లట్ – ప్రథమపురుషబహువచనాంతః।

ప్రాప్నోతి – ప్రాప్నుతః – **ప్రాప్నువన్తి**

---

శ్లో॥ యత్రౌషధిప్రకాశేన - నక్తం దర్శితసఞ్చరాః।
అనభిజ్ఞాస్తమిస్రాణాం - దుర్దినేష్వభిసారికాః॥ **43**

**పదవిభాగము:-** యత్ర, ఓషధిప్రకాశేన, నక్తమ్, దర్శితసంచరాః, అనభిజ్ఞాః, తమిస్రాణామ్, దుర్దినేషు, అభిసారికాః।

**అన్వయక్రమము:-** యత్ర దుర్దినేషు నక్తమ్ ఓషధిప్రకాశేన దర్శితసంచరాః అభిసారికాః తమిస్రాణామ్ అనభిజ్ఞాః।

**ప్రతిపదార్థము:-** యత్ర – ఎచట, దుర్దినేషు – మబ్బుగమ్మిన దినములయందు, నక్తమ్ – రాత్రియందు, ఓషధిప్రకాశేన – ఓషధీలతల కాంతులచేత, దర్శితసంచరాః – చూపబడిన దారులుగలవారైన, అభిసారికాః – కాంతునియెడకేగు చెలువలు, తమిస్రాణామ్ – చీకటులు, అనభిజ్ఞాః – ఎఱుగరు.

**తాత్పర్యము:-** ఎచట మబ్బుగమ్మినదినములయందు, రాత్రియందు, ఓషధీలతలకాంతులచేత చూపబడినదారులుగలవారైన, కాంతునియెడకేగు చెలువలు చీకటులు ఎఱుగరు.

**పాఠాన్తరాలు:-** 1. దుర్దినేష్వభిసారికాః – దుర్దినే - ప్యభిసారికాః

**విభక్తులు/ క్రియలు:-** 1. యత్ర – అవ్యయము 2. దుర్దినేషు – దుర్దినే, దుర్దినయోః, **దుర్దినేషు**; అకారాన్త నపుంసకలింగ దుర్దినశబ్దము. స.బ. 3. నక్తమ్ – అవ్యయము 4. ఓషధిప్రకాశేన – **...ప్రకాశేన,** ...ప్రకాశాభ్యామ్, ...ప్రకాశైః; అకారాన్త పుంలింగ ప్రకాశశబ్దము. తృ.ఏ. 5. దర్శితసంచరాః – ...సంచరా, ...సంచరే, **...సంచరాః**; ఆకారాన్త స్త్రీలింగ సంచరాశబ్దము. ప్ర.బ. 6. అభిసారికాః – అభిసారికా, అభిసారికే, **అభిసారికాః**; ఆకారాన్త స్త్రీలింగ అభిసారికాశబ్దము. ప్ర.బ. 7. తమిస్రాణామ్ – తమిస్రస్య, తమిస్రయోః, **తమిస్రాణామ్**; అకారాన్త నపుంసకలింగ తమిస్రశబ్దము. ష.బ. 8. అనభిజ్ఞాః – అనభిజ్ఞా, అనభిజ్ఞే, **అనభిజ్ఞాః**; ఆకారాన్త స్త్రీలింగ అనభిజ్ఞాశబ్దము. ప్ర.బ.

**సమాసాలు:-**

1. దుర్దినేషు – దుష్టాని దినాని దుర్దినాని తేషు – దుర్దినేషు। 'కుగతిప్రాదయ' ఇతి సమాసః।
2. ఓషధిప్రకాశేన – ఓషధీనాం ప్రకాశః (ష.త.) ఓషధిప్రకాశః, తేన ఓషధిప్రకాశేన।
3. దర్శితసంచరాః – దర్శితః సంచరః యాసాం (బహువ్రీహి) తాః, దర్శితసంచరాః।
4. అనభిజ్ఞాః – న అభిజ్ఞాః (నఞ్తత్పురుష.) అనభిజ్ఞాః।





**సంధులు:-**

1. యత్ర + ఓషధిప్రకాశేన – యత్రౌషధిప్రకాశేన – వృద్ధిసన్ధిః।
   **వృద్ధిరేచి** (సూ. 6-1-85) అవర్ణమునకు (అ,ఆలకు) ఏఓఐఔలు పరమగునపుడు పూర్వపరములస్థానములో వృద్ధి ఏకాదేశమగును.
2. అనభిజ్ఞాః + తమిస్రాణామ్–అనభిజ్ఞాస్తమిస్రాణామ్–విసర్గసన్ధిః (సకారాదేశ)
3. దుర్దినేషు + అభిసారికాః – దుర్దినేష్వభిసారికాః – యణాదేశసన్ధిః।

**ఇకో యణచి** (సూ. 6-1-74) ఇ,ఉ,ఋ,ఌ వర్ణములకు అసవర్ణమైన అచ్చుపరముగా నున్నపుడు క్రమముగా య్,వ్,ర్,ల్ (యణ్) అనునవి ఆదేశమగును.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:**

**1. అభిసారికాః –**

ఎ) కాంతార్థినీ తు యా యాతి సంకేతం సాభిసారికా' ఇత్యమరః।

తథా చోక్తం సాహిత్యదర్పణే –

"అభిసారయతే కాన్తం యా మన్మథవశంవదా।
స్వయం వాభిసరత్యేషా ధీరైరుక్తాభిసారికా॥" ఇతి।

బి) 'అభిసరతి కాన్తనిర్దిష్టసంకేతస్థానం గచ్ఛతి యా।' అభి + సృ + ణ్వుల్' స్త్రియాం టాప్। స్వీయాదిషోడశనాయికామధ్యే నాయికాభేదః।

సి) [illegible] & [illegible] అభిసారికా [illegible] సాహిత్యదర్పణే 116. [illegible] 8 [illegible] - 1. [illegible] 2. [illegible] 3. [illegible] 4. [illegible] 5. [illegible] 6. [illegible] - [illegible] 7. [illegible], [illegible] 8) [illegible] - [illegible]

డి) శ్లో॥ క్షేత్రం వాటీ భగ్నదేవాలయో దూతీగృహం వనమ్।
మాలయం చ శ్మశానం చ నద్యాదీనాం తటీ తథా॥

ఇ) 'కాన్తాభిసరణోద్యుక్తా స్మరార్తా **సాభిసారికా**'। ఇతి।

ఎఫ్) శ్లో॥ కాచిత్ సర్వజనీనవిభ్రమపరా మధ్యే సఖీమణ్డలం
లోలాక్షిభ్రువసంజ్ఞయా విదధతీ దూత్యా సహాభాషణమ్।

అక్ష్ణో రఞ్జనమఞ్జసా శశిముఖీ విన్యస్య వక్షోజయోః।
స్థూలం భావుకయోః స్థితం మణిసరం చేలాఞ్చలేన వ్యధాత్॥
– ఇతి పుష్పబాణవిలాసే –15

చెలుల నడుమన యుండి వారికి దెలియనీక ప్రియుని దూతికి చేష్టచే నాయిక సంకేతకాలమును తెలుపుట పై శ్లోకమున చెప్పబడినది.

'మోము చందురుని తాకి కన్నుల కాటుకదాల్చి మణిసరమును గప్పుటచే – నెల గ్రుంకి, చీకటి కమ్ముకొని, ఇండ్లలో జనులు దీపములనార్పివైచిన యనంతరము కాంతుని కడకు వచ్చెదను' అని నాయిక అభిప్రాయము. నాయిక పరకీయ అభిసారిక – అని 'శృఙ్గారచన్ద్రికా' వ్యాఖ్యానము.

---

**శ్లో॥ యౌవనాన్తం వయో యస్మిన్ – నాన్తకః కుసుమాయుధాత్।**
**రతిఖేదసముత్పన్నా – నిద్రా సంజ్ఞావిపర్యయః॥ 44**

**పదవిభాగము:–** యౌవనాన్తమ్, వయః, యస్మిన్, న, అన్తకః, కుసుమాయుధాత్, రతిఖేదసముత్పన్నా, నిద్రా, సంజ్ఞావిపర్యయః।

**అన్వయక్రమము:–** యస్మిన్ వయః యౌవనాన్తం కుసుమాయుధాత్ అన్తకః న రతిఖేదసముత్పన్నా నిద్రా సంజ్ఞావిపర్యయః।

**ప్రతిపదార్థము:–** యస్మిన్ – ఎందు, వయః – వయస్సు, యౌవనాన్తమ్ – యౌవనము హద్దుగా గలదో, కుసుమాయుధాత్ – మన్మథునికంటె, అన్తకః – యముడు, న – లేడో, రతిఖేదసముత్పన్నా – సురతశ్రమచే కలిగిన, నిద్రా – నిద్ర, సంజ్ఞావిపర్యయః – చైతన్యాభావమో.

**తాత్పర్యము:–** ఎందు (ఓషధిప్రస్థమందు) వయస్సు యౌవనము హద్దుగాగలదో, మన్మథునికంటె యముడు లేడో, సురతశ్రమచే కలిగిన నిద్ర చైతన్యాభావమో.

**పాఠాన్తరాలు:–** 1. సముత్పన్నా – సముత్థానా.

**విభక్తులు / క్రియలు –** 1. యస్మిన్ – యస్మిన్, యయోః, యేషు; దకారాన్త నపుంసకలింగ యచ్ఛబ్దము.స.ఏ. 2. యౌవనాన్తమ్ – **యౌవనాన్తమ్,** యౌవనాన్తే, యౌవనాన్తాని; అకారాన్త నపుంసకలింగ యౌవనాన్తశబ్దము. ప్ర.ఏ. 3. కుసుమాయుధాత్ – **కుసుమాయుధాత్,**

47



కుసుమాయుధాభ్యామ్, కుసుమాయుధేభ్యః అకారాన్త పుంలింగ కుసుమాయుధశబ్దము. పం.ఏ. 5. న – అవ్యయము 6. రతిఖేదసముత్పన్నాః – **...ఉత్పన్నా,** ...ఉత్పన్నే, ...ఉత్పన్నాః; ఆకారాన్త స్త్రీలింగ...ఉత్పన్నాశబ్దము. ప్ర.ఏ. 7. నిద్రా – **నిద్రా,** నిద్రే, నిద్రాః; ఆకారాన్త స్త్రీలింగ నిద్రాశబ్దము. ప్ర.ఏ. 8. సంజ్ఞావిపర్యయః – **...విపర్యయః,** ...విపర్యయౌ, ...విపర్యయాః; అకారాన్త పుంలింగ...విపర్యయశబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు:–**

1. యౌవనాన్తమ్ – యూనాం భావః యౌవనం, తద్ అన్తే యస్య (బహువ్రీహి) తత్ యౌవనాంతమ్।
2. కుసుమాయుధాత్ – కుసుమాని ఆయుధాని యస్య (బహువ్రీహి) స కుసుమాయుధః, తస్మాత్ కుసుమాయుధాత్।
3. రతిఖేదసముత్పన్నా – రతేః ఖేదః రతిఖేదః, తస్మాత్ సముత్పన్నా (పం.త.) రతిఖేదసముత్పన్నా।
4. సంజ్ఞావిపర్యయః – సంజ్ఞాయాః విపర్యయః (ష.త.) సంజ్ఞావిపర్యయః।

**సంధులు –**

1. వయః+ యస్మిన్ – వయో యస్మిన్ – ఉత్వాదేశః।
2. న + అన్తకః – నాన్తకః – సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:**

**1. అన్తకః** – ఎ) అన్తం వినాశం కరోతి। అన్త + కరోత్యర్థే ణిచ్, తతో ణ్వుల్ । యమః।

బి) శ్లో॥ శమనః సమవర్తీ చ ప్రేతపతిః పిత్రుపతిశ్చ కీనాశః।
వైవస్వతః కృతాన్తః కాలిన్దీసోదరః కాలః ॥7।
శ్లో॥ **అన్తకో** ధర్మరాజశ్చ యమో దణ్డధరో హరిః।
దక్షిణాశాపతిః సద్భిః శ్రాద్ధదేవశ్చ కథ్యతే ॥ 72
– అని హలాయుధకోశము '16' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ తం విస్మితం ధేనురువాచ సాధో
మాయాం మయోద్భావ్య పరీక్షితో – సి।
ఋషిప్రభావాన్మయి **నాన్తకో –** పి
ప్రభుః ప్రహర్తుం కిము తాన్యహింస్రాః॥ – ర.వం. 2–62

**అలంకారాలు:–** అత్ర పరిసంఖ్యాలంకారః। తల్లక్షణం సాహిత్యదర్పణే యథా –

శ్లో॥ "ప్రశ్నాదప్రశ్నతో వాపి కథితాద్వస్తునో భవేత్।
తాదృగన్యవ్యపోహశ్చేచ్ఛాబ్ద ఆర్థో – థవా తదా॥ **పరిసంఖ్యా**" ఇతి।

---

**శ్లో॥ భ్రూభేదిభిః సకమ్పోష్ఠై – ర్లలితాఙ్గులితర్జనైః।**
**యత్ర కోపైః కృతాః స్త్రీణా – మాప్రసాదార్థినః ప్రియాః॥ 45**

**పదవిభాగము:–** భ్రూభేదిభిః, సకమ్ప + ఓష్ఠైః, లలితాఙ్గులితర్జనైః, యత్ర, కోపైః కృతాః, స్త్రీణామ్, ఆప్రసాద + అర్థినః, ప్రియాః।

**అన్వయక్రమము:–** యత్ర భ్రూభేదిభిః సకమ్పోష్ఠైః లలితాఙ్గులితర్జనైః స్త్రీణామ్ కోపైః ప్రియాః ఆప్రసాదార్థినః కృతాః।

**ప్రతిపదార్థము:–** యత్ర – ఎచట, భ్రూభేదిభిః – బొమముడికలిగినట్టియు, సకమ్పోష్ఠైః – కదులుచున్న పెదవులు కలిగినట్టియు, లలితాఙ్గులితర్జనైః – సుకుమారమైన వ్రేళ్లతో బెదురించుటగలవియు అగు, స్త్రీణామ్ – చెలులయొక్క, కోపైః – అలుకలచేత, ప్రియాః – ప్రియులైన కాంతులు, ఆ ప్రసాదార్థినః – అనుగ్రహము కలుగువఱకు వేడుకొనువారుగా, కృతాః – చేయబడినారో.

**తాత్పర్యము:–** ఎచట బొమముడికలిగినట్టియు, కదులుచున్న పెదవులు కలిగి నట్టియు, సుకుమారమైన వ్రేళ్లతో బెదురించుట గలవియు అగు చెలుల అలుకలచేత ప్రియులైన కాంతులు అనుగ్రహము కలుగువఱకు వేడుకొనువారుగా చేయబడినారో.

**పాఠాన్తరాలు:–** 1. స్త్రీణామాప్రసా – స్త్రీణామప్రసా

**విభక్తులు / క్రియలు:–** 1. యత్ర – అవ్యయము 2. భ్రూభేదిభిః – భ్రూభేదినా, భ్రూభేదిభ్యామ్, **భ్రూభేదిభిః;** నకారాన్త పుంలింగ భ్రూభేదిన్‌శబ్దము. తృ.బ. 3. సకమ్పోష్ఠైః – సకమ్పోష్ఠేన, సకమ్పోష్ఠాభ్యామ్, **సకమ్పోష్ఠైః;** అకారాన్త పుంలింగ సకమ్పోష్ఠశబ్దము. తృ.బ. 4. లలితాఙ్గులితర్జనైః – ...తర్జనేన, ...తర్జనాభ్యామ్, ...**తర్జనైః;** అకారాన్త పుంలింగ తర్జనశబ్దము. తృ.బ. 5. స్త్రీణామ్ – స్త్రియాః, స్త్రియోః, **స్త్రీణామ్;** ఈకారాన్త స్త్రీలింగ స్త్రీశబ్దము. ష.బ. 6. కోపైః – కోపేన, కోపాభ్యామ్, **కోపైః;** అకారాన్త పుంలింగ కోపశబ్దము. తృ.బ. 7. ప్రియాః – ప్రియః, ప్రియౌ, **ప్రియాః;** అకారాన్త పుంలింగ ప్రియశబ్దము. ప్ర.బ. 8. ఆప్రసాదార్థినః – ...అర్థీ, ...అర్థినౌ, **...అర్థినః;** నకారాన్త పుంలింగ ...అర్థిన్‌శబ్దము. ప్ర.బ. 9. కృతాః – కృతః, కృతౌ, **కృతాః;** అకారాన్త పుంలింగ కృతశబ్దము. ప్ర.బ.





**సమాసాలు:–**

1. భ్రూభేదిభిః – భ్రువం భిన్దతీతి భ్రూభేదినః (త.వృ.) తైః భ్రూభేదిభిః।
2. సకమ్పోష్ఠైః – కమ్పేన సహితాః సకమ్పాః, తే ఓష్ఠాః యేషాం (బహువ్రీహి) తే సకమ్పోష్ఠాః, తైః।
3. లలితాఙ్గులితర్జనైః – అఙ్గులీనాం తర్జనాని (ష.త.) అంగులితర్జనాని లలితాని అంగులితర్జనాని యేషు (బహువ్రీహి)తే లలితాఙ్గులితర్జనాః, తైః।
4. ఆప్రసాదార్థినః – ఆప్రసాదమ్, (ఆఙ్ 'మర్యాదాభివిధ్యోః' ఇత్యవ్యయీభావ సమాసః) అర్థయన్తే తచ్ఛీలాః అర్థినః, ఆప్రసాదమ్ అర్థినః ఆప్రసాదార్థినః

**సంధులు:–**

1. సకమ్పోష్ఠైః + లలితాఙ్గులి – సకమ్పోష్ఠైర్లలితాఙ్గులి – విసర్గసన్ధిః।
2. ఆప్రసాద + అర్థినః – ఆప్రసాదార్థినః – సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. కోపః –** ఎ) కుప్యతే ఇతి కుప్ + భావే ఘఞ్। క్రోధః।
– అని హలాయుధకోశము '5' నామములను పేర్కొన్నది.

బి) శ్లో॥ 'వత్స! కః కోపహేతుస్తే కశ్చ త్వాం నాభినన్దతి'
– ఇతి విష్ణుపురాణే 1–1–13

సి) 'కోపం న గచ్ఛతి నితాన్తబలో – పి నాగః' – పంచతంత్రమ్ –1–123

**అలంకారాలు:–** అత్రాపి పరిసంఖ్యాలంకారః।

---

**శ్లో॥ సన్తానకతరుచ్ఛాయా – సుప్తవిద్యాధరాధ్వగమ్।**
**యస్య చోపవనం బాహ్యం – గన్ధవద్గన్ధమాదనమ్॥ 46**

**పదవిభాగము:–** సన్తానకతరుచ్ఛాయాసుప్తవిద్యాధరాధ్వగమ్, యస్య, చ, ఉపవనమ్, బాహ్యమ్, గన్ధవత్, గన్ధమాదనమ్।

**అన్వయక్రమము:–** చ, సన్తానక...విద్యాధరాధ్వగం గన్ధవత్ గన్ధమాదనం యస్య బాహ్యమ్ ఉపవనమ్.

**ప్రతిపదార్థము:–** చ – మఱియు, సన్తానక ...విద్యాధరాధ్వగమ్ – కల్పవృక్షముల నీడలయందు నిద్రించిన విద్యాధరులనెడి బాటసారులుగలదియు, గన్ధవత్ –

గంధము కలదియు అగు, గన్ధమాదనమ్ – గన్ధమాదన పర్వతము, యస్య – దేనికి (ఓషధిప్రస్థము)నకు, బాహ్యమ్ – వెలుపలి, ఉపవనమ్ – ఉద్యానవనమో.

**తాత్పర్యము:–** కల్పవృక్షములనీడలలో నిద్రించిన విద్యాధరులనెడి బాటసారులు గలదియు, గంధము కలదియు అగు గన్ధమాదనపర్వతము ఏ ఓషధిప్రస్థమునకు వెలుపలి ఉద్యానవనమో.

**పాఠాన్తరాలు:–** 1. గన్ధవద్గన్ధమాదనమ్ – సుగన్ధిర్గన్ధమాదనః

**విభక్తులు / క్రియలు:–** 1. సన్తానక... విద్యాధరాధ్వగమ్ – **...అధ్వగమ్**, ...అధ్వగే, ...అధ్వగాని; అకారాన్త నపుంసకలింగ ...అధ్వగశబ్దము. ప్ర.ఏ. 2. గన్ధవత్ – **గన్ధవత్**, గన్ధవతీ, గన్ధవన్తి; తకారాన్త నపుంసకలింగ గన్ధవత్ శబ్దము. ప్ర.ఏ. 3. గన్ధమాదనమ్ – **గన్ధమాదనమ్,** గన్ధమాదనే, గన్ధమాదనాని; అకారాన్త నపుంసకలింగ గన్ధమాదనశబ్దము. ప్ర.ఏ. 4. యస్య – **యస్య,** యయోః, యేషామ్; దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము. ష.ఏ. 5. బాహ్యమ్ – బాహ్యే, బాహ్యాని 6. ఉపవనమ్ – ఉపవనమ్, ఉపవనే, ఉపవనాని; అకారాన్త నపుంసకలింగ ఉపవనశబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు:–**

1. సన్తానకతరుచ్ఛాయాసుప్తవిద్యాధరాధ్వగమ్ – సన్తానకః ఇతి తరుః సన్తాకతరుః (కర్మధా.) సన్తానకతరోః ఛాయా – (ష.త.) – సన్తానక తరుచ్ఛాయా, సన్తానకతరుచ్ఛాయాయాం సుప్తాః – సన్తానకతరుచ్ఛాయాసుప్తాః (స.త.), సన్తానకతరుచ్ఛాయాసుప్తాశ్చ తే విద్యాధరాశ్చ (కర్మధా), సన్తానక... విద్యాధరాః, సన్తానక...విద్యాధరాః ఏవ అధ్వగాః యస్మిన్ (బహుబ్రీహి) తత్।
2. బాహ్యమ్ – బహిర్భవం బాహ్యమ్ (త.వృ.)।
3. గన్ధవత్ – గన్ధః అస్య అస్తి ఇతి గన్ధవత్ (త.వృ.)।

**సంధులు:–**

1. చ + ఉపవనమ్ – చోపవనమ్ – గుణసన్ధిః (ఆద్గుణః సూ. 6–1–84) అవర్ణమునకు (అ,ఆలకు) హ్రస్వదీర్ఘములయిన ఇ, ఉ, ఋ, ఌ వర్ణములు పరముగా నున్నప్పుడు పూర్వపరముల స్థానములో గుణము ఏకాదేశ మగును.

**పదవృత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. సుగన్ధిర్గన్ధమాదనః –**

ఏ) 'సన్తానకతరుచ్ఛాయేత్యత్ర పూర్వపదార్థబాహుల్యసంభవే – పి' శలభచ్ఛాయమ్'





'ఇక్షుచ్ఛాయమ్' ఇతివత్ సమర్థచ్ఛాయానిష్పత్తేస్తదపేక్షాభావాత్। 'ఛాయాబాహుల్యే' ఇతి నపుంసకత్వం నాస్తీత్యనుసంధేయమ్, అత్ర 'గన్ధవద్గన్ధమాదనమ్' ఇత్యాగన్తుకః పాఠః, ప్రాచీనపాఠస్తు 'సుగన్ధిర్గన్ధమాదనః' ఇతి పుంలిఙ్గాన్తః, అత ఏవ క్షీరస్వామినా 'గన్ధమాదనమన్యే చ' ఇత్యత్ర 'గన్ధేన మాదయతీతి గన్ధమాదన' ఇతి వ్యాఖ్యాయ ప్రయోగే చ పుంలిఙ్గతా దృశ్యతే ఇత్యాశయేనోక్తం సుగన్ధిర్గన్ధమాదనః ఇతి, కాళిదాస ఇతి చ' ఇతి మల్లినాథః।

శ్లో।। హిమవాన్ నిషధో విన్ధ్యో మాల్యవాన్ పారియాత్రకః।
గన్ధమాదనమన్యే చ హేమకూటాదయో నగాః।। ఇతి।

---

**శ్లో।। అథ తే మునయో దివ్యాః – ప్రేక్ష్య హైమవతం పురమ్।**
**స్వర్గాభిసన్ధిసుకృతం – వఞ్చనామివ మేనిరే।। 47**

**పదవిభాగము:–** అథ, తే, మునయః, దివ్యాః, ప్రేక్ష్య, హైమవతమ్, పురమ్, స్వర్గాభిసన్ధిసుకృతమ్, వఞ్చనామ్, ఇవ, మేనిరే।

**అన్వయక్రమము:–** అథ దివ్యాః తే మునయః హైమవతం పురం ప్రేక్ష్య స్వర్గాభిసన్ధిసుకృతం వఞ్చనామ్ ఇవ మేనిరే।

**ప్రతిపదార్థము:–** అథ – పిమ్మట, దివ్యాః – దివ్యులగు, తే మునయః – ఆ సప్తర్షులు, హైమవతమ్ – హిమవంతునకు చెందిన, పురమ్ – ఓషధిప్రస్థమును, ప్రేక్ష్య – చూచి, స్వర్గాభిసన్ధిసుకృతమ్ – స్వర్గోద్దేశ్యకపుణ్యమును, వఞ్చనామ్ ఇవ – మోసమునుగా, మేనిరే – తలంచిరి.

**తాత్పర్యము:–** పిమ్మట దివ్యులగు ఆ సప్తర్షులు హిమవంతునకు చెందిన ఓషధిప్రస్థమును చూచి స్వర్గోద్దేశ్యకపుణ్యమును మోసమునుగా తలచిరి.

**పాఠాన్తరాలు:–**

1. అథ తే – తతస్తే, తత్రాన్తం 2. ...సన్ధి – స్పన్ది 3. అభిసన్ధిసుకృతమ్ – అభిసన్ధిం సుకృతామ్

**విభక్తులు / క్రియలు:–** 1. అథ – అవ్యయము 2. దివ్యాః – దివ్యః, దివ్యౌ, దివ్యాః; అకారాన్త పుంలింగ దివ్యశబ్దము. ప్ర.బ. 3. తే – సః తౌ, తే; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.బ. 4. మునయః – మునిః, మునీ, **మునయః;** ఇకారాన్త పుంలింగ మునిశబ్దము. ప్ర.బ. 5. హైమవతమ్

శ్లో॥ అథ ప్రీణాతి వరతి వృణాతి చ వృణోతి చ॥
త్రీణ్యాత్మనే - పి వరణే వారయత్యపి వృక్షతే।
వావృత్యతే కీటయతి ప్రీయతే చాపి వృశ్యతి॥
- ఇతి ఆఖ్యాతచన్ద్రికాయామ్ 2-1-41

---

**శ్లో॥ తమర్థమివ భారత్యా - సుతయా యోక్తుమర్హసి।**
**అశోచ్యా హి పితుః కన్యా - సద్భర్తృప్రతిపాదితా॥ 79**

**పదవిభాగము:-** తమ్, అర్థమ్, ఇవ, భారత్యా, సుతయా, యోక్తుమ్, అర్హసి, అశోచ్యా, హి, పితుః, కన్యా, సద్భర్తృప్రతిపాదితా।

**అన్వయక్రమము:-** తం 'భారత్యా అర్థమ్ ఇవ' సుతయా యోక్తుమ్ అర్హసి। హి సద్భర్తృప్రతిపాదితా కన్యా పితుః అశోచ్యా (భవతి)।

**ప్రతిపదార్థము:-** తమ్ - ఆ శివభగవానుని, భారత్యా - వాక్కుతో, అర్థమ్ ఇవ - అర్థమునువలె, సుతయా - కొమారితతో, యోక్తుమ్ - కూర్చుటకు, అర్హసి - తగుదువు, హి - ఏలయన, సద్భర్తృప్రతిపాదితా - మంచిభర్తకొఱకు ఈబడిన, కన్యా - కూతురు, పితుః - తండ్రికి, అశోచ్యా (భవతి) - శోకముకలుగనీయదు.

**తాత్పర్యము:-** ఆ శివభగవానుని 'వాక్కుతో అర్థమునువలె ' కొమారితతో కూర్చుటకు తగుదువు. ఏలయన మంచిభర్తకొఱకు ఈబడిన కూతురు తండ్రికి శోకము కలుగనీయదు.

**పాఠాన్తరాలు:-** 1. సద్భర్తృ - సద్భర్త్రే

**విభక్తులు /క్రియలు:-** 1. భారత్యా - **భారత్యా**, భారతీభ్యామ్, భారతీభిః; ఈకారాన్త స్త్రీలింగ భారతీశబ్దము. తృ.ఏ. 2. అర్థమ్ - **అర్థమ్**, అర్థౌ, అర్థాన్; అకారాన్త పుంలింగ అర్థశబ్దము. ద్వి.ఏ .3. సుతయా - **సుతయా**, సుతాభ్యామ్, సుతాభిః; ఆకారాన్త స్త్రీలింగ సుతాశబ్దము. తృ.ఏ. 4. యోక్తుమ్ - అవ్యయము 5. అర్హసి - క్రియ 6. ఇవ, హి - అవ్యయాలు 7. సద్భర్త్రే - **సద్భర్త్రే**, సద్భర్తృభ్యామ్, సద్భర్తృభ్యః; ఋకారాన్త పుంలింగ సద్భర్తృశబ్దము.చ.ఏ. 8. ప్రతిపాదితా - **ప్రతిపాదితా**, ప్రతిపాదితే, ప్రతిపాదితాః; ఆకారాన్త స్త్రీలింగ ప్రతిపాదితాశబ్దము. ప్ర.ఏ. 9. తమ్ - **తమ్**, తౌ, తాన్; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ద్వి.ఏ. 10. కన్యా - **కన్యా**, కన్యే, కన్యాః; ఆకారాన్త స్త్రీలింగ కన్యాశబ్దము ప్ర.ఏ. 11. పితుః - **పితుః**, పిత్రోః, పితౄణామ్; ఋకారాన్త పుంలింగ పితృశబ్దము. ష.ఏ. 12. అశోచ్యా - **అశోచ్యా**, అశోచ్యే, అశోచ్యాః; ఆకారాన్త స్త్రీలింగ అశోచ్యాశబ్దము. ప్ర.ఏ.





**సమాసాలు:-**

1. అశోచ్యా - న శోచ్యా, (నఞ్తత్పురుష) అశోచ్యా।
2. సద్భర్తృప్రతిపాదితా - బిభర్తీతి భర్తా సశ్చాసౌ భర్తా సద్భర్తా (కర్మధా.) సద్భర్త్రే ప్రతిపాదితా (చ.త.)।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

అత్ర ఉపమామాహ - **'భారత్యా అర్థమ్ ఇవ'** ఇతి భారత్యా శబ్దేన అర్థం పదార్థమివ। ఈశ్వరకృతః శబార్థసంబన్ధ ఇతి తార్కికాణాం మతమ్। తదనుసారేణేయముక్తిః। యథేశ్వరో జగత్సర్గానన్తరం శబ్దార్థం పరస్పరం యోజయతి, తథా భవాన్ పార్వతీపరమేశ్వరౌ పరస్పరం యోజయితుమర్హతీత్యర్థః। అత్రోపమయా దమ్పత్యోః పరస్పరోపకర్తృత్వం ధ్వన్యతే। అర్థో హి శబ్దోల్లేఖేనైవ ప్రకాశత ఇతి హి వైయాకరణానాం మతమ్। యథోక్తం -'న సో - స్తి ప్రత్యయో లోకే యః శబ్దానుగమాదృతే' ఇతి (వాక్యపదీయే)। శబ్దశ్చార్థప్రకాశేనైవ చరితార్థో భవతీతి యథా శబ్దార్థయోః పరస్పరకర్తృత్వం తథాత్రాపీత్యర్థః । - ఇతి 'వివరణ' వ్యాఖ్యాయామ్.

ఇట 'రఘువంశమహాకావ్య' ప్రారంభశ్లోకమును అనుసంధానము చేసికొనవలెను.

**శ్లో॥ వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే**
**జగతః పితరౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ॥**

**క్రియాదర్శము:- అర్హసి** - 'అర్హ - పూజాయామ్' (పూజించుట) సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్(1), లట్ - మధ్యమపురుషైకవచనాంతః।
**అర్హసి** - అర్హథః - అర్హథ

శ్లో॥ స త్వం ప్రశస్తే మహితే మదీయే వసంశ్చతుర్థో - గ్నిరివాగ్న్యగారే।
ద్విత్రాణ్యహాన్యర్హసి సోఢుమర్హ - న్యావద్యతే సాధయితుం త్వదర్థమ్॥
- ర.వం. 5-25

---

**అవతారికా:-** గుణాన్తరమప్యాహ - మఱియొక గుణమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ యావన్త్యేతాని భూతాని - స్థావరాణి చరాణి చ।**
**మాతరం కల్పయన్త్యేనా - మీశో హి జగతః పితా॥ 80**

**పదవిభాగము:–** యావన్తి, ఏతాని, భూతాని, స్థావరాణి, చరాణి, చ, మాతరమ్, కల్పయన్తు, ఏనామ్, ఈశః, హి, జగతః, పితా।

**అన్వయక్రమము:–** స్థావరాణి చరాణి చ ఏతాని భూతాని యావన్తి ఏనాం మాతరం కల్పయన్తు। హి ఈశః జగతః పితా (అస్తి)।

**ప్రతిపదార్థము:–** స్థావరాణి – కదలనివియు, చరాణి చ – కదులునవియును అగు, ఏతాని – ఈ, భూతాని – భూతములు, యావన్తి – అన్ని, ఏనామ్ – ఈ నీ కొమారితను, మాతరమ్ – తల్లినిగా, కల్పయన్తు – చేసికొనుగాక, హి – ఏలయన, ఈశః – పరమశివుడు, జగతః – జగత్తునకు, పితా – తండ్రి.

**తాత్పర్యము:–** కదలనివియు, కదలునవియును అగు ఈ భూతములన్ని ఈ నీ కొమారితను తల్లిగా చేసికొనుగాక. ఏలయన పరమశివుడు జగత్తునకు తండ్రి.

**పాఠాన్తరాలు:–** 1. జగతః – జగతామ్

**విభక్తులు / క్రియలు:–** 1. చ, హి – అవ్యయాలు 2. స్థావరాణి – స్థావరమ్, స్థావరే, **స్థావరాణి** అకారాన్త నపుంసకలింగ స్థావరశబ్దము. ప్ర.బ. 3. చరాణి – చరమ్, చరే, **చరాణి;** అకారాన్త నపుంసకలింగ చరశబ్దము. ప్ర.బ. 4. యావన్తి – యావత్, యావతీ, **యావన్తి;** తకారాన్త నపుంసకలింగ యావత్‌శబ్దము. ప్ర.బ. 5. ఏతాని – ఏతత్, ఏతే, **ఏతాని;** దకారాన్త నపుంసకలింగ ఏతచ్ఛబ్దము. ప్ర.బ. 6. భూతాని – భూతమ్, భూతే, **భూతాని;** అకారాన్త నపుంసకలింగ భూతశబ్దము. ప్ర.బ. 7. ఏనామ్ – **ఏనామ్,** ఏనే, ఏనాః; దకారాన్త స్త్రీలింగ ఏతచ్ఛబ్దము. ద్వి.ఏ. 8. మాతరమ్ – **మాతరమ్,** మాతరౌ, మాతౄః; ఋకారాన్త స్త్రీలింగ మాతృశబ్దము. ద్వి.ఏ. 9. కల్పయన్తు – క్రియ 10. ఈశః – **ఈశః,** ఈశౌ, ఈశాః; అకారాన్త పుంలింగ ఈశశబ్దము. ప్ర.ఏ. 11. జగతః – **జగతః**, జగతోః, జగతామ్; తకారాన్త నపుంసకలింగ జగత్‌శబ్దము. ష.ఏ. 12. పితా – **పితా**, పితరౌ, పితరః; ఋకారాన్త పుంలింగ పితృశబ్దము. ప్ర.ఏ.

**సంధులు:–**

1. యావన్తి + ఏతాని – యావన్త్యేతాని – యణాదేశసన్ధిః।
2. కల్పయన్తు + ఏనామ్ – కల్పయన్త్వేనామ్ – యణాదేశసన్ధిః।
   **ఇకో యణచి** (సూ. 6–1–74) ఇ,ఉ,ఋ,ఌ వర్ణములకు అసవర్ణమైన అచ్చుపరముగా నున్నప్పుడు క్రమముగా య్,వ్,ర్,ల్ (యణ్) అనునవి ఆదేశమగును.
3. ఈశః + హి – ఈశో హి (ఉత్వాదేశః)।





**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. మాతా (స్త్రీ.)**

ఎ) ఋకారాన్త స్త్రీలింగ మాతృశబ్దము. ప్ర.ఏకవచనాంతః।

బి) మాన్యతే పూజ్యతే యా సా। మాన్ పూజాయామ్, నప్తృ...దుహితృ'
– ఇతి తృచ్ నిపాత్యతే। స్వస్రాదిత్వాట్టాప్ న।

సి) శ్లో॥ అమ్బా సవిత్రీ జననీ చ **మాతా...**
– అని హలాయుధకోశము '4' నామములను పేర్కొన్నది.

డి) శ్లో॥ 'జనకో జన్మదాతృత్వాత్ పాలనాచ్చ పితా స్మృతః।
గరీయాన్ జన్మదాతుశ్చ యో – న్నదాతా పితా మునే!
వినాన్నాన్నశ్వరో దేహో న నిత్యః పితురుద్భవః।
తయోః శతగుణే **మాతా** పూజ్యా మాన్యా చ వన్దితా।
గర్భధారణపోషాభ్యాం సా చ తాభ్యాం గరీయసీ।'
– ఇతి బ్రహ్మవైవర్తే।

ఇ) 'స గురుర్యః క్రియాః కృత్వా వేదమస్మై ప్రయచ్ఛతి।
ఉపనీయ దదద్వేదమాచార్యః స ప్రకీర్తితః।
ఏకాదశ ఉపాధ్యాయా ఋత్విగ్ యజ్ఞకృదుచ్యతే।
ఏతే మాన్యా యథాపూర్వమేభ్యో **మాతా** గరీయసీ।' – ఇతి గారుడే।

ఎఫ్) 'గురూణామపి సర్వేషాం పూజ్యాః పఞ్చ విశేషతః।
తేషామాద్యాస్త్రయః శ్రేష్ఠాస్తేషాం **మాతా** సుపూజితా॥' – ఇతి కౌర్మే।
– ఇతి హలాయుధకోశవ్యాఖ్యాయామ్.

**క్రియాదర్శము:– కల్పయన్తు** – 'కృపూ – సామర్థ్యే' సమర్థుడగుట. ఆత్మనేపదీ, అకర్మకమ్, సేట్, భ్వాదిప్రకరణమ్ (1), ణిజన్తాత్, పరస్మైపదీ – లోట్ – ప్రథమపురుషబహువచనాంతః।

కల్పయతు – కల్పయతామ్ – **కల్పయన్తు.**

---

**శ్లో॥ ప్రణమ్య శితికణ్ఠాయ – విబుధాస్తదనన్తరమ్।
చరణౌ రఞ్జయన్త్వస్యా – శ్చూదామణిమరీచిభిః॥ 81**

**పదవిభాగము:–** ప్రణమ్య, శితికణ్ఠాయ, విబుధాః, తదనన్తరమ్, చరణౌ, రఞ్జయన్తు, అస్యాః, చూడామణిమరీచిభిః।

**అన్వయక్రమము:–** విబుధాః శితికణ్ఠాయ ప్రణమ్య తదనన్తరమ్ అస్యాః చరణౌ చూడామణిమరీచిభిః రఞ్జయన్తు।

**ప్రతిపదార్థము:–** విబుధాః – దేవతలు, శితికణ్ఠాయ – శివునికొఱకు, ప్రణమ్య – నమస్కరించి, తదనన్తరమ్ – ఆ పిమ్మట, అస్యాః – ఈ నీ కొమారితయొక్క చరణౌ – పాదములను, చూడామణిమరీచిభిః – శిఖారత్నకాంతులచేత, రఞ్జయన్తు – వన్నె పెట్టుదురుగాక!

**తాత్పర్యము:–** దేవతలు పరమశివునికొఱకు నమస్కరించి, పిమ్మట ఈ నీ కొమారితయొక్క పాదములను శిఖారత్నకాంతులచేత వన్నెపెట్టుదురుగాక!

**పాఠాన్తరాలు –** 1. రఞ్జయన్తు – రఞ్జయన్తి

**విభక్తులు / క్రియలు:–** 1. విబుధాః – విబుధః, విబుధౌ, **విబుధాః**; అకారాన్త పుంలింగ విబుధశబ్దము. ప్ర.బ. 2. శితికణ్ఠాయ – **శితికణ్ఠాయ,** శితికణ్ఠాభ్యామ్, శితికణ్ఠేభ్యః; అకారాన్త పుంలింగ శితికణ్ఠశబ్దము. చ.ఏ. 3. ప్రణమ్య – అవ్యయము 4. తదనన్తరమ్ – క్రియావిశేషణము 5. అస్యాః – **అస్యాః**, అనయోః, ఆసామ్; మకారాన్త స్త్రీలింగ 'ఇదమ్'శబ్దము. ష.ఏ. 6. చరణౌ – చరణః, **చరణౌ**, చరణాన్; అకారాన్త పుంలింగ చరణశబ్దము. ద్వి.ద్వి. 7. చూడామణిమరీచిభిః – ...మరీచినా, ...మరీచిభ్యామ్, **...మరీచిభిః**; ఇకారాన్త పుంలింగ...మరీచిశబ్దము. తృ.బ. 8. రఞ్జయన్తు – క్రియ – ణిజన్తాత్।

**సమాసాలు / విగ్రహవాక్యాలు:**

1. శితికణ్ఠాయ – శితిః కణ్ఠః యస్య (బహువ్రీహిః) సః, శితికణ్ఠః, తస్మై। 'క్రియాయోగే చతుర్థీ'।
2. తదనన్తరమ్ – తస్మాద్ అనంతరమ్, తదనన్తరమ్। (ష.త.)
3. చూడామణిమరీచిభిః – చూడాయాః మణయః, తేషాం మరీచయః (ష.త.) చూడామణిమరీచయః, తైః।

**సంధులు:–**

1. విబుధాః + తదనన్తరమ్ – విబుధాస్తదనన్తరమ్ – విసర్గసన్ధిః।
2. రఞ్జయన్తు + అస్యాః – రఞ్జయన్త్వస్యాః – యణాదేశసన్ధిః।
3. అస్యాః + చూడామణి – ...అస్యాశ్చూడామణి... – శ్చుత్వసన్ధిః।



**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు**

**1. చూడామణిః – (పుం.) –**

ఎ) చూడా శిరోభూషణం ముకుటకిరీటాదికం
తత్ర స్థితో మణిః। శాకపార్థివాదిత్వాత్ సమాసః।

బి) 'తతశ్చూడామణిం నిష్కమఙ్గదే కుణ్డలాని చ।'

సి) '**చూడామణిం** చ విద్వాంసో వదన్తి శిరసి స్థితమ్'।

– అని హలాయుధకోశము

డి) "సూర్యగ్రహః సూర్యవారే సోమే సోమగ్రహస్తథా।
**చూడామణి**రయం యోగస్తత్రానన్తం ఫలం స్మృతమ్॥"
అన్యస్మాద్ గ్రహణాత్ కోటిగుణమత్ర ఫలం లభేత్॥

– ఇతి హలాయుధకోషవ్యాఖ్యాయామ్।

**క్రియాదర్శము:–** రఞ్జయన్తు – 'రఞ్జ – రాగే' (రంగువేయుట), సకర్మకమ్, అనిట్, (ఉభయ), పరస్మైపదీ, ణిజన్తాత్, లోట్ – ప్రథమపురుషబహువచనాంతః।
రఞ్జయతు / రఞ్జయతాత్ – రఞ్జయతామ్ – **రఞ్జయన్తు.**

---

**శ్లో॥ ఉమా వధూర్భవాన్ దాతా – యాచితార ఇమే వయమ్।**
**వరశ్శమ్భురలం హ్యేష – త్వత్కులోద్భూతయే విధిః॥ 82**

**పదవిభాగము:–** ఉమా, వధూః, భవాన్, దాతా, యాచితారః, ఇమే, వయమ్, వరః, శమ్భుః, అలమ్, హి, ఏషః, త్వత్కులోద్భూతయే, విధిః।

**అన్వయక్రమము:–** ఉమా వధూః, భవాన్ దాతా, ఇమే వయం యాచితారః, శమ్భుః వరః, ఏషః విధిః త్వత్కులోద్భూతయే అలమ్ హి।

**ప్రతిపదార్థము:–** ఉమా – పార్వతీదేవి, వధూః – పెండ్లికూతురు, భవాన్ – మీరు (నీవు), దాతా – కన్యాదాతవు, ఇమే + వయమ్ – ఈ మేము, యాచితారః – వేడువారము, శమ్భుః – పరమశివుడు, వరః – పెండ్లికుమారుడు, ఏషః విధిః – ఈ సామగ్రి, త్వత్కులోద్భూతయే – నీ వంశౌన్నత్యముకొఱకు, అలమ్ – చాలును, హి – గదా!

**తాత్పర్యము:–** పార్వతీదేవి పెండ్లికూతురు. నీవు కన్యాదాతవు. మేము వేడువారము.

పరమశివుడు పెండ్లికుమారుడు. ఈ సామగ్రి నీ వంశౌన్నత్యముకొఱకు చాలునుగదా!

**విభక్తులు / క్రియలు:–** 1. అలమ్, హి – అవ్యయాలు 2. ఉమా – **ఉమా**, ఉమే, ఉమాః ; ఆకారాన్త స్త్రీలింగ ఉమాశబ్దము. ప్ర.ఏ. 3. వధూః – **వధూః**, వధ్వౌ, వధ్వః; ఊకారాన్త స్త్రీలింగ వధూశబ్దము. ప్ర.ఏ. 4. భవాన్ – **భవాన్,** భవన్తౌ, భవన్తః; తకారాన్త పుంలింగ భవత్‌శబ్దము. ప్ర.ఏ. 5. దాతా – **దాతా**, దాతారౌ, దాతారః; ఋకారాన్త పుంలింగ దాతృశబ్దము. ప్ర.ఏ. 6. ఇమే – అయమ్, ఇమౌ, **ఇమే**; మకారాన్త పుంలింగ 'ఇదమ్'శబ్దము ప్ర.ఏ. 7. వయమ్ – అహమ్, ఆవామ్, వయమ్; దకారాన్త 'అస్మ'చ్ఛబ్దము. ప్ర.బ. 8. యాచితారః – యాచితా, యాచితారౌ, **యాచితారః**; ఋకారాన్త పుంలింగ యాచితృశబ్దము. ప్ర.బ. 9. శమ్భుః – **శమ్భుః**, శమ్భూ, శమ్భవః ఉకారాన్త పుంలింగ 'శమ్భు'శబ్దము. ప్ర.ఏ. 10. వరః – **వరః**, వరౌ, వరాః అకారాన్త పుంలింగ వరశబ్దము. ప్ర.ఏ. 11. విధిః – **విధిః**, విధీ, విధయః; ఇకారాన్త పుంలింగ విధిశబ్దము. ప్ర.ఏ. 12. త్వత్కులోద్భూతయే – **...భూతయే,** ...భూతాభ్యామ్, ...భూతిభ్యః; ఇకారాన్త స్త్రీలింగ ...భూతిశబ్దము. చ.ఏ.

**సమాసాలు:–**

1. త్వత్కులోద్భూతయే – తవ కులం త్వత్కులమ్ (ష.త.), త్వత్కులస్య ఉద్భూతిః (ష.త.) త్వత్కులోద్భూతిః, తస్యై।

**సంధులు:–**

1. వధూః + భవాన్ – వధూర్భవాన్ – విసర్గసన్ధిః।
2. యాచితారః + ఇమే – యాచితార ఇమే – విసర్గలోపసన్ధిః।
3. వరః + శమ్భుః – వరశ్శమ్భుః – విసర్గాదేశః, **వా శరి।**
4. శమ్భుః + అలమ్ – శమ్భురలమ్ – విసర్గసన్ధిః।
5. హి + ఏషః – హ్యేషః – యణాదేశసన్ధిః।
6. ఏషః + త్వత్...– ఏష త్వత్ ... – సులోపః।
7. కుల + ఉద్భూతయే – కులోద్భూతయే – గుణసన్ధిః।

**వా శరి** (సూ 8–3–36) శషస వర్ణములు పరముగా నున్నప్పుడు విసర్గమునకు శషసలు వికల్పముగ వచ్చును. రాని పక్షమున విసర్గమునకు విసర్గమే వచ్చును.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావప్రయోగాలు:–**

1. **అలమ్** – అవ్యయకోషః (116)
"**అలం** భూషణపర్యాప్తిశక్తివారణనిషేధేషు।"

85



1. భూషణే – **అలం**కారః। అలంకృత్య।
2. పర్యాప్తౌ – **అల**మస్యస్య ధనమ్। పర్యాప్తమస్తీత్యర్థః।
3. శక్తౌ – **అలం మల్లో మల్లాయ। మల్లో – యం మల్లాన్తరేణ సాకం యోద్ధుం శక్త ఇత్యర్థః। 'అన్యథా** ప్రాతరాశాయ కుర్యామ త్వామ్ **అలం** వయమ్' (భ.కా. 8–98)
4. వారణే – **'అలం** మహీపాల తవ శ్రమేణ – ' ర.వం. 2–34
5. నిషేధే – 'ఆలప్యాలమ్ ఇదం బభ్రోర్యత్స దారాన్ అపాహరత్' (మాఘే 2–40)। అలంకృత్వా।

---

**శ్లో॥ అస్తోతుః స్తూయమానస్య – వన్ద్యస్యానన్యవన్దినః।**
**సుతాసంబన్ధవిధినా – భవ విశ్వగురోర్గురుః॥ 83**

**పదవిభాగము:–** అస్తోతుః, స్తూయమానస్య, వన్ద్యస్య, అనన్యవన్దినః, సుతాసంబన్ధవిధినా, భవ, విశ్వగురోః, గురుః।

**అన్వయక్రమము:–** అస్తోతుః స్తూయమానస్య వన్ద్యస్య అనన్యవన్దినః విశ్వగురోః సుతాసంబన్ధవిధినా గురుః భవ।

**ప్రతిపదార్థము:–** అస్తోతుః – స్తుతింపనివాడై, స్తూయమానస్య – స్తుతింపబడుచున్న వాడును, అనన్యవన్దినః – ఒరులకు మ్రొక్కనివాడై, వన్ద్యస్య – అందఱిచే మ్రొక్కబడువాడును అగు, విశ్వగురోః – జగత్పితకు, సుతాసంబన్ధవిధినా – కొమారితను ఇచ్చుట అను కార్యముచే, గురుః – పెద్దవు, భవ – అగుము.

**తాత్పర్యము:–** స్తుతింపనివాడై స్తుతింపబడుచున్నవాడును, ఒరులకు మ్రొక్కనివాడై అందఱిచే మ్రొక్కబడువాడును అగు జగత్పితకు కొమారితను ఇచ్చుట అను కార్యముచే పెద్దవు అగుము.

**పాఠాన్తరాలు:–** 1. వన్ద్యస్య – వరస్య

**విభక్తులు / క్రియలు :–** 1. అస్తోతుః – **అస్తోతుః**, అస్తోత్రోః, అస్తోతౄణామ్; ఋకారాన్త పుంలింగ అస్తోతృశబ్దము. ష.ఏ. 2. స్తూయమానస్య – **స్తూయమానస్య**, స్తూయమానయోః, స్తూయమానానామ్; అకారాన్త పుంలింగ స్తూయమానశబ్దము. ష.ఏ. 3. వన్ద్యస్య – **వన్ద్యస్య** , వన్ద్యయోః వన్ద్యానామ్; అకారాన్త పుంలింగ వన్ద్యశబ్దము. ష.ఏ. 4. అనన్యవన్దినః – **అనన్యవన్దినః**, అనన్యవన్దినోః

అనన్యవన్దినామ్; నకారాన్త పుంలింగ అనన్యవన్దిన్‌శబ్దము ష.ఏ. 5. విశ్వగురోః - **విశ్వగురోః,** విశ్వగుర్వోః, విశ్వగురూణామ్; ఉకారాన్త పుంలింగ విశ్వగురుశబ్దము. ష.ఏ. 6. సుతాసంబన్ధవిధినా - **...విధినా,** ...విధిభ్యామ్, ...విధిభిః; ఇకారాన్త పుంలింగ ...విధిశబ్దము. తృ.ఏ. 7. గురుః - **గురుః,** గురూ, గురవః; ఉకారాన్త పుంలింగ గురుశబ్దము. ప్ర.ఏ. 8. భవ - క్రియ.

**సమాసాలు / విగ్రహవాక్యాలు:-**

1. అస్తోతుః - స్తౌతీతి స్తోతా, న స్తోతా అస్తోతా, (నఞ్‌తత్పురుష) తస్య।
2. స్తూయమానస్య - స్తూయతే ఇతి స్తూయమానః, తస్య।
3. వన్ద్యస్య - వన్దితుం యోగ్యః వన్ద్యః, తస్య।
4. అనన్యవన్దినః - అన్యం వన్దతే తచ్ఛీలః అన్యవన్దీ, ణి నిప్రత్యయః।
న అన్యవన్దీ (నఞ్‌తత్పురుష) అనన్యవన్దీ, తస్య।
5. విశ్వగురోః - విశ్వస్య గురుః (ష.త.) విశ్వగురుః, తస్య।
6. సుతాసంబంధవిధినా - సుతాయాః సమ్బన్ధః (ష.త.) సుతాసమ్బన్ధః, తస్య విధిః (ష.త.) సుతాసమ్బన్ధవిధిః, తేన।

**సంధులు:-**

1. వన్ద్యస్య + అనన్యవన్దినః - వన్ద్యస్యానన్యవన్దినః - సవర్ణదీర్ఘసన్ధిః।
2. విశ్వగురోః + గురుః - విశ్వగురోర్గురుః - విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

1. శ్వశురస్యాపి గురుత్వం స్మృతి ప్రసిద్ధమ్। యథా హి-
"శ్లో॥ పిత్రాదయస్త్రయో భ్రాతా పితుర్మాతామహస్తథా।
జ్యేష్ఠభ్రాతా మాతులశ్చ శ్వశురో గురవస్త్విమే॥" ఇతి।
- ఇతి 'వివరణమ్' వ్యాఖ్యాయామ్.

**క్రియాదర్శము:- భవ** - 'భూ - సత్తాయామ్' - లోట్ - మధ్యమపురుషైకవచనాంతః
**భవ** / భవతాత్ - భవతమ్ - భవత.

---

**శ్లో॥ ఏవంవాదిని దేవర్షౌ - పార్శ్వే పితురధోముఖీ।**
**లీలాకమలపత్త్రాణి - గణయామాస పార్వతీ॥ 84**

**పదవిభాగము:-** ఏవంవాదిని, దేవర్షౌ, పార్శ్వే, పితుః, అధోముఖీ, లీలాకమల పత్త్రాణి, గణయామాస, పార్వతీ।





**అన్వయక్రమము:-** దేవర్షౌ ఏవంవాదిని (సతి) పార్వతీ పితుః పార్శ్వే అధోముఖీ (సతీ) లీలాకమలపత్త్రాణి గణయామాస।

**ప్రతిపదార్థము:-** దేవర్షౌ - అంగిరోముని (సతిసప్తమి), ఏవంవాదిని - ఇట్లు చెప్పుచున్నవాడు కాగా, పార్వతీ - పార్వతీదేవి, పితుః - తండ్రికి, పార్శ్వే - సమీపమున, అధోముఖీ - తలవంచుకొన్నదై, లీలాకమలపత్త్రాణి - విలాసకమలము యొక్క దళములను, గణయామాస - లెక్కించెను.

**తాత్పర్యము:-** అంగిరోముని ఇట్లు చెప్పుచున్నవాడగుచుండ పార్వతీదేవి తండ్రికి సమీపమున తలవంచుకొన్నదై విలాసకమలముయొక్క దళములను లెక్కించెను.

**విభక్తులు / క్రియలు:-** 1. దేవర్షౌ - **దేవర్షౌ,** దేవర్ష్యోః, దేవర్షిషు; ఇకారాన్త పుంలింగ దేవర్షిశబ్దము. స.ఏ. 2. ఏవంవాదిని - **ఏవంవాదిని,** ఏవంవాదినోః, ఏవంవాదిషు; నకారాన్త పుంలింగ ఏవంవాదిన్‌శబ్దము. స.ఏ. 3. పార్వతీ - **పార్వతీ,** పార్వత్యౌ, పార్వత్యః; ఈకారాన్త స్త్రీలింగ పార్వతీశబ్దము. ప్ర.ఏ. 4. పితుః - **పితుః,** పిత్రోః, పితౄణామ్; ఋకారాన్త పుంలింగ పితృశబ్దము. ష.ఏ. 5. పార్శ్వే - **పార్శ్వే,** పార్శ్వయోః, పార్శ్వేషు; అకారాన్త పుంలింగ పార్శ్వశబ్దము స.ఏ. 6. అధోముఖీ - **అధోముఖీ,** అధోముఖ్యౌ, అధోముఖ్యః; ఈకారాన్త స్త్రీలింగ అధోముఖీశబ్దము. ప్ర.ఏ. 7. లీలాకమలపత్త్రాణి - ...పత్త్రమ్, ...పత్త్రే, **...పత్త్రాణి;** అకారాన్త నపుంసకలింగ ...పత్త్రశబ్దము. ద్వి.బ. 8. గణయామాస - క్రియ - లిట్ - ణిజన్తాత్.

**సమాసాలు / విగ్రహవాక్యాలు:-**

1. ఏవంవాదిని - ఏవం వదతీతి ఏవంవాదీ (కృ.వృ.) తస్మిన్।
2. దేవర్షౌ - దేవశ్చాసౌ ఋషిశ్చ - దేవర్షిః (కర్మధా.), తస్మిన్।
3. అధోముఖీ - అధః ముఖం యస్యాః (బహువ్రీహిః) సా।
4. లీలాకమలపత్త్రాణి - లీలాయై కమలమ్ - లీలాకమలమ్ (చ.త.). లీలాకమలస్య పత్త్రాణి (ష.త.) తాని।

**సంధులు:-**

1. పితుః + అధోముఖీ - పితురధోముఖీ - విసర్గసన్ధిః।
2. అధః + ముఖీ - అధోముఖీ - విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:**

**1. పితా - (ఋ.) (పుం.)**

ఎ) పాతి రక్షత్యపత్యం యః। 'పా - రక్షణే + నప్తృ...దుహితృ' ఇతి తృచ్ ప్రత్యయేన నిపాతనాత్ సాధుః।

బి) శ్లో॥ "అన్నదాతా భయత్రాతా యస్య కన్యా వివాహితా।
జనితా చోపనేతా చ పఞ్చైతే **పితరః** స్మృతాః॥" – ఇతి చాణక్యః।

సి) శ్లో॥ "కన్యాదాతాన్నదాతా చ జ్ఞానదాతాభయప్రదః।
జన్మాదో మన్త్రదో జ్యేష్ఠభ్రాతా చ **పితరః** స్మృతాః॥" – ఇతి బ్రహ్మవైవర్తే।

డి) శ్లో॥ "మాన్యః పూజ్యశ్చ సర్వేభ్యః సర్వేషాం జనకో భవేత్।
అహోయస్య ప్రసాదేన సర్వాన్ పశ్యతి మానవః।

శ్లో॥ జనకో జన్మదాతా చ రక్షణాచ్చ **పితా** నృణామ్।
తాతో వస్తీర్ణకరణాత్ కలయా సా ప్రజాపతిః॥" – ఇతి బ్రహ్మవైవర్తే।

ఇ) శ్లో॥ "ఉపాధ్యాయః **పితా** జ్యేష్ఠో భ్రాతా చైవ మహీపతిః।
మాతులః శ్వశురస్త్రాతా మాతామహపితామహౌ।
బన్ధుర్జ్యేష్ఠపితృవ్యశ్చ పుంస్యేతే గురవః స్మృతాః।" – ఇతి కౌర్మే।

ఎఫ్) 1. ఆవుకస్తు **పితా**.... అని హలాయుధకోశము (99)
2. ...వప్తా చ తాతో జనకః **పితా** చ – అని హలాయుధకోశము (504)

2. అత్ర దేవర్షీణాం పితుశ్చ వచనాకర్ణనకౌతుకాత్ పితృపార్శ్వవర్తిన్యా దేవ్యా లజ్జాఖ్యో భావో – నేన వాక్యేన ధ్వన్యతే। అలక్ష్యక్రమో లక్ష్యక్రమశ్చేతి ద్వివిధో హి ధ్వనిః। తత్ర రసభావాదిధ్వనిరలక్ష్యక్రమః। తథాప్యత్ర భావధ్వనిర్లక్ష్యక్రమ ఏవ। లీలాకమలపత్రగణనాధోముఖత్వాభ్యాం ఝటితి లజ్జాయాః ప్రతీత్యనుదయాత్ పూర్వానురాగతపశ్చర్యాద్యనుసన్ధానక్రమేణ ప్రతీతేశ్చ। తీలాపత్రగణనమధోముఖత్వం చ లజ్జాయా **అనుభావః**, దేవర్షి వాక్యమాలమ్బ**నవిభావః**। పితృపార్శ్వవర్తన**ముద్దీపన విభావః**। – ఇతి 'వివరణమ్' వ్యాఖ్యాయామ్।

**క్రియాదర్శము:–** **గణయామాస** – 'గణ – సంఖ్యానే' లిట్ – ప్రథమపురుషైక వచనాంతః। ణిజన్తాత్ –

**గణయామాస** – గణయామాసతుః – గణయామాసుః

---

**అవతారికా:–** హిమవతః కన్యాదానకల్పః – హిమవంతుడు కన్యాదానము చేయసంకల్పించుట





**శ్లో॥ శైలః సంపూర్ణకామో – పి – మేనాముఖముదైక్షత।
ప్రాయేణ గృహిణీనేత్రాః – కన్యార్థేషు కుటుమ్బినః॥ 85**

**పదవిభాగము:–** శైలః, సంపూర్ణకామః, అపి, మేనాముఖమ్, ఉదైక్షత, ప్రాయేణ, గృహిణీనేత్రాః, కన్యార్థేషు, కుటుమ్బినః।

**అన్వయక్రమము:–** శైలః సంపూర్ణకామః అపి మేనాముఖమ్ ఉదైక్షత। (తథాహి) ప్రాయేణ కుటుమ్బినః కన్యార్థేషు గృహిణీనేత్రాః భవన్తి।

**ప్రతిపదార్థము:–** శైలః – హిమవంతుడు, సంపూర్ణకామః అపి – సిద్ధమైన ఇచ్ఛ గలవాడు ఐనను, మేనాముఖమ్ – భార్యయగు మేనాదేవిమోమును, ఉదైక్షత – చూచెను, ప్రాయేణ – తఱుచుగా, కుటుమ్బినః – గృహస్థులు, కన్యార్థేషు – కన్యా ప్రయోజనములందు, గృహిణీనేత్రాః – ఇల్లాలే కన్నుగా గలవారుగ, (భవన్తి) – అగుచున్నారు.

**తాత్పర్యము:–** హిమవంతుడు సిద్ధేచ్ఛగలవాడయినను భార్యయగు మేనాదేవి మోమును చూచెను. గృహస్థులు కన్యాప్రయోజనములందు ఇల్లాలే కన్నుగా గలవారగుదురు.

**పాఠాన్తరాలు:–** 1. నేత్రాః – తంత్రాః 2. కన్యార్థేషు – కన్యార్థే హి

**విభక్తులు / క్రియలు :–** 1. శైలః – **శైలః**, శైలౌ, శైలాః; అకారాన్త పుంలింగ శైలశబ్దము. ప్ర.ఏ. 2. సంపూర్ణకామః – **సంపూర్ణకామః**, సంపూర్ణకామౌ, సంపూర్ణకామాః; అకారాన్త పుంలింగ సంపూర్ణకామశబ్దము. ప్ర.ఏ. 3. మేనాముఖమ్ – **మేనాముఖమ్**, మేనాముఖే, మేనాముఖాని; అకారాన్త నపుంసకలింగ మేనాముఖశబ్దము. ద్వి.ఏ. 4. ఉదైక్షత – క్రియ 5. ప్రాయేణ – అవ్యయము 6. కుటుమ్బినః – కుటుమ్బీ, కుటుమ్బినౌ, **కుటుమ్బినః**; నకారాన్త పుంలింగ కుటుమ్బిన్‌శబ్దము. ప్ర.బ. 7. కన్యార్థేషు – కన్యార్థే, కన్యార్థయోః, **కన్యార్థేషు**; అకారాన్త పుంలింగ కన్యార్థశబ్దము. స.బ. 8. గృహిణీనేత్రాః – గృహిణీనేత్రః, గృహిణీనేత్రౌ, **గృహిణీనేత్రాః;** అకారాన్త పుంలింగ ...నేత్రశబ్దము. ప్ర.బ.

**సమాసాలు:–**

1. సంపూర్ణకామః – సంపూర్ణః కామః యస్య (బహువ్రీహిః) సః।
2. మేనాముఖమ్ – మేనాయాః ముఖమ్ (ష.త.) మేనాముఖమ్।
3. కన్యార్థేషు – కన్యానామ్ అర్థాః – కన్యార్థాః (ష.త.) తేషు।
4. గృహిణీనేత్రాః – గృహిణీ నేత్రం యేషాం (బహువ్రీహిః) తే గృహిణీనేత్రాః

**సంధులు:-**

1. సంపూర్ణకామః + అపి - సంపూర్ణకామో - పి - ఉత్వాదేశః, పూర్వరూపసన్ధిః
2. కన్యా + అర్థేషు - కన్యార్థేషు - సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1. గృహిణీ (స్త్రీ.) -**

ఎ) గృహం గృహస్వామిత్వమస్త్యస్యా ఇతి। ఇని జీప్ చ। భార్యా.

బి) శ్లో॥ **గృహిణీ** సచివః సఖీ మిథః ప్రియశిష్యా లలితే కలావిధౌ।
కరుణావిముఖేన మృత్యునా హరతా త్వాం కిం న మే హృతమ్॥
- ఇతి రఘువంశే 8 - 67

సి) గృహం గృహకార్యం సాధ్యతయా - స్త్యస్యా ఇతి, ఇని జీప్ చ। గృహకర్మకుశలాస్త్రీ।

డి) శ్లో॥"శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తిం సపత్నీజనే
భర్తుర్విప్రకృతాపి రోషణతయా మా స్మ ప్రతీపం గమః।
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే భోగేష్వనుత్సేకినీ
యాన్త్యేవం **గృహిణీ**పదం యువతయో వామాః కులస్యాధయః।"
- ఇతి శాకున్తలే - చతుర్థాఙ్కే।

ఇ) శ్లో॥ దారాః క్షేత్రం కలత్రం చ భార్యా సహచరీ వధూః।
సధర్మచారిణీ పత్నీ జాయా చ **గృహిణీ** గృహాః॥ 494
- అని హలాయుధకోశము '11' నామములను పేర్కొన్నది.

ఎఫ్) గృహిణీ - గృహణీ

**క్రియాదర్శము:- ఉదైక్షత** - ఉత్ - ఉపసర్గ, 'ఈక్ష - దర్శనే' (దర్శించుట), సకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, భ్వాదిప్రకరణమ్ (1), లఙ్ - ప్రథమపురుషైక వచనాంతః। **ఉదైక్షత** - ఉదేక్షేతామ్ - ఉదేక్షన్త.

---

**శ్లో॥ మేనే మేనాపి తత్ సర్వం - పత్యుః కార్యమభీప్సితమ్।**
**భవన్త్యవ్యభిచారిణ్యో - భర్తురిష్టే పతివ్రతాః॥ 86**

**పదవిభాగము:-** మేనే, మేనా, అపి, తత్, సర్వమ్, పత్యుః, కార్యమ్, అభీప్సితమ్, భవన్తి, అవ్యభిచారిణ్యః, భర్తుః, ఇష్టే, పతివ్రతాః।





**అన్వయక్రమము:-** మేనా అపి పత్యుః తత్ సర్వమ్ అభీప్సితం కార్యం మేనే। (తథాహి) పతివ్రతాః భర్తుః ఇష్టే అవ్యభిచారిణ్యః, భవన్తి।

**ప్రతిపదార్థము:-** మేనా అపి - మేనాదేవియును, పత్యుః - భర్తయొక్క, అభీప్సితమ్ - ఇష్టమైన, తత్ కార్యమ్ సర్వమ్ - ఆ కార్యమునంతయు, మేనే - అంగీకరించెను. పతివ్రతాః - పతివ్రతలు, భర్తుః - భర్తయొక్క, ఇష్టే - కోరికయందు, అవ్యభిచారిణ్యః - తప్పనివారు, భవన్తి - అగుదురు.

**తాత్పర్యము:-** మేనాదేవియును భర్తయొక్క ఇష్టమైన ఆ కార్యమునంతయు అంగీకరించెను. పతివ్రతలు భర్తయొక్క కోరికయందు తప్పనివారుగ అగుదురు.

**పాఠాన్తరాలు:-** 1. సర్వమ్ - సద్యః

**విభక్తులు / క్రియలు :-** 1. మేనా - **మేనా**, మేనే, మేనాః; ఆకారాన్త స్త్రీలింగ మేనాశబ్దము. ప్ర.ఏ. 2. పత్యుః - **పత్యుః**, పత్యోః, పతీనామ్; ఇకారాన్త పుంలింగ పతిశబ్దము, హరివత్, తృతీయారభ్య విశేషణే. 3. తత్ - **తత్**, తే, తాని; దకారాన్త నపుంసకలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ. 4. సర్వమ్ - **సర్వమ్**, సర్వే, సర్వాణి; అకారాన్త నపుంసకలింగ సర్వశబ్దము. ప్ర.ఏ. 5. అభీప్సితమ్ - **అభీప్సితమ్,** అభీప్సితే, అభీప్సితాని; అకారాన్త నపుంసకలింగ అభీప్సితశబ్దము. ప్ర.ఏ. 6. కార్యమ్ - **కార్యమ్,** కార్యే, కార్యాణి; అకారాన్త నపుంసకలింగ కార్యశబ్దము. ప్ర.ఏ. 7. మేనే - క్రియ, భవన్తి - క్రియ 8. పతివ్రతాః - పతివ్రతా, పతివ్రతే, **పతివ్రతాః;** ఆకారాన్త స్త్రీలింగ పతివ్రతాశబ్దము. ప్ర.బ. 9. భర్తుః - **భర్తుః,** భర్త్రోః, భర్తౄణామ్; ఋకారాన్త పుంలింగ భర్తృశబ్దము. ష.ఏ. 10. ఇష్టే - ఇష్టే, ఇష్టయోః, ఇష్టేషు; అకారాన్త నపుంసకలింగ ఇష్టశబ్దము. స.ఏ. 11. అవ్యభిచారిణ్యః - అవ్యభిచారిణీ, అవ్యభిచారిణ్యౌ, **అవ్యభిచారిణ్యః;** ఈకారాన్త స్త్రీలింగ అవ్యభిచారిణీశబ్దము. ప్ర.బ.

**సమాసాలు:-**

1. అవ్యభిచారిణ్యః - న వ్యభిచారిణ్యః (నఞ్తత్పురుష)।
2. పతివ్రతాః - పతిరేవ వ్రతం యాసాం (బహువ్రీహిః) తాః।

**సంధులు:-**

1. మేనా + అపి - మేనాపి - సవర్ణదీర్ఘసన్ధిః।
2. అభి + ఈప్సితమ్ - అభీప్సితమ్ - సవర్ణదీర్ఘసన్ధిః।
3. భవన్తి + అవ్యభిచారిణ్యః - భవన్త్యవ్యభిచారిణ్యః - యణాదేశసన్ధిః।
4. అవ్యభిచారిణ్యః + భర్తుః - అవ్యభిచారిణ్యో భర్తుః - ఉత్వాదేశః।
5. భర్తుః + ఇష్టే - భర్తురిష్టే - విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1.పతివ్రతా – (స్త్రీ.)**

ఎ) పత్యౌ వ్రతం నియమః అస్యాః, **పతివ్రత**మస్యా వా।
పతిశబ్దః పతిసేవాయాం లాక్షణికః। సాధ్వీ, సతీ।

బి) శ్లో॥ **...పతివ్రతా** సుచరితా సతీ సాధ్వీ। 495
– అని హలాయుధకోశము '4' నామములను పేర్కొన్నది.

అలంకారాలు:– అత్ర శ్లోకే అర్థాన్తరన్యాసాలంకారః। ఇట సామాన్యముచే విశేషము సమర్థింపబడినది.

క్రియాదర్శము:– **1. మేనే** – 'మను – అవబోధనే' (తెలియుట) సకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, తనాది ప్రకరణమ్ (8), లిట్ – ప్రథమపురుషైక వచనాంతః।

**మేనే** – మేనాతే – మేనిరే

శ్లో॥ ప్రవేశ్య చైనం పురమగ్రయాయీ
నీచైస్తథోపాచరదర్పితశ్రీః।
**మేనే** యథా తత్ర జనస్సమేతో
వైదర్భమాగన్తుమజం గృహేశమ్॥ – ఇతి రఘువంశే 5-62

2. భవన్తి – 'భూ – సత్తాయామ్' లట్ – ప్రథమపురుషైకబహువచనాంతః।

---

**శ్లో॥ ఇదమత్రోత్తరం న్యాయ్య – మితి బుద్ధ్వా విమృశ్య సః।**
**ఆదదే వచసామన్తే – మఙ్గలాలంకృతాం సుతామ్॥ 87**

**పదవిభాగము:–** ఇదమ్, అత్ర, ఉత్తరమ్, న్యాయ్యమ్, ఇతి, బుద్ధ్వా, విమృశ్య, సః ఆదదే, వచసామ్, అన్తే, మంగలాలంకృతామ్, సుతామ్।

**అన్వయక్రమము:–** సః వచసామ్ అన్తే 'అత్ర ఇదం న్యాయ్యమ్ ఉత్తరమ్' ఇతి బుద్ధ్వా విమృశ్య మంగలాలంకృతాం సుతామ్ ఆదదే।

**ప్రతిపదార్థము:–** సః – ఆ హిమవంతుడు, వచసామ్ – (అంగిరోముని) మాటలయొక్క, అన్తే – చివరయందు, అత్ర – ఈ విషయమున, ఇదమ్ – ఇది, న్యాయ్యమ్ – న్యాయమయిన, ఉత్తరమ్ – ప్రత్యుత్తరము, ఇతి – అని, బుద్ధ్వా –

89



బుద్ధిచేత, విమృశ్య – ఆలోచించి, మంగలాలంకృతామ్ – మంగళకరముగ అలంకరింపబడిన, సుతామ్ – కొమారితను, ఆదదే – చేతులతో పట్టుకొనెను.

**తాత్పర్యము:–** ఆ హిమవంతుడు మునిమాటలయొక్క చివరయందు ఈ విషయమున ఇది న్యాయమైన ప్రత్యుత్తరమని బుద్ధిచేత ఆలోచించి మంగళకరముగ ఆలంకరింపబడిన కొమారితను చేతులతో పట్టుకొనెను.

**విభక్తులు / క్రియలు:–** 1. సః – **సః**, తౌ, తే; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ. 2. వచసామ్ – వచసః, వచసోః, **వచసామ్;** సకారాన్త నపుంసకలింగ వచశ్శబ్దము. ష.బ. 3. అన్తే – **అన్తే**, అన్తయోః, అన్తేషు; అకారాన్త నపుంసకలింగ అన్తశబ్దము. స.ఏ. 4. అత్ర, ఇతి – అవ్యయాలు 5. ఇదమ్ – **ఇదమ్**, ఇమే, ఇమాని; మకారాన్త నపుంసకలింగ ఇదమ్ శబ్దము. ప్ర.ఏ. 6. న్యాయ్యమ్ – **న్యాయ్యమ్,** న్యాయ్యే, న్యాయ్యాని; అకారాన్త నపుంసకలింగ న్యాయ్యశబ్దము, ప్ర.ఏ. 7. ఉత్తరమ్ – **ఉత్తరమ్**, ఉత్తరే, ఉత్తరాణి; అకారాన్త నపుంసకలింగ ఉత్తరశబ్దము. ప్ర.ఏ. 8. బుద్ధ్వా – **బుద్ధ్వా,** బుద్ధిభ్యామ్, బుద్ధిభిః; ఇకారాన్త స్త్రీలింగ బుద్ధిశబ్దము. తృ.ఏ. 9. విమృశ్య – అవ్యయము 10. మంగలాలంకృతామ్ – **...కృతామ్,** ...కృతే, ...కృతాః; ఆకారాన్త స్త్రీలింగ ...కృతాశబ్దము. ద్వి.ఏ. 11. సుతామ్ – **సుతామ్,** సుతే, సుతాః; ఆకారాన్త స్త్రీలింగ సుతాశబ్దము. ద్వి..ఏ 12. ఆదదే – క్రియ

**సమాసాలు:–**

1. మంగలాలంకృతమ్ – మంగళం యథా తథా అలంకృతా, (కర్మధా.) మంగలాలంకృతా, తామ్।

**సంధులు:–**

1. అత్ర + ఉత్తరమ్ – అత్రోత్తరమ్ – గుణసన్ధిః।
2. మఙ్గల + అలంకృతామ్ – మఙ్గలాంకృతామ్ – సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:**

**1. న్యాయ్యమ్ – (త్రి.)**

ఎ) న్యాయాదనపేతమ్ । 'ధర్మపథ్యర్థన్యాయాదనపేతే' ఇతి యత్। (సూ 4-4-92) ఉచితమ్, న్యాయయుక్తమ్।

బి) శ్లో॥ 'ప్రియా **న్యాయ్యా** వృత్తిర్మలినమసుభఙ్గే – ప్యసుకరమ్' – ఇతి నీతిశతకే.

సి) శ్లో॥ సేయం స్వదేహార్పణ నిష్క్రయేణ
**న్యాయ్యా** మయా మోచయితుం భవత్తః।
న పారణా స్యాద్విహతా తవైవం
భవేదలుప్తశ్చ మునేః క్రియార్థః॥ – ఇతి రఘువంశే 2-55

డి) శ్లో॥ శరీరవాఙ్మనోభిర్యత్ కర్మ ప్రారభతే నరః।
**న్యాయ్యం** వా విపరీతం వా పంచైతే తస్య హేతవః॥
- శ్రీమద్భగవద్గీత 18 -15

మానవుడు మనోవాక్కాయములతో ఆచరించు శాస్త్రానుకూలమైన లేక విపరీతమైన యే కర్మలైనను ఈ ఐదు హేతువులతో ఒప్పును.

ఇ) 1. శ్లో॥ **న్యాయ్యం** యద్యత్ర తత్కార్యం పర్యాయేణావిరోధిభిః।
నిశోపశాయః కర్తవ్యః ఫలోచ్చాయశ్చ సంహతైః॥
- ఇతి భట్టికావ్యే 7-41

2. శ్లో॥ శైలే విశ్రయిణం క్షిప్రమానాదరిణమభ్యమీ।
**న్యాయ్యం** పరిభవీ బ్రూహి పాపమవ్యథినం కపిమ్॥
- ఇతి భట్టికావ్యే 7-20

క్రియాదర్శము:- **ఆదదే** - ఆఙ్ - ఉపసర్గ, 'డుదాఞ్ - దానే' (ఇచ్చుట), సకర్మకమ్, అనిట్, (ఉభయ) ఆత్మనేపదీ, జుహోత్యాది ప్రకరణమ్ (3), లిట్ - ప్రథమపురుషైక వచనాంతః।

**ఆదదే** - ఆదదాతే - ఆదదిరే

శ్లో॥ స హి సర్వస్య లోకస్య - యుక్తదండతయా మనః।
**ఆదదే** నాతిశీతోష్ణో నభస్వానివ దాక్షిణః॥ - ఇతి రఘువంశే 4-8

---

శ్లో॥ **ఏహి విశ్వాత్మనే వత్సే - భిక్షాసి పరికల్పితా।**
**అర్థినో మునయః ప్రాప్తం - గృహమేధిఫలం మయా॥ 88**

**పదవిభాగము:-** ఏహి, విశ్వాత్మనే, వత్సే! భిక్షా, అసి, పరికల్పితా, అర్థినః, మునయః ప్రాప్తమ్, గృహమేధిఫలమ్, మయా।

**అన్వయక్రమము:-** హే వత్సే! ఏహి। విశ్వాత్మనే భిక్షా పరికల్పితా అసి। మునయః అర్థినః। మయా గృహమేధిఫలం ప్రాప్తమ్।

**ప్రతిపదార్థము:-** హే వత్సే! - ఓ బిడ్డా, ఏహి - రమ్ము, విశ్వాత్మనే - పరమశివునికొఱకు, భిక్షా - భిక్షగా, పరికల్పితా - నిశ్చయింపబడినదానవు, అసి - ఐతివి, మునయః - మునులు, అర్థినః - కోరువారు, మయా - నాచేత, గృహమేధిఫలమ్ - గృహస్థఫలము, ప్రాప్తమ్ - పొందబడినది.





**తాత్పర్యము:-** ఓ బిడ్డా! రమ్ము. పరమశివునికొఱకు భిక్షగా నిశ్చయింపబడినదానవు నీవు. మునులు కోరువారు. నాచేత గృహస్థఫలము పొందబడినది.

**పాఠాన్తరాలు:-** 1. విశ్వాత్మనే - సర్వాత్మనే 2. భిక్షాసి - భిక్షా త్వమ్

**విభక్తులు / క్రియలు:-** 1. హే వత్సే - **హే వత్సే!**, హే వత్సే!, హే వత్సాః!; ఆకారాన్త స్త్రీలింగ వత్సాశబ్దము. సం.ప్ర.ఏ. 2. ఏహి - క్రియ 3. విశ్వాత్మనే - **విశ్వాత్మనే,** విశ్వాత్మభ్యామ్, విశ్వాత్మభ్యః నకారాన్త పుంలింగ విశ్వాత్మన్‌శబ్దము. చ.ఏ. 4. భిక్షా - **భిక్షా**, భిక్షే, భిక్షాః; ఆకారాన్త స్త్రీలింగ భిక్షాశబ్దము. ప్ర.ఏ. 5. పరికల్పితా - **పరికల్పితా**, పరికల్పితే, పరికల్పితాః; ఆకారాన్త స్త్రీలింగ పరికల్పితాశబ్దము. ప్ర.ఏ. 6. అసి - అవ్యయము 7. మునయః - మునిః, మునీ, **మునయః**; ఇకారాన్త పుంలింగ మునిశబ్దము. ప్ర.బ. 8. అర్థినః - అర్థీ, అర్థినౌ, **అర్థినః;** నకారాన్త పుంలింగ అర్థిన్‌శబ్దము. ప్ర.బ. 9. మయా - **మయా**, ఆవాభ్యామ్, అస్మాభిః; దకారాన్త 'అస్మ'చ్ఛబ్దము. తృ.ఏ. 10. గృహమేధిఫలమ్ - **...ఫలమ్,** ...ఫలే, ...ఫలాని; అకారాన్త నపుంసకలింగ ఫలశబ్దము. ప్ర.ఏ. 11. ప్రాప్తమ్ - **ప్రాప్తమ్**, ప్రాప్తే, ప్రాప్తాని; అకారాన్త నపుంసకలింగ ప్రాప్తశబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు:-**

1. విశ్వాత్మనే - విశ్వమ్ ఆత్మా యస్య (బహువ్రీహిః) సః, విశ్వాత్మా, తస్మై।
2. గృహమేధిఫలమ్ - గృహమేధినః ఫలమ్ (ష.త.) గృహమేధిఫలమ్।

**సంధులు:-**

1. విశ్వ + ఆత్మన్ - విశ్వాత్మనే - సవర్ణదీర్ఘసన్ధిః।
2. భిక్షా + అసి - భిక్షాసి - సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:**

**1. గృహస్థః -**

ఎ) 'న గృహం గృహమిత్యాహుర్గృహిణీ గృహముచ్యతే'। అత ఏవ గృహేషు దారేషు తిష్ఠతి అభిరమతే ఇతి। గృహ + స్థా + 'సుపి స్థః' ఇతి క। గృహీ।

బి) శ్లో॥ **గృహస్థో** బ్రహ్మచారీ చ వానప్రస్థో - థ భిక్షుకః।
చత్వార ఆశ్రమాః ప్రోక్తాః సర్వే గార్హస్థ్యమూలకాః।

సి) శ్లో॥... **గృహస్థః** స్నాతకస్తథా। - అని హలాయుధకోశము

డి) శ్లో॥ **గృహస్థో** గోపయేద్దారాన్ విద్యామభ్యసయేత్సుతాన్।
పోషయేత్ స్వజనాన్ బన్ధూన్, ఏష **ధర్మస్సనాతనః**। - ఆర్యధర్మ.

గృహస్థు తన భార్యను సురక్షితముగా నుంచవలెను. బిడ్డలకు విద్య చెప్పించవలెను. స్వజనులను, బంధువును పోషించవలెను. ఇదే **సనాతన ధర్మము.**

ఇ) శ్లో॥ యథా వాయుం సమాశ్రిత్య, సర్వే జీవన్తి జన్తవః।
తథా **గృహస్థ**మాశ్రిత్య – వర్తన్త ఇతరాశ్రమాః॥ – మనుస్మృతి–3–77
శ్లో॥ యథా నదీనదాః సర్వే, సాగరే యాన్తి సంస్థితిమ్।
తథైవాశ్రమిణః సర్వే, **గృహస్థే** యాన్తి సంస్థితిమ్॥ – మనుస్మృతి 6–90

**క్రియాదర్శము:–**

1. **ఏహి** – ఆఙ్ – ఉపసర్గ, 'ఇణ్ – గతౌ' లోట్ – మధ్యమపురుషైకవచనాంతః
**ఏహి**/ఏతాత్ – ఏతమ్ – ఏత.

---

**శ్లో॥ ఏతావదుక్త్వా తనయా – మృషీనాహ మహీధరః।**
**'ఇయం నమతి వః సర్వాన్ – త్రిలోచనవధూరి'తి॥ 89**

**పదవిభాగము –** ఏతావత్, ఉక్త్వా, తనయామ్, ఋషీన్, ఆహ, మహీధరః, 'ఇయమ్, నమతి, వః, సర్వాన్, త్రిలోచనవధూః, ఇతి।

**అన్వయక్రమము:–** మహీధరః తనయామ్ ఏతావత్ ఉక్త్వా 'ఇయం త్రిలోచనవధూః వః సర్వాన్ నమతి' ఇతి ఋషీన్ ఆహ।

**ప్రతిపదార్థము:–** మహీధరః – హిమవంతుడు, తనయామ్ – కొమారితనుగూర్చి, ఏతావత్ – ఇంతమాత్రము, ఉక్త్వా – పల్కి, ఇయమ్ – ఈమె, త్రిలోచనవధూః – ముక్కంటిభార్య, వః – మీ, సర్వాన్ – అందఱిని గూర్చి, నమతి – నమస్కరించు చున్నది. ఇతి – అని, ఋషీన్ – ఋషులనుగూర్చి, ఆహ – పలుకుచున్నాడు.

**తాత్పర్యము:–** హిమవంతుడు కొమారితనుగూర్చి ఇంతమాత్రము పల్కి 'ఈమె ముక్కంటి భార్య. మీ అందఱిని గూర్చి నమస్కరించుచున్నది' అని ఋషులను గూర్చి పలుకుచున్నాడు.

**విభక్తులు / క్రియలు :** 1. మహీధరః – **మహీధరః**, మహీధరౌ, మహీధరాః; అకారాన్త పుంలింగ మహీధరశబ్దము. ప్ర.ఏ. 2. తనయామ్ – **తనయామ్**, తనయే, తనయాః; ఆకారాన్త స్త్రీలింగ తనయాశబ్దము. ద్వి.ఏ. 3. ఇతి – అవ్యయము 4. ఉక్త్వా – అవ్యయము 5. ఇయమ్ – **ఇయమ్,** ఇమే, ఇమాః; మకారాన్త స్త్రీలింగ ఇదమ్శబ్దము. ప్ర.ఏ. 6. త్రిలోచనవధూః – **...వధూః**, ...వధ్వౌ, ...వధ్వః; ఊకారాన్త స్త్రీలింగ వధూశబ్దము. ప్ర.ఏ. 7. వః – త్వామ్, యువామ్, **వః** దకారాన్త యుష్మచ్ఛబ్దము. ద్వి.బ 8. సర్వాన్ – సర్వమ్, సర్వౌ, **సర్వాన్;** అకారాన్త పుంలింగ సర్వనామసర్వశబ్దము. ద్వి.బ 9. నమతి – క్రియ 10. ఋషీన్ – ఋషిమ్, ఋషీ, **ఋషీన్;** ఇకారాన్త పుంలింగ ఋషిశబ్దము.





ద్వి.బ. 11. ఆహ – క్రియ 12. ఏతావత్ – **ఏతావత్,** ఏతావతీ, ఏతావన్తి; తకారాన్త నపుంసకలింగ ఏతావత్శబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు:–**

1. మహీధరః – ధరతీతి ధరః, మహ్యాః ధరః (ష.త.) మహీధరః।
2. త్రిలోచనవధూః – త్రీణి లోచనాని యస్య (బహువ్రీహిః) సః, త్రిలోచనః, త్రిలోచనస్య వధూః (ష.త.) త్రిలోచనవధూః।
3. ఏతావత్ – ఏతత్ పరిమాణం యస్య (బహువ్రీహిః) తద్, ఏతావత్, తత్।

**సంధులు:–**

1. ఏతావత్ + ఉక్త్వా – ఏతావదుక్త్వా – జశ్త్వసన్ధిః।
2. త్రిలోచనవధూః + ఇతి – త్రిలోచనవధూరితి – విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. ఋషిః (పుం.)**

ఎ) ఋషతి ప్రాప్నోతి సర్వాన్ మన్త్రాన్ జ్ఞానేన పశ్యతి సంసారపారం వా ఇతి।
బి) ఋష్ + 'ఇగుపధాత్ కిత్' ఇతి ఇన్ కిచ్చ।
సి) 'అగ్నిః పూర్వేభిరృషిభిరీడ్యో నూతనైరుత। **స దేవా ఏహ వక్ష్యతి'**
– ఇతి ఋగ్వేదే 1–1–2
డి) సప్త బ్రహ్మర్షి – దేవర్షి – మహర్షి – పరమర్షయః।
కాణ్డర్షిశ్చ శ్రుతిర్షిశ్చ రాజర్షిశ్చ క్రమావరాః। – ఇతిహలాయుధకోశవ్యాఖ్యాయామ్
ఇ) శ్లో॥ భృగుర్మరీచిరత్రిశ్చ అంగిరాః పులహః క్రతుః।
మనుర్దక్షో వశిష్ఠశ్చ పులస్త్యశ్చేతి తే దశ॥
శ్లో॥ బ్రహ్మణో మనసా హ్యేతే ఉత్పన్నాః స్వయమీశ్వరాః।
పరత్వేనర్షయస్తస్మాద్ భూతాస్తస్మాన్మహర్షయః॥ – ఇతి మత్స్యపురాణే
ఎఫ్) శ్లో॥ ఋషిస్త్రికాలదర్శీ స్యాత్మునిర్వాచం యయో మతః।
– అని హలాయుధకోశము.

**క్రియాదర్శము:–**

1. **నమతి** – 'ణము – ప్రహ్వత్వే శబ్దే' – లట్, ప్రథమపురుషైకవచనాంతః।
**నమతి** – నమతః – నమన్తి
2. **ఆహ** – 'బ్రూఞ్ – వ్యక్తాయాం వాచి' లట్ – ప్రథమపురుషైకవచనాంతః।
బ్రవీతి / **ఆహ** – బ్రూతః / ఆహతుః – బ్రువన్తి / ఆహుః।

**శ్లో॥ ఈప్సితార్థక్రియోదారం - తే - భినన్ద్య గిరేర్వచః।**
**ఆశీర్భిరేధయామాసుః - పురఃపాకాభిరమ్బికామ్॥ 90**

**పదవిభాగము:-** ఈప్సితార్థక్రియోదారమ్, తే, అభినన్ద్య, గిరేః, వచః, ఆశీర్భిః, ఏధయామాసుః, పురఃపాకాభిః, అమ్బికామ్।

**అన్వయక్రమము:-** తే ఈప్సితార్థక్రియోదారం గిరేః వచః అభినన్ద్య, అమ్బికాం పురఃపాకాభిః ఆశీర్భిః ఏధయామాసుః।

**ప్రతిపదార్థము:-** తే – ఆ మునులు, ఈప్సితార్థక్రియోదారమ్ – ఇష్టార్థాచరణమున గొప్పదియగు, గిరేః – హిమవంతునియొక్క, వచః – మాటను, అభినన్ద్య – అనుమోదించి, అమ్బికామ్ – పార్వతీదేవిని, పురఃపాకాభిః ఆశీర్భిః – వెంటనే ఫలించునాశీర్వాదములచేత, ఏధయామాసుః – వృద్ధి పొందజేసిరి.

**తాత్పర్యము:-** ఆ మునులు ఇష్టార్థాచరణమున గొప్పదియగు హిమవంతునిమాటను అనుమోదించి పార్వతీదేవిని సద్యఃఫలాశీర్వాదములచేత వృద్ధి పొందజేసిరి.

**పాఠాన్తరాలు:-** 1. ఏధయామాసుః – వర్ధయామాసుః

**విభక్తులు / క్రియలు:-** 1. తే – సః, తౌ, **తే;** దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము ప్ర.బ.2. ఈప్సితార్థక్రియోదారమ్ – **...ఉదారమ్,** ...ఉదారే, ...ఉదారాణి; అకారాన్త నపుంసక లింగ...ఉదారశబ్దము. ద్వి.ఏ. 3. గిరేః – **గిరేః**, గిర్యోః, గిరీణామ్; ఇకారాన్త పుంలింగ గిరిశబ్దము. ష.ఏ. 4. వచః – **వచః**, వచసీ, వచాంసి; సకారాన్త నపుంసకలింగ వచశ్శబ్దము. ద్వి.ఏ. 5. అభినన్ద్య – అవ్యయము 6. అమ్బికామ్ – **అమ్బికామ్,** అమ్బికే, అమ్బికాః; ఆకారాన్త స్త్రీలింగ అమ్బికాశబ్దము. ద్వి.ఏ. 7. పురః పాకాభిః – పురఃపాకయా, పురఃపాకాభ్యామ్, **పురఃపాకాభిః;** ఆకారాన్త స్త్రీలింగ పురఃపాకాశబ్దము. తృ.బ. 8. ఆశీర్భిః – ఆశిషా, ఆశీర్భ్యామ్, **ఆశీర్భిః** షాన్తః; స్త్రీలింగః 'ఆశిష్శబ్దః', తృ.బ. 9. ఏధయామాసుః – క్రియ.

**సమాసాలు:-**

1. ఈప్సితార్థక్రియోదారమ్ – ఈప్సితః చాసౌ అర్థః (కర్మధా.) ఈప్సితార్థః, తస్య క్రియా (ష.త.) ఈప్సితార్థక్రియా, తయా ఉదారమ్ (తృ.త.) ఈప్సితార్థక్రియోదారమ్। తత్।
2. పురఃపాకాభిః – పురస్కృతః పాకః యాసాం (బహుర్వీహిః) తాః, పురః పాకాః, తాభిః।

**సంధులు:-**

1. ఈప్సిత + అర్థ – ఈప్సితార్థ – సవర్ణదీర్ఘసన్ధిః।





2. క్రియా + ఉదారమ్ – క్రియోదారమ్ – గుణసన్ధిః।
3. తే + అభినన్ద్య – తే - భినన్ద్య – పూర్వరూపన్ధిః।
4. గిరేః + వచః – గిరేర్వచః – విసర్గసన్ధిః।
5. ఆశీర్భిః + ఏధయామాసుః – ఆశీర్భిరేధయామాసుః – విసర్గసన్ధిః।
6. పురఃపాకాభిః + అమ్బికామ్ – పురఃపాకాభిరమ్బికామ్ – విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:-**

**1. ఆశీః –** ఎ) షాన్త స్త్రీలింగః ఆశిష్శబ్దః।

బి) 'ఆఙః శాసు ఇచ్ఛాయామ్' అస్మాత్ క్విపి 'ఆశాసః కావుపధాయా ఇత్వం వాచ్యమ్' ఇత్యుపధాయా ఇత్వే 'శాసివసీ'తి షత్వే సోర్లేపే సతి షత్వస్యా - సిద్ధతాత్ రుత్వే 'ర్వోరి'తి దీర్ఘే రేఫస్య విసర్గః – ఇతి బృహచ్ఛబ్దకుసుమాకరే (120 పేజి)

సి) శ్లో॥ తస్మై **జయాశీః** ససృజే పురస్తాత్సప్తర్షిభిస్తాన్స్మితపూర్వమాహ।
వివాహయజ్ఞే వితతే - త్ర యూయమధ్వర్యవః పూర్వవృతా మయేతి।
– కుమారసమ్భవే 7–47

డి) **'ఆశీర్ధూఃపూర్గీర్ద్వారః'**। – 'లింగానుశాసనప్రకరణమ్'।

**క్రియాదర్శము :- ఏధయామాసుః** – ణిజన్తాత్ (ఉభయ) పరస్మైపదీ, లిట్ – ప్రథమ పురుషబహువచనాంతః। 'ఏధ – వృద్ధౌ'
ఏధయామాస – ఏధయామాసతుః – **ఏధయామాసుః**

---

**శ్లో॥ తాం ప్రణామాదరస్రస్త - జామ్బూనదవతంసకామ్।**
**అఙ్కమారోపయామాస - లజ్జమానామరున్ధతీ॥ 91**

**పదవిభాగము:-** తామ్, ప్రణామాదర...కామ్, అఙ్కమ్, ఆరోపయామాస, లజ్జమానామ్, అరున్ధతీ।

**అన్వయక్రమము:-** ప్రణామాదర...కాం లజ్జమానాం తామ్ అరున్ధతీ అఙ్కమ్ ఆరోపయామాస।

**ప్రతిపదార్థము:-** ప్రణామాదరస్రస్తజామ్బూనదవతంసకామ్ – నమస్కారమునందలి ఆదరముచే జాఱిన బంగారపు చెవుల కమ్మలు గలయట్టిదియు అగు, లజ్జమానామ్ – సిగ్గిల్లుచున్న, తామ్ – ఆ పార్వతీదేవిని, అరున్ధతీ – అరున్ధతీదేవి, అఙ్కమ్ –

తొడను, ఆరోపయామాస – ఎక్కించుకొనెను.

**తాత్పర్యము:–** నమస్కారమునందలి ఆదరముచే జాతిన చెవులకమ్మలుగల యట్టిదియు అగు సిగ్గిల్లుచున్న ఆ పార్వతీదేవిని అరున్ధతీదేవి తొడను ఎక్కించు కొనెను.

**పాఠాన్తరాలు:–** 1. ప్రణామాదర – ప్రణామాదవ

**విభక్తులు / క్రియలు:–** 1. ప్రణామాదర – వతంసకామ్ –**....వతంసకామ్**, ...వతంసకే, ...వతంసకాః; ఆకారాన్త స్త్రీలింగ ...వతంసకాశబ్దము. ద్వి.ఏ. 2. లజ్జమానామ్ – **లజ్జమానామ్,** లజ్జమానే, లజ్జమానాః; ఆకారాన్త స్త్రీలింగ లజ్జమానాశబ్దము. ద్వి.ఏ. 3. తామ్ – **తామ్**, తే, తాః ; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ద్వి.ఏ. 4. అరున్ధతీ – **అరున్ధతీ**, అరున్ధత్యౌ, అరున్ధత్యః; ఈకారాన్త స్త్రీలింగ అరున్ధతీశబ్దము. ప్ర.ఏ. 5. అఙ్కమ్ – **అఙ్కమ్**, అఙ్కౌ, అఙ్కాన్; అకారాన్త పుంలింగ అఙ్కశబ్దము. ద్వి.ఏ. 6. ఆరోపయామాస – క్రియ – ణిజన్తాత్ – లిట్.

**సమాసాలు:–**

1. ప్రణామాదరస్రస్తజామ్బూనదవతంసకామ్ – ప్రణామస్య ఆదరః (ష.త.) ప్రణామాదరః, తేన స్రస్తే (తృ.త.) ప్రణామాదరస్రస్తే। జామ్బూనదస్య వికారౌ, జామ్బూనదే, ప్రణామాదరస్రస్తే జామ్బూనదే వతంసకే యస్యాః (బహువ్రీహిః) సా, ప్రణామాదరస్రస్తజామ్బూనదవతంసకా, తామ్।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు**

1. **జామ్బూనదమ్** – (నపుం.)

ఎ) జామ్బూనద్యాం భవమితి, అణ్। స్వర్ణః।

బి) శ్లో॥ హేమ స్వర్ణం జాతరూపం సువర్ణ
భర్మం రుక్మం హాటకం శాతకుమ్భమ్।
గాంగేయం స్యాద్గైరికం భూరి చన్ద్రం
రాః కల్యాణం నిష్కమష్టాపదం చ । 173

శ్లో॥ **జామ్బూనదం** హిరణ్యం కనకమహారజతకాంచనాని స్యుః।
కార్తస్వరచామీకరకర్బురతపనీయనామాని॥ 174
– అని హలాయుధకోశము '25' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ మేరుమన్దరపర్వతస్థజమ్బూఫలానామత్యుచ్చనిపాతనవిశీర్ణానామ్ అనస్థిప్రాయాణామ్ ఇభకాయనిభానాం రసేన **జమ్బూనామ**నదీ ఇలావృతం వహతి। తస్యా ఉభయోస్తీరయోర్మృత్తికా జమ్బూ సేనానువిద్యమానా





వాయ్వర్కసంయోగవిపాకేన సదామరలోకాభరణం **జామ్బూనదం** నామస్వర్ణం భవతి' – ఇతి భాగవతే।

డి) శ్లో॥ నిర్వృత్త**జామ్బూనద**పట్టశోభే
న్యస్తం లలాటే తిలకం దధానః।
తేనైవ శూన్యాన్యరిసున్దరీణాం
ముఖాని స స్మేరముఖశ్చకార॥ – ర.వం. 18–44

"కనకపట్టముచేత అలంకరించబడిన, నుదుటిపైన దిద్దబడిన తిలకముతోను, మందహాసముచేయు ముఖముతోను శోభిల్లు ఆ రాజు అలవోకగా శత్రువులను సంహరించి..."

**క్రియాదర్శము:– ఆరోపయామాస** – ఆఙ్ ఉపసర్గ, 'రుహ – బీజజన్మని ప్రాదుర్భావే', ణిజన్తాత్, లిట్ – ప్రథమపురుషైకవచనాంతః।
**ఆరోపయామాస** – ఆరోపయామాసతుః– ఆరోపయామాసుః।

---

**శ్లో॥ తన్మాతరం చాశ్రుముఖీం – దుహితృస్నేహవిక్లబామ్।**
**వరస్యానన్యపూర్వస్య – విశోకామకరోద్గుణైః ॥ 92**

**పదవిభాగము:–** తన్మాతరమ్, చ, అశ్రుముఖీమ్, దుహితృస్నేహవిక్లబామ్, వరస్య, అనన్యపూర్వస్య, విశోకామ్, అకరోత్, గుణైః।

**అన్వయక్రమము:–** దుహితృస్నేహవిక్లబామ్ అశ్రుముఖీం తన్మాతరం చ అనన్య పూర్వస్య వరస్య గుణైః విశోకామ్ అకరోత్।

**ప్రతిపదార్థము:–** దుహితృస్నేహవిక్లబామ్ – కొమారితయందనురాగముచే పరవశమైనట్టియు, అశ్రుముఖీమ్ – ముఖంబున కన్నీరుగల, తన్మాతరమ్ చ – ఆ గౌరీదేవి తల్లియగు మేనాదేవిని, అనన్యపూర్వస్య – ఇంతకుపూర్వము ఇంకొకతె (భార్య) లేనట్టి, వరస్య – పెండ్లికుమారుడైన పరమశివునియొక్క, గుణైః – మృత్యుంజయాది గుణములచే, విశోకామ్ – శోకరహితురాలినిగా, అకరోత్ – చేసెను.

**తాత్పర్యము:–** కొమారితయందనురాగముచే పరవశమైనట్టియు, ముఖంబున కన్నీరుగల ఆ గౌరీదేవి తల్లియగు మేనాదేవిని – ఇంతకుపూర్వము ఇంకొకతె

(భార్య) లేనట్టి పెండ్లికుమారుడైన పరమశివునియొక్క మృత్యుంజయాది గుణములచే శోకరహితురాలిని చేసెను.

**పాఠాన్తరాలు:–**

1. దుహిత్ృ – దుహితుః 2. విక్లబామ్ – విహ్వలామ్

**విభక్తులు / క్రియలు:–** 1. దుహితృస్నేహవిక్లబామ్ – **...విక్లబామ్**, ...విక్లబే, ...విక్లబాః ; ఆకారాన్త స్త్రీలింగ...విక్లబాశబ్దము. ద్వి.ఏ. 2. అశ్రుముఖీమ్ – **అశ్రుముఖీమ్,** అశ్రుముఖ్యౌ, అశ్రుముఖీః ; ఈకారాన్త స్త్రీలింగ అశ్రుముఖీశబ్దము. ద్వి.ఏ. 3.తన్మాతరమ్ – **తన్మాతరమ్**, తన్మాతరౌ, తన్మాతౄః; ఋకారాన్త స్త్రీలింగ తన్మాతృశబ్దము. ద్వి.ఏ. 4. అనన్యపూర్వస్య – **అనన్యపూర్వస్య,** అనన్యపూర్వయోః, అనన్యపూర్వాణామ్; అకారాన్త పుంలింగ అనన్యపూర్వశబ్దము. ష.ఏ 5. వరస్య – **వరస్య,** వరయోః, వరాణామ్; అకారాన్త పుంలింగ వరశబ్దము. ష.ఏ. 6. గుణైః – గుణేన, గుణాభ్యామ్, **గుణైః;** అకారాన్త పుంలింగ గుణశబ్దము. తృ.బ. 7. విశోకామ్ – **విశోకామ్,** విశోకే, విశోకాః; ఆకారాన్త స్త్రీలింగ విశోకాశబ్దము. ద్వి.ఏ. 8. అకరోత్ – క్రియ.

**సమాసాలు:–**

1. తన్మాతరమ్ – తస్యా మాతా (ష.త.) తన్మాతా, తామ్।
2. అశ్రుముఖీమ్ – అశ్రూణి ముఖే యస్యాః (బహువ్రీహిః) సా, అశ్రుముఖీ, తామ్।
3. దుహితృస్నేహవిక్లబామ్ – దుహితుః స్నేహః (ష.త.) దుహితృస్నేహః, దుహితృస్నేహేన, విక్లబా (తృ.త), దుహితృస్నేహవిక్లబా, తామ్।
4. అనన్యపూర్వస్య – అన్యా పూర్వం విద్యతే యస్య (బహువ్రీహిః) సః, అనన్యపూర్వః తస్య।

**సంధులు:–**

1. తత్ + మాతరమ్ – తన్మాతరమ్ – అనునాసికసన్ధిః।
2. చ + అశ్రుముఖీమ్ – చాశ్రుముఖీమ్ – సవర్ణదీర్ఘసన్ధిః।
3. వరస్య + అనన్యపూర్వస్య – వరస్యానన్యపూర్వస్య – సవర్ణదీర్ఘసన్ధిః।
4. అకరోత్ + గుణైః – అకరోద్గుణైః – జశ్త్వసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. స్నేహః – (పుం.)**

ఎ) స్నిహ్ + ఘఞ్। మైత్రీ ప్రేమా।

బి) శ్లో॥ సఖ్యం సాప్తపదీనం సౌహార్దం సౌహృదం తథా **స్నేహః**।





మైత్రీ ప్రీతిరజర్యం సభాజనం సఙ్గతం ప్రోక్తమ్॥ 706

–అని హలాయుధకోశము ‘10’ నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ దర్శనే స్పర్శనే వాపి శ్రవణే భాషణే - పి వా।
యత్ర ద్రవత్యన్తరఙ్గం స **స్నేహ** ఇతి కథ్యతే।

శ్లో॥ యత్ర **స్నేహో** దుఃఖస్య భాజనమ్
స్నేహమూలాని దుఃఖాని తస్మింస్త్యక్తే మహత్సుఖమ్।

– ఇతి గారుడే –113/59

**క్రియాదర్శము:– అకరోత్** – ‘డుకృఞ్ – కరణే’, లఙ్ – ప్రథమపురుషైకవచనాంతః **అకరోత్** – అకురుతామ్ – అకుర్వన్.

–––

**అవతారికా:–** వివాహతిథిం నిశ్చిత్య మునీనాం స్వస్థానగమనమ్। వివాహలగ్నతిథిని – నిర్ణయించి మునులు స్వస్థానమున కేగుట.

**శ్లో॥ వైవాహికీం తిథిం పృష్టా–స్తత్క్షణం హరబన్ధునా।**
**తే త్ర్యహాదూర్ధ్వమాఖ్యాయ – చేరుశ్చీరపరిగ్రహాః॥ 93**

**పదవిభాగము:–** వైవాహికీమ్, తిథిమ్, పృష్టాః, తత్క్షణమ్, హరబన్ధునా, తే, త్ర్యహాద్, ఊర్ధ్వమ్, ఆఖ్యాయ, చేరుః, చీరపరిగ్రహాః।

**అన్వయక్రమము:–** చీరపరిగ్రహాః తే తత్క్షణమ్ హరబన్ధునా వైవాహికీం తిథిం పృష్టాః (సన్తః) త్ర్యహాద్ ఊర్ధ్వమ్ ఆఖ్యాయ చేరుః।

**ప్రతిపదార్థము:–** చీరపరిగ్రహాః – నారచీరెలు బట్టలుగాగల, తే – ఆ మునులు, తత్క్షణమ్ – అప్పుడే, హరబన్ధునా – హిమవంతునిచేత, వైవాహికీమ్ – పెండ్లి ముహూర్తమైన, తిథిమ్ – తిథిని, పృష్టాః – అడుగబడినవారై, త్ర్యహాద్ – మూడుదినములకంటె, ఊర్ధ్వమ్ – మీద, (ఇతి) ఆఖ్యాయ – (అని) చెప్పి, చేరుః – వెడలిరి.

**తాత్పర్యము:–** నారచీరెలు బట్టలుగాగల ఆ మునులు అప్పుడే హిమవంతునిచేత పెండ్లి ముహూర్తమైన తిథిని అడుగబడినవారై, ‘మూడు దినములకంటె మీద’ అని చెప్పివెడలిరి.

**పాఠాన్తరాలు:–** 1. తే – తామ్ 2. చేరుః – చేలుః

**విభక్తులు / క్రియలు:–** 1. చీరపరిగ్రహాః – చీరపరిగ్రహః, చీరపరిగ్రహౌ, **చీరపరిగ్రహాః** ; అకారాన్త పుంలింగ చీరపరిగ్రహశబ్దము. ప్ర.బ. 2. తే – సః, తౌ, **తే**; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.బ. 3. తత్క్షణమ్ – **తత్క్షణమ్**, తత్క్షణౌ, తత్క్షణాన్; అకారాన్త పుంలింగ తత్క్షణశబ్దము. ద్వి.ఏ. 4. హరబన్ధునా – **హరబన్ధునా**, హరబన్ధుభ్యామ్, హరబన్ధుభిః; ఉకారాన్త పుంలింగ హరబన్ధుశబ్దము. తృ.ఏ. 5. వైవాహికీమ్ – **వైవాహికీమ్**, వైవాహిక్యౌ, వైవాహికీః; ఈకారాన్త స్త్రీలింగ వైవాహికీశబ్దము. ద్వి.ఏ. 6. తిథిమ్ – **తిథిమ్,** తిథీ, తిథీః; ఇకారాన్త స్త్రీలింగ తిథిశబ్దము. ద్వి.ఏ. 7. పృష్టాః – పృష్టః, పృష్టౌ, **పృష్టాః;** అకారాన్త పుంలింగ పృష్టశబ్దము. ప్ర.బ. 8. త్ర్యహాద్ – త్ర్యహాద్, త్ర్యహాభ్యామ్, త్ర్యహేభ్యః; అకారాన్త పుంలింగ త్ర్యహశబ్దము. పం.ఏ. 9. ఊర్ధ్వమ్ – **ఊర్ధ్వమ్**, ఊర్ధ్వే, ఊర్ధ్వాని; అకారాన్త నపుంసకలింగ ఊర్ధ్వశబ్దము. ప్ర.ఏ. 10. ఆఖ్యాయ – అవ్యయము 11. చేరుః – క్రియ.

**సమాసాలు:–**

1. చీరపరిగ్రహాః – చీరాణి ఏవ పరిగ్రహాః యేషాం (బహువ్రీహిః) తే।
2. తత్క్షణమ్ – సః క్షణః యస్మిన్కర్మణి తద్యథా తత్క్షణమ్।
3. వైవాహికీమ్ – వివాహస్య ఇయం వైవాహికీ, తామ్।
4. త్ర్యహాద్ – త్రయాణాం అహ్నాం సమాహారః త్ర్యహః (ద్విగు) తస్మాత్।
5. హరబన్ధునా – హరస్య బన్ధుః (ష.త.) హరబన్ధుః, తేన।

**సంధులు:–**

1. పృష్టాః + తత్క్షణమ్ – పృష్టాస్తత్క్షణమ్ – విసర్గసన్ధిః।
2. త్ర్యహాత్ + ఊర్ధ్వమ్ – త్ర్యహాదూర్ధ్వమ్ – జశ్త్వసన్ధిః।
3. చేరుః + చీరపరిగ్రహాః – చేరుశ్చీరపరిగ్రహాః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1.** త్ర్యహాః

ఎ) త్ర్యహాత్ – త్రయాణామహ్నాం సమాహారః త్ర్యహః, తస్మాత్ త్ర్యహాత్।

బి) 'తద్ధితార్థోత్తరపదసమాహారేచ' ఇతి సమాసః।

సి) 'రాజా – హః సఖిభ్యష్టచ్' ఇతి టచ్ప్రత్యయః।

డి) ద్విగుత్వాదేకవచనమ్.

ఇ) 'రాత్రాహ్నాహాః పుంసి' ఇతి పుంల్లిగతా। (సూ. 2–4–39) – ఇతి తత్పురుషప్రకరణే

ఎఫ్) 'త్ర్యహాత్ పుంసా స్త్రియః'। సప్తమీ పంచమ్యౌ కారకమధ్యే (2–3–7)



శ్లో॥ సంవత్సరేణ యాన్త్యేవ దుఃఖశీలా అపి స్త్రియః।
మార్దవం ప్రార్థితాః పుంసాం **త్ర్యహాద్ధ్రో**గ్ర్యో – పి సత్ర్త్రియః।

**క్రియాదర్శము:–**

**1. చేరుః** – 'చర – గతిభక్షణయోః' (వెళ్లుట, తినుట) లిట్ – ప్రథమపురుష బహువచనాంతః। సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్.

చచార – చేరతుః – **చేరుః**

---

**శ్లో॥ తే హిమాలయమామన్త్ర్య – పునః ప్రాప్య చ శూలినమ్।**
**సిద్ధం చాస్మై నివేద్యార్థం – తద్విసృష్టాః ఖముద్యయుః॥ 94**

**పదవిభాగము:–** తే, హిమాలయమ్, ఆమన్త్ర్య, పునః, ప్రాప్య, చ, శూలినమ్, సిద్ధమ్, చ, అస్మై, నివేద్య, అర్థమ్, తద్విసృష్టాః, ఖమ్, ఉద్యయుః।

**అన్వయక్రమము:–** తే హిమాలయమ్ ఆమన్త్ర్య, పునః శూలినం ప్రాప్య, సిద్ధమ్ అర్థమ్, అస్మై నివేద్య చ, తద్విసృష్టాః ఖమ్ ఉద్యయుః।

**ప్రతిపదార్థము:–** తే – ఆ మునులు, హిమాలయమ్ – హిమవంతునికడ, ఆమన్త్ర్య – సెలవుగైకొని, పునః – తిరిగి, శూలినమ్ – పరమశివుని, ప్రాప్య – చేరి, సిద్ధమ్ – సమకూడిన, అర్థమ్ – కార్యమును, అస్మై – ఈయనకొఱకు, నివేద్య చ – తెల్పి, తద్విసృష్టాః – ఆయనచే విడువబడినవారై, ఖమ్ – ఆకాశమునుగూర్చి, ఉద్యయుః – ఎగిరిరి.

**తాత్పర్యము:–** ఆ మునులు హిమవంతునికడ సెలవుగైకొని తిరిగి పరమశివుని చేరి సమకూడిన కార్యమును ఈయనకొఱకు తెల్పి ఆయనచే విడువబడినవారై ఆకాశమునుగూర్చి ఎగిరిరి.

**పాఠాన్తరాలు:–** 1. ప్రాప్య – ప్రేక్ష్య 2. చాస్మై – తస్మై

**విభక్తులు / క్రియలు:–** 1. తే – సః, తౌ, **తే**; దకారాన్త తచ్ఛబ్దము. ప్ర.బ. 2. హిమాలయమ్ – **హిమాలయమ్,** హిమాలయౌ, హిమాలయాన్; అకారాన్త పుంలింగ హిమాలయశబ్దము. ద్వి.ఏ. 3. ఆమన్త్ర్య – అవ్యయము 4. పునః, చ – అవ్యయాలు 5. శూలినమ్ – **శూలినమ్**, శూలినౌ, శూలినః; అకారాన్త పుంలింగ శూలిన్శబ్దము. ద్వి.ఏ. 6. ప్రాప్య – అవ్యయము 7. సిద్ధమ్ – **సిద్ధమ్**, సిద్ధే, సిద్ధాని; అకారాన్త నపుంసకలింగ సిద్ధశబ్దము. ద్వి.ఏ. 8. అర్థమ్ – **అర్థమ్,** అర్థే,

అర్థాని; అకారాన్త నపుంసకలింగ అర్థశబ్దము. ద్వి.ఏ. 9. అస్మై – **అస్మై**, ఆభ్యామ్, ఏభ్యః మకారాన్త పుంలింగ 'ఇదమ్'శబ్దము. చ.ఏ. 10. నివేద్య – అవ్యయము 11. తద్విసృష్టాః – తద్విసృష్టః, తద్విసృష్టౌ, **తద్విసృష్టాః**; అకారాన్త పుంలింగ తద్విసృష్టశబ్దము. ప్ర.బ, 12. ఖమ్ – **ఖమ్**, ఖే, ఖాని అకారాన్త నపుంసకలింగ 'ఖమ్'శబ్దము. ద్వి.బ. 13. ఉద్యయుః – క్రియ

**సమాసాలు –**

1. హిమాలయమ్ – హిమస్య ఆలయః హిమాలయః (ష.త.), తమ్.
2. తద్విసృష్టాః – తేన విసృష్టాః (తృ.త.)।

**సంధులు–**

1. హిమ + ఆలయమ్ – హిమాలయమ్ – సవర్ణదీర్ఘసన్ధిః।
2. ప్ర + ఆప్య – ప్రాప్య – సవర్ణదీర్ఘసన్ధిః।
3. చ + అస్మై – చాస్మై – సవర్ణదీర్ఘసన్ధిః।
4. నివేద్య + అర్థమ్ – నివేద్యార్థమ్ – సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవృత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. ఖమ్ (నపుం.)**

ఎ) ఖర్వతి మనో – స్మిన్, ఖన్యతే క్షుభ్యతే మనో – నేన వా। ఖర్వ – గతౌ, ఖన అవదారణే వా అన్యేభ్యో – పీతి డ। ఆకాశమ్।

బి) శ్లో॥ '**ఖం** సన్నివేశయత్ **ఖేషు** చేష్టనస్పర్శనే – నిలమ్'

– ఇతి మనుః – 12 –120

సి) శ్లో॥ నభో మరుద్వర్త్మ వియద్విహాయ –
స్తారాపథః పుష్కరమన్తరిక్షమ్।
వ్యోమామ్బరం విష్ణుపదం చ **ఖం** ద్యౌ –
ర్విహాయసా స్యాద్గగనం తథా ద్యుః॥ 137
– అని హలాయుధకోశము '15' నామములను పేర్కొన్నది.

డి) శ్లో॥ మన్దంమన్దం నుదతి...
సేవిష్యన్తే నయనసుభగం **ఖే** భవన్తం బలాకాః ॥ 9

'మేఘదూతమ్' – మృణాళినీవ్యాఖ్య – చూడగలరు.

ఇ) కుమారసంభవమహాకావ్యమ్ – 3–74 శ్లోకమును చూడగలరు.

**క్రియాదర్శము:– ఉద్యయుః** – ఉత్, 'యా – ప్రాపణే' (పొందుట), సకర్మకమ్,





అనిట్, పరస్మైపదీ, అదాదిప్రకరణమ్ (2), లిట్ – ప్రథమపురుషబహువచనాంతః

ఉద్యయౌ – ఉద్యయతుః – **ఉద్యయుః**।

---

**అవతారికా:–** భగవాన్ పశుపతిః త్ర్యహమాత్రవిలమ్బమపి సోఢుం న శశాక తదౌత్సుక్యాదిత్యాహ ।

శివభగవానుడు ఆమెయందలి వేడుకచే మూడురోజులైనను ఆలస్యమునకు ఓర్చుటకు శక్తిలేని వాడాయెనని చెప్పుచున్నాడు.

**శ్లో॥ పశుపతిరపి తాన్యహాని కృచ్ఛ్రా**
**దగమయదద్రిసుతాసమాగమోత్కః।**
**కమపరమవశం న విప్రకుర్యు**
**ర్విభుమపి తం యదమీ స్పృశన్తి భావాః ॥ 95**

**పదవిభాగము:–** పశుపతిః, అపి, తాని, అహాని, కృచ్ఛ్రాత్, అగమయత్, అద్రిసుతాసమాగమోత్కః, కమ్, అపరమ్, అవశమ్, న, విప్రకుర్యుః, విభుమ్, అపి, తమ్, యత్, అమీ, స్పృశన్తి, భావాః।

**అన్వయక్రమము:–** అద్రిసుతాసమాగమోత్కః పశుపతిః అపి తాని అహాని కృచ్ఛ్రాత్ అగమయత్। అమీ భావాః అవశమ్ అపరం కం న విప్రకుర్యుః, యత్ విభుం తమ్ అపి స్పృశన్తి।

**ప్రతిపదార్థము:–** అద్రిసుతాసమాగమోత్కః – పార్వతీదేవి సమాగమమందుగల ఉత్కంఠ కలిగిన, పశుపతిః అపి – పరమశివుడును, తాని – ఆ, అహాని – దినములను, కృచ్ఛ్రాత్ – కష్టముమీద, అగమయత్ – కడపెను, అమీ భావాః – ఔత్సుక్యాది ఈ భావములు, అవశమ్ – ఇంద్రియపరతంత్రుడైన, కమ్ అపరమ్ – ఏ అన్యుని, న విప్రకుర్యుః – బాధింపవు, యత్ – ఎందువలన, తమ్ విభుమ్ అపి – ఆ పరమశివుని, స్పృశన్తి – తాకినవో.

**పాఠాన్తరాలు:–** పరమశివుడు ఆ (3) దినములను కష్టముమీద గడపెను. ఔత్సుక్యాది భావములు ఇంద్రియపరతంత్రుడైన ఏ అన్యుని బాధింపవు. ఎందువలన ఆ పరమశివుని తాకినవో.

**విభక్తులు / క్రియలు: –** 1. పశుపతిః – **పశుపతిః**, పశుపతీ, పశుపతయః; ఇకారాన్త పుంలింగ పశుపతిశబ్దము. ప్ర.ఏ. 2. తాని – తత్, తే, **తాని**; దకారాన్త నపుంసకలింగ తచ్ఛబ్దము. ప్ర.బ. 3. అహాని – అహః, అహ్నీ / అహనీ, **అహాని**; నకారాన్త నపుంసకలింగ 'అహన్'శబ్దము. ప్ర.బ. 4. కృచ్ఛ్రాత్ – **కృచ్ఛ్రాత్**, కృచ్ఛ్రాభ్యామ్, కృచ్ఛ్రేభ్యః; అకారాన్త నపుంసకలింగ కృచ్ఛ్రశబ్దము. పం.ఏ. 5. అగమయత్ – క్రియ 6. అమీ – అసౌ, అమూ, **అమీ**; సకారాన్త పుంలింగ 'అద'శ్శబ్దము. ప్ర.బ. 7. భావాః – భావః, భావౌ, **భావాః**; అకారాన్త పుంలింగ 'భావ'శబ్దము. ప్ర.బ. 8. అవశమ్ – **అవశమ్,** అవశౌ, అవశాన్; అకారాన్త పుంలింగ అవశశబ్దము. ద్వి.ఏ. 9. అపరమ్ – **అపరమ్,** అపరౌ, అపరాన్; అకారాన్త పుంలింగ అపరశబ్దము. ద్వి.ఏ. 10. కమ్ – **కమ్,** కౌ, కాన్; మకారాన్త పుంలింగ 'కిమ్'శబ్దము. ద్వి.ఏ. 11.న, అపి, యత్ – అవ్యయాలు 12. విప్రకుర్యుః – క్రియ 13. విభుమ్ – **విభుమ్**, విభూ, విభూన్; ఉకారాన్త పుంలింగ విభుశబ్దము, ద్వి.ఏ. 14. తమ్ – **తమ్,** తౌ, తాన్; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ద్వి.ఏ. 15. స్పృశన్తి – క్రియ

**సమాసాలు / విగ్రహవాక్యాలు: –**

1. పశుపతిః – పశూనామ్ పతిః (ష.త.)
2. అద్రిసుతాసమాగమోత్కః – అద్రేః సుతా (ష.త.) అద్రిసుతా, తయా సమాగమః (తృ.త.) అద్రిసుతాసమాగమః, అద్రిసుతాసమాగమే ఉత్కః, (స.త.)।
3. అవశమ్ – వశే న వర్తతే ఇత్యవశః, తమ్।

**సంధులు: –**

1. పశుపతిః + అపి – పశుపతిరపి – విసర్గసన్ధిః।
2. తాని + అహాని – తాన్యహాని – యణాదేశసన్ధిః।
3. కృచ్ఛ్రాత్ + అగమయత్ – కృచ్ఛ్రాదగమయత్ – జశ్త్వసన్ధిః।
4. విప్రకుర్యుః + విభుమ్ – విప్రకుర్యుర్విభుమ్ – విసర్గసన్ధిః।
5. యత్ + అమీ – యదమీ – జశ్త్వసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు: –**

**1. పశుపతిః –**

ఎ) పశూనాం స్థావరజంగమానాం ప్రాణమాత్రస్య వా పతిః స్వామీ ప్రభుః।

బి) శ్లో॥ బ్రహ్మాద్యాః స్థావరాన్తాశ్చ పశవః పరికీర్తితాః।
తేషాం పతిర్మహాదేవః స్మృతః **పశుపతిః** శ్రుతౌ॥ – ఇతి చిన్తామణిః

సి) శ్లో॥ 'అహం చ సర్వవిద్యానాం పతిరాద్యః సనాతనః।





అహం వై పతిభావేన పశుమధ్యే వ్యవస్థితః।
అతః **పశుపతిర్నామ** త్వం లోకే ఖ్యాతిమేష్యసి।' – ఇతి వరాహపురాణే।

డి) శ్లో॥ 'నేపాలే చ **పశుపతిః** కేదారే పరమేశ్వరః' – ఇతి మహాలింగేశ్వరతన్త్రే।

ఇ) శ్లో॥ ఈశనఃశశిశేఖరః**పశుపతిః** శూలీ శివః శఙ్కరః
శర్వః శమ్భురుమాపతిశ్చ గిరిశః శ్రీకణ్ఠ ఉగ్రో హరః।
సర్వజ్ఞస్త్రిపురాన్తకస్త్రిణయనో రుద్రః కపర్దీ భవో
భూతేశః పరమేశ్వరో – ంధకరిపుర్దక్షాధ్వరధ్వంసకృత్॥ 11

శ్లో॥ స్థాణుః స్రష్టా ధూర్జటిర్వామదేవః
కామధ్వంసీ వ్యోమకేశః కపాలీ।
నీలగ్రీవో వహ్నిరేతా పినాకీ
భీమో భర్గః కృత్తివాసా వృషాఙ్కః॥ 12

శ్లో॥ అహిర్బుధ్నో విరూపాక్షః శిపివిష్టో గణాధిపః।
గంగాధరో మహాదేవో మృడః స్యాన్నీలలోహితః॥ 13
– అని హలాయుధకోశము '45' నామములను పేర్కొన్నది.

ఎఫ్) శ్లో॥ 'బ్రహ్మాదయో జగతి జీవగణాస్తృణాన్తాః
సర్వే విమోహితధియః పశవః ప్రదిష్టాః।
తేషామభూదధిపతిః శివ ఏక ఏవ
తస్మాద్విధుః **పశుపతిం** పరమేశ్వరం తమ్।' – ఇతి శైవాగమే।

**అలంకారాలు: –**

ఎ) అత్ర విభువికారసమర్థనాదర్థాదితరజనవికారః కైముతికన్యాయాద్ ఆపతతీత్యర్థాపత్తిరలంకారః। యథోక్తం సాహిత్యదర్పణే –
'దణ్డాపూపికయా – న్యా – ర్థాగమో – ర్థాపతిరిష్యతే' ఇతి।

బి) ఔత్సుక్యప్రతిపాదనేన తు వక్ష్యమాణానాం సంభోగానాం ప్రాణభూతో – –భిలాష **విప్రలంభో** దర్శిత ఇత్యవగన్తవ్యమ్ – ఇతి 'వివరణమ్' వ్యాఖ్యాయామ్

**ఛందస్సు :–** పుష్పితాగ్రావృత్తమితి భద్రమ్।

**క్రియాదర్శము: –**

**1. అగమయత్** – 'గమ్లృ – గతౌ' (వెళ్లుట). సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్ (1), లఙ్ – ప్రథమపురుషైకవచనాంతః। ణిజన్తాత్.

